# 'గాజురాళ్లు' పై సమీక్షలు

**నవంబర్ 'చతుర'లో ప్రచురితమైన హెూతా పద్మినీదేవి నవల 'గాజురాళ్ళు'పై మా కందిన ఉత్తమ సమీక్షలు.**

## పురుషాహంకారానికి సున్నితమైన వాత

*(ప్రథమ బహుమతి రూ.100/- పొందిన సమీక్ష)*

'గాజురాళ్లు' నవలలో కథ సహజంగా, చిత్రణ వాస్తవికంగా వుండి ఆసక్తిగా చదివించేదిగా వుంది. ఆర్జిస్తున్నప్పటికీ స్త్రీకి ఆర్థిక స్వేచ్ఛ లేకపోవడం, కుటుంబ ఆదాయంపై మగవాడి గుత్తపెత్తనం, వీటికి మూలకారణమైన పురుషాహంకారం ఎన్ని అనర్థాలకు దారితీస్తోందో, కుటుంబ వ్యవస్థనే ఎలా దెబ్బతీస్తోందో రచయిత్రి ఎంతో సున్నితంగా మనసుకు హత్తుకునేలా వర్ణించి చూపారు. జీతం భర్త చేతుల్లోపోసి ప్రతి చిన్న అవసరానికీ తిరిగి ప్రాధేయపడవలసి రావడం, భర్త రిటైరయితే సతీసహగమనం లాగా భార్య ఉద్యోగం విరమించడం, పప్పులు, ఉప్పులు దొంగతనంగా అమ్మి పిల్లల్ని సినిమాకు తీసుకెళ్లాల్సిన దుస్థితి, భార్య ఉద్యోగం చేస్తానంటే అది భర్త అధికారానికి సవాలుగా నామోషీగా భావించడం, తన అశ్రద్ధవల్ల తల్లికి కళ్లజోడు లేక విసుగు చెందుతుంటే భార్య ఆ అవసరాన్ని తీర్చడం కూడా అత్తగార్ని వల్లో వేసుకుని తన అధికారాన్ని ఎదిరించడంగా భర్త భావించడం, భార్యను వుద్యోగం మాన్పించడానికి జాగ్రత్తలు పాటిస్తున్నట్టే నటిస్తూ తెలివిగా గర్భవతిని చేయడంద్వారా మాన్పించాలని చూడటం, ఇలా స్త్రీ బతుకులో బ్రహ్మజెముడులా అల్లుకుపోయినవన్నీ పురుషాహంకారపు విషఫలాలే. వీటిని గుర్తించేలా చేసి, అధిగమించాలనే స్పృహకు దోహదం కల్పించడమే ఈ నవలను మంచి రచనగా నిలబెడుతుంది.

ఎన్ని అడ్డంకులు ఎదురైనా నిబ్బరంగా వుండి, వుద్యోగం చేయాలనే లక్ష్యాన్ని సాధించిన శారద పట్టుదల ఎంతైనా మెచ్చుకోదగింది. అయితే, చాకిరీ అంతా నెత్తిన వేసుకుని, భర్త అత్యాచారాలకీ దుర్మార్గాలకీ పల్లెత్తు మాటైనా అనకుండా లొంగిపోతూ వుద్యోగం చేసిందేతప్ప, ఆయన ఎత్తులకు వ్యతిరేకంగా పోరాడ్డానికి ప్రయత్నించలేదు. చిత్రణలో ఈ లోపం, ఆర్థిక స్వేచ్ఛ కోసం ప్రయత్నించే స్త్రీలకు తప్పుడు సందేశం యిచ్చే ప్రమాదం వుంది.

విలాసాల మోజులో పడి కనీస ఆత్మగౌరవం కూడా వదులుకునే సునీత వంటివారు స్త్రీ స్వేచ్ఛకే హాని చేసే ప్రమాదకరమైన వుదాహరణలు. రాధవంటి అమాయకులు, మందబుద్ధులు సుఖాల ఎరలకు బలియై తప్పుదోవ పట్టకుండా కుటుంబంలో స్త్రీల, పిల్లల, వృద్ధుల అవసరాలు సవ్యంగా తీరేలా వారి భద్రతకు హామీ వుండేలా కుటుంబ ఆర్థిక వ్యవహారాలు సరళంగా తీర్చిదిద్దాలి. లేకపోతే సమాజానికి పునాదిరాయి అయిన కుటుంబం అస్తవ్యస్తమౌతుంది. నవలలో ప్రస్తావించిన సమస్యలు ఏవీ వ్యక్తుల దుష్ట స్వభావంవల్లనో వారి తెలివి తక్కువతనం



వల్లనో పుట్టినవికావు. ఇవి మన సమాజాన్ని పట్టి పీడిస్తున్న జబ్బుకు పైపై సూచికలు మాత్రమే. ఈ రుగ్మతల గురించి ఆలోచనలు రేపే విధంగా చక్కని కథనంతో చిత్రించిన రచయిత్రి అభినందనీయురాలు.

-విజయకుమారి
మద్రాస్-600 017

## సామాజిక దృక్పథం

*(ద్వితీయ బహుమతి రూ.75/- పొందిన సమీక్ష)*

'గాజురాళ్లు' గుండెను పిండివేసే సామాజిక దృక్పథం కల్గిన నవల. ఈ సమాజంలో ఎక్కువగా మానసిక సంఘర్షణలకు లోన య్యేది మధ్యతరగతి ప్రజానీకమే. అందులో ను సహజంగా ఉండే కట్టుబాట్లతో బావిలో కప్పలా బతికే యువతుల పరిస్థితి మరింత దయనీయం. హెూతా పద్మినీదేవిగారు శా రద, సునీత, రాధలద్వారా సగటు యువ తుల అంతరంగాన్ని హృద్యంగా వివిధ కోణాల్లో కొలిచారు. అమ్మాయికి పెళ్లి అనేది ఒక ముఖ్యమైన బాధ్యత అని తల్లిదండ్రులు అనుకున్నట్లయితే తాము చూసే అబ్బాయిల బాహ్య లక్షణాలు, ఆర్థిక స్థితే కాకుండా వారి అంతరంగాలు కూడా జత కుదరాలని అను కున్నప్పుడే నేటి వివాహ వ్యవస్థ విజయ వంతమౌతుంది. పెళ్లిచూపుల్లో మాట్లాడుకు నే ఆ పొడిమాటలు నూరేళ్ల సహజీవనానికి ఏమాత్రం సరిపోవు. పూర్వం స్త్రీ పురుషుల సహజ లక్షణాల దృష్ట్యా ఉద్యోగం పురుష లక్షణం అని నిర్వచించినా, ధరలతోపాటు ఆశలు కూడా ఆకాశాన్నంటే ఈ రోజుల్లో స్త్రీ ఇల్లు వదలక తప్పనిసరి అవుతోంది. ఆర్థిక స్వాతంత్ర్యం ఆత్మ విశ్వాసానికి నాంది పల్కి, మానసిక సంఘర్షణలను చాలావరకు దూరం చేస్తుంది. ఈ రకంగా మానసికారో గ్యానికి, ఆర్థిక స్వాతంత్ర్యానికి చాలా దగ్గర సంబంధముందని ఈ నవలద్వారా సోదాహ రణంగా తెల్సుకోవచ్చు. అయితే ఆడది తననుతాను అన్ని విషయాలలో మె రుగుపరచుకోవాలంటే స్వతంత్రంగా పనిచే యడం, ఆలోచించడం ముఖ్యమని చెపుతూ నవల ముగించడం చక్కని అనుభూతిని మిగిల్చింది.

-టి.వి.రామదాస్
నాచారం

## సగం గాజురాయే

*(తృతీయ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

వాస్తవానికి చాలా దగ్గరకు వెళ్లి ఊహల ఊయల్లో ఆకాశాన్నందుకుని మళ్లీ వెనక్కు వచ్చినా గాజురాళ్లు కొంచెం కల్పనకు దగ్గర గానే వుంది.

ప్రాక్టికల్‌గా ఆలోచించి జీవితాన్ని ఓ సమ రంలా స్వీకరించి ముందుకు సాగే శారద ఆలోచనా విధానం ఆదర్శప్రాయం. ప్రస్తుత సమాజంలో పుట్టి పెరుగుతున్న ప్రతి మధ్య తరగతి అమ్మాయీ ఎంత కాదనుకున్నా జీవితాన్ని ప్రాక్టికల్‌గా ఆలోచిస్తుందే తప్ప మరీ రాధలా కలల ఊహల్లో తేలిపోయి ఆశల పేకమేడలు కట్టుకునే వాళ్లు చాలా తక్కువ. సునీతలాంటి వాళ్లు మంచి చదువూ డిగ్రీలూ ఉన్నా ఉద్యోగం చే సేందుకు ముందుకు రాని అమ్మాయిలు ఈ సమాజంలో కోకొల్లలు. చివరకు ఈ నవల చదివాకైనా ఎందుకు ఉద్యోగం చెయ్యాలో తెలుసుకోవలసిన గుణపాఠం అలాంటివాళ్లు నేర్చుకుంటారనే అనుకుందాం.

ఇకపోతే కథాకథనం బాగున్నా కథంతా వన్ సైడెడ్‌గా సాగింది. ఎంతసేపూ ఆర్థిక స్వాతంత్ర్యం, ఉద్యోగమే తప్ప మరో మాట లేదు. ఒక రకమైన స్త్రీవాదం తొంగిచూ స్తుందీ నవలలో. సమాజంలో కేవలం ఆనంద్‌లూ, రాఘవలూ, రమేష్‌లే లేరు. ఇలాంటి మనస్తత్వం ఉన్న మగవాళ్ల శాతం పదికి మించదు. ఏరికోరి వీళ్లందరినీ ఓ దారంలో గుదిగుచ్చి దండకట్టినట్టు చూ




పించారు రచయిత్రి. అంత బలంగా ఊహల కి దాసోహం అయిన రాధ సుధీర్ మనస్త త్వం ఊహించలేకపోవడం చిత్రంగా ఉంది. అదే చిత్రంగా ఉంటే ఓ చిన్న సంఘటన 'లాస్య మరణం' ఆమెను పూర్తిగా మార్చివె య్యడం ఇంకా వింతగా వుంది. కథంతా సాఫీగా సాగినా ముగింపుకి పెద్ద బలం రాలేదు. ముగింపు కొంచెం పేలవంగా వుంది. చదివించే ఈ నవల మరికొంచెం మనసుకు హత్తుకునేలా, మరికొంత వాస్త వంగా, మరింత బలంగా ఉండే సంఘటన లతో ముగిస్తే బాగుండేది.

-స్వాతి
హైదరాబాద్-7

## పరిష్కారం?

*(నాలుగవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

ప్రస్తుత సమాజంలో స్త్రీలు తమ వైవాహిక జీవితంలో ఎదుర్కొంటున్న సమస్యలను హెూతా పద్మినీదేవిగారు వివిధ కోణాలలో చిత్రీకరించిన తీరు పరిష్కారయోగ్యంగా ఉంది.

వైవాహిక బంధం అత్యంత ఆవశ్యకర మైన శారీరకమైనబంధమే కాక మరీ చెప్పా లంటే మానసికోల్లాసానికి అత్యంత ప్రాము ఖ్యత వహిస్తున్న అనుబంధం. భారత సమా జంలో నేడు పాతతరం, కొత్తతరం ఒకరినొక రు అర్థం చేసుకుంటూ మారుతున్న పరిస్థి తుల కనుగుణంగా తమభావాల సరళిలో మార్పులు చేసుకొన్ననాడే ఈ బంధం పరిప క్వమౌతుంది, లేకుంటే అపోహలు, అనుమా నాలు చోటు చేసుకొని నిరర్థక మౌతుంది అని ఈ నవలద్వారా మనకవగతమయ్యేటట్లు విశదీకరించారు.

ఈ నవలల్లోని పాత్రలు రంగుల ప్ర పంచంలో ఊగిసలాడే రాధ, వాస్తవిక జీవితా న్ని హేతుబద్ధంగా ఆలోచించే శారద, పరిస్థి తులకు తల ఒగ్గి ఎదిరించలేని బలహీనత లతో బతుకు దుర్భరం ‌సుకొని నిస్సహా యంగా మిగిలిన సునీతలు కొత్తతరానికి ప్రాతినిధ్యం వహిస్తున్నారు. పెరుగుతున్న అవసరాలను గమనించి ఆర్థికోన్నతికోసం కోడలు శారద చేసిన ప్రయత్నాన్ని హర్షించిన కామేశ్వరమ్మ పాతతరం మనిషే అయినా ఈ తరానికీ ప్రాతినిధ్యం వహిస్తు న్నారు. ఈ పాత్రలు మలచినతీరు నిండుగా వుంది.

-జి.చంద్రమోహన్
సూర్యాపేట-508 213

## మనుగడకోసం పోరాటం

*(అయిదవ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

ప్రస్తుతం పురుషాధిక్య సమాజంలో అడుగ డుగున స్త్రీలు అనుభవిస్తున్న శారీరక, మాన సిక నరకయాతనలను 'గాజురాళ్లు' నవల అన్నికోణాలనుండి చక్కగా వ్యక్తీకరించగలి గింది. ఆర్థిక స్వాతంత్ర్యం కోసం నేటి యువతులు సాగిస్తున్న జీవన పోరాటాలను, పడుతున్న కష్టాలను, పొందుతున్న తీపి, చేదు అనుభవాలను పాఠకుల కళ్లకు కట్టినట్లు చూపి సమస్యాపరిష్కారానికై జాగృత పర చడంలో ఈ నవల నిర్వహించిన పాత్ర అనన్యసామాన్యమైనది.

ఈ నవలలో సునీత పాత్ర, రాధ పాత్ర మొదట్నుండి ఫాల్స్‌ప్రిస్టేజిని కలిగి ఉండ డంవల్లే ఓటి పునాదులపై జీవితాలను నిర్మించుకోవాలని తాపత్రయపడి భంగపా టు చెందడం పాఠకులకు హెచ్చరిక కావాలి. సుధీర్‌లాంటి, రమేష్‌లాంటి అవకాశవాదుల ను తప్పు పట్టడంతోపాటు స్త్రీలే మానసికంగా బలహీనం కాకుండా ఉంటే సమస్యలకు తొందరగా పరిష్కారం లభిస్తుంది. ఏదిఏమై నా నవలను ఆసాంతం ఏకబిగిన చదివింప చేయగలిగిన రచయిత్రికి అభినందనలు!

-బి.లావణ్య
గోదావరిఖని



# చతుర

సంపుటి: 19 సంచిక: 12 జనవరి 1997

హిమాచ్ఛాదిత గిరి శిఖరాల్లో... జడత్వాన్ని నింపుకుని సాధనలో తన అస్తిత్వాన్నే కోల్పోవాలని అడుగు ముందుకు వేశాడతడు.

అన్నీ వదిలి... ఒంటరిగానే వెడుతున్నానన్న భ్రమలో తనకి తెలియకుండానే మనసును కూడా తోడు తీసుకెళ్ళాడు.

మంచునిండిన ధవళకాంతులు తప్ప మరో రంగు కనుపించని ఆ నిర్జన ప్రదేశంలో కూడా మరచిపోలేని గతాల చిత్రాలనెన్నిటినో రంగుల్లో చూపించసాగింది మనసు.

క్రమంగా అది శరీరాన్ని కూడా వశం చేసుకుని అతని గమ్యాన్ని మరో వైపుకు మళ్ళించింది. ప్రాపంచిక, పారమార్థిక ద్వైదీభావాలలో కొట్టుమిట్టాడుతూ భయంకరమైన జీవనసుడిగుండంలో చిక్కిన ఆ సామాన్యమానవుని ఆఖరి మజిలీ ఏమిటి?

శాంతి కోసం భ్రాంతుల మరీచికలను వెతకబోయిన ఓ బలహీన మనస్కుని మనోగతి ఎస్.ఎల్.భైరప్ప కన్నడ మూలానికి ఉమాదేవి అనువాదం 'నిరాకరణ' ఈ నెల చతుర సమగ్ర నవల.

— ఎస్.ఎల్.భైరప్ప

# నిరాకరణ

"దత్తత తీసుకోదల్చుకున్న దంపతులకోసం ఐదుగురు అందమైన, ముద్దైన చిన్నారులున్నారు. ఈ పిల్లలు యాచకులుగాని, దిక్కులేనివారుగానికాదు. మర్యాదస్థుల కుటుంబంలో పుట్టిన బిడ్డలు. సంస్కారంగల తల్లిదండ్రుల కడుపున పుట్టి అదే సంస్కృతిలో పెరుగుతున్నారు. తల్లిని కోల్పోయిన ఈ పిల్లలకి మళ్ళీ తల్లి ప్రేమని, ఆదరణని అందజేయాలని ఆ పిల్లల తండ్రి ఇలా దత్తత ఇవ్వడానికి నిశ్చయించారు. ఎంత ప్రేమగా చూసుకున్నా తల్లి స్థానాన్ని తను భర్తీ చెయ్యలేనని ఆయన భావించారు. ముద్దుగా వున్న ఈ పాలబుగ్గల పాపలకి తల్లులు కావాలి.

హెచ్చరిక: భిక్షకులకి, పిల్లలతో వ్యాపారం చేసేవారికి ఈ చిన్నారులనివ్వడం జరుగదు. నిజంగా తల్లిదండ్రుల స్థానంలో నిలబడగల దంపతులకి మాత్రం అవకాశం. తాము పెంచుకోదలచిన పిల్లల్ని పరీక్షించుకునే కోరిక, ఎన్నుకునే హక్కు మీకెంత వుంటుందో, మీ నిర్ణయం వెనుకనున్న ఉద్దేశాలని పూర్తిగా పరిశీలించిన తరువాతనే తన సమ్మతిని తెలుపడానికి ఆ తండ్రికి పూర్తి హక్కులున్నాయి. శాస్త్రోక్తంగాను, చట్టబద్ధంగాను దత్తత స్వీకరించదల్చుకున్నవారు మాత్రమే సంప్రదించవచ్చును. మీరు సంస్కారవంతులై వుండి తీరాలన్నది ముఖ్యం. ధనవంతులు కాకపోయినా బాధలేదు. అది అంత ముఖ్యవిషయం కాదు.

దినపత్రిక మూడవపుటలోని ఒకపావు పేజీ ప్రకటన సారాంశం ఇది. పెద్ద పెద్ద అక్షరాలతో వ్రాసిన శీర్షికతో, ఐదుగురు పిల్లలున్న స్పష్టమైన ఫొటోతో అందరినీ ఆకర్షించేలా వుందది.

తండ్రి వివరాలు: కడుపున పుట్టిన ప్రియమైన పిల్లలని పరాయివాళ్ళకి సమర్పించే బాధాకరమైన నిర్ణయాన్ని తీసుకున్న ఆ తండ్రి పరిస్థితిని కూడా వివరించడం అవసరం. నరహరిరావు ఫోర్ట్‌లోని ఒక ఆఫీసులో టైపిస్టు. తత్వశాస్త్ర అధ్యయనం చేసి, ఆధ్యాత్మిక చింతనలో పడ్డ, నలభై సంవత్సరాల వేదాంత ధోరణిగల వ్యక్తి. మొదటి భార్యవల్ల ఒక ఆడపిల్ల, ఇద్దరు మగపిల్లలు కలిగారు. ఆఖరి బిడ్డకు ఏడాది నిండకుండానే భార్య గతించింది. పిల్లల పోషణ కోసం మొదటిభార్య సోదరినే వివాహం చేసుకున్నారు. రెండవభార్యవల్ల మగ కవల పిల్లలు కలిగారు. తల్లి పిల్లలకి ఒకటిన్నర సంవత్సరం వచ్చేసరికి మరణించింది. ఆమె గతించి రెండు మూడు నెలలయింది. మహానగరంలో టైపిస్టుగా బతికే ఈ సగటు జీతగాడికి మరో వివాహం చేసుకునే వుద్దేశం లేదు. తన బిడ్డలకి మాతృమూర్తులు కావాలి. ఈ పరిస్థితిలో తప్పనిసరిగా తన పితృత్వాన్ని త్యాగం చెయ్యడానికి ఆయన సిద్ధపడ్డారు.

పిల్లల వివరాలు: ఆ పిల్లల్లో పెద్ద పిల్ల భవాని. శాంత గుణం, ఎప్పుడూ ముఖంపై చిరుదరహాసం కలదేగానీ, ప్రస్తుతం తను వున్న దుస్థితివల్ల కలిగిన దుఃఖంచే కళాహీనమైంది ఆ గుండ్రటిమోము. విశాలమైన కళ్ళు, చామనఛాయరంగు. నాల్గవ తరగతి చదువుతున్నపిల్ల తన పినతల్లి మరణంతో చదువుని ఆపేసింది.

రెండవ కుర్రవాడు విజయ్: అక్కలాగ వున్న ముఖం, శాంతగుణం, చురుకుదనం వున్న కుర్రవాడు. ఏడు సంవత్సరాల వయసు. రెండవక్లాసు. స్కూలుకి వెళ్తున్నాడు.

మూడవకుర్రవాడు: పేరు గణేష్. ఐదు సంవత్సరాల వయసు. విశాలమైన నుదురు. తుంటరి అయినా దగ్గరైె గాఢంగా అల్లుకుపోయే గుణంకలవాడు. మొదటి తరగతి చదువుతున్నాడు.




నాలుగు, ఐదు శాల్తీలు రామలక్ష్మణులు: సంవత్సరం పైన తొమ్మిది నెలల వయసు గల కవల పిల్లలు. లేత ఎరుపు రంగు ఛాయ. ఇద్దరికీ పోలికలు బాగా వున్నాయి. చూసీ చూడగానే ఎత్తుకుని ముద్దాడాలనిపించే, హత్తుకోవాలనిపించే ఈ పసిపాపల అల్లరి అసామాన్యమైనది.

తండ్రి ఆఫీసుకి వెళ్ళిపోతే ఇంట్లో పిల్లల్ని చూసుకునేవారులేరు. అతను ఆఫీసుమాని ఇంట్లో వుంటే ఇంటి అద్దె కట్టి, పాలు, బియ్యం, పప్పులు, గోధుమపిండిలాంటి కనీసావసరాలకి కావలసిన ఆర్థిక సదుపాయం లేదు. ఉద్యోగరీత్యా పొద్దున్న ఏడున్నరకి ఇల్లు వదిలితే రాత్రి ఎనిమిదిన్నర తొమ్మిది లోగా ఇల్లు చేరే అవకాశం లేదతడికి. ఏడ్చే తమ్ముళ్ళకి వంట చేద్దామని స్టవ్ వెలిగించబోయిన భవానికి లంగా కాలింది. ఆ పిల్లకి ఏ ప్రమాదం జరగకుండా, ఇల్లు తగలబడి పోకుండా వుండటం పెద్ద అదృష్టమే మరి! చిన్న చిన్న పిల్లల్ని పెంచి కాపాడగలిగే వయసుకాదామెది. తెల్లవారు ఝామునే లేచి తండ్రి వంటచేసిపెట్టి వెళ్తాడు. పసికందులకి మితంగా ఎలా తినిపించాలో భవానికి తెలియదు. ఆ పిల్లలు ఏడిస్తే కడుపు నింపడం తప్ప ఇంకేం చెయ్యాలో, ఎలా ఊరుకోబెట్టాలో ఆ పిల్లకి తెలియదు. జీర్ణం పాడయి భేదులతో ఇబ్బందిపడే ఆ పిల్లలని ఆస్పత్రికి తీసుకువెళ్ళడానిక్కూడా శలవు దొరకని తండ్రి అతడు. స్కూలుకి వెళ్ళే మగపిల్లలు బయట చెడు సహవాసాల పాలవుతున్నారు. పిల్లలు తనకి చెందకుండా పోయినాసరే, వాళ్ళు అనారోగ్యాలతో చూసుకునే వాళ్ళులేక చెడిపోయేకంటే మరొకరి పిల్లలుగా మంచిమార్గంలో పెరగాలని దత్తు ఇచ్చే నిర్ణయం తీసుకున్నారు.



ఉదయం ఏడున్నరకి ఇల్లు వదలి, ఫోర్ట్ దాటి, హార్బర్ లైన్ పట్టాల దగ్గర బస్స్టాప్ కి చేరేసరికి, నరహరికి ఆరోజు దినపత్రిక చూడాలనే కుతూహలం ఎక్కువైంది. ఆఫీస్లో ఉచితంగా చూసే అవకాశం వున్నా, కుతూహలం ఆపుకోలేక, వీధి చివర వరకూ వెళ్ళి, అక్కడ పేపర్లు పరచుకుని అమ్ముతున్న దుకాణంలో ఒక ప్రతి కొనుక్కున్నాడు. రేపు నీ పిల్లల విషయం ప్రచురణ జరుగుతుందంటూ స్నేహితుడు ఆ ముందు రోజే ఫోన్ చేసి చెప్పాడు. బస్స్టాండ్ క్యూలో నుంచుని ఆత్రంగా పేజీలు తిరగేసాడు. మూడవపుటలో తన ఐదుగురు పిల్లల ఫోటోలను చూడగానే ఒక్కక్షణం తల తిరిగినట్టయింది. పడిపోతానేమోననే భయంతో ఒక నిమిషం క్రింద కూర్చుండి పోనా అని కూడా అనుకున్నాడు. ఇది తన ఒప్పుదలతో రాసిన ప్రకటన అన్న సంగతి గుర్తొచ్చి కొంచెం ధైర్యం తెచ్చుకున్నాడు. పూర్తిగా చదవడానికి మనోబలం చాలక వెంటనే పత్రికని మడచి చేతిలో పట్టుకున్నాడు.

బస్సులో కూర్చున్నాడు.

ముందు వరసలో కూర్చున్న ఇద్దరు ఇదే విషయం గురించి మరాఠీలో మాట్లాడుకుంటున్నారు. "పిల్లలు దత్తతకున్నారు అనే ప్రకటన చదివారా? "

"చదివాను... ఇక్కడి వారేనట. గణేశభువనం అంటే ఎక్కడో తెలుసా? "

"ఏదో కొత్తపేరు. మొత్తం మీద ఇదో దయనీయ పరిస్థితిలా ఉంది"

"కాదు మరీ"

వాళ్ళిదే విషయం మాట్లాడుకుంటున్నారు, "పాపం ఇంట్లో మరెవ్వరూ లేరట. ఈ మహానగరంలో ఎవరికెవరూ ఏమీ చెయ్యలేరు" ఇలా ఏవేవో అనుకుంటున్నారు.

"ఇతను ఇలా ప్రకటన చేసేకంటే ఏదన్నా అనాథాశ్రమంలో చేర్చవచ్చుగా. పిల్లలమీద

హక్కుకూడా మిగుల్తుంది. ముందు ముందు ఇంటికి కూడా తెచ్చేసుకోవచ్చు" అంటున్నాడొకాయన.

"అలాంటి అనాథాశ్రమాలు ఎక్కడున్నా యిలెండి. వున్నా ఎన్నుంటాయని. అక్క డెలా చూసుకుంటారో మీకు ఐడియా లేదా? ఒక రకంగా చూస్తే ఇలా ఇచ్చెయ్య డమే మంచిది. ఎవరన్నా పిల్లల్లేనివాళ్ళు పెంచుకుంటారు"

"అలా అయితే తండ్రికి ముందు ఏ అధి కారాలూ వుండవు. అతని పాలిటికి పిల్లలూ లేనట్టే, పిల్లల పాలిటికి తండ్రీ లేనట్టే"

"అతడవన్నీ ఆలోచించకుండా వుండి వుంటాడా? వేదాంత స్వభావం కలవాడని రాశారు కదా! పిల్లల్ని వదులుకోడానికి సిద్ధ పడే ఈ ప్రకటన చేసివుంటాడు"

"అఫ్‌కోర్స్, యు ఆర్ రైట్"

నరహరి వాళ్ళవైపు చూసాడు ఇద్దరూ నల్లకోటు వేసుకున్నవాళ్ళే.

"వేదాంత ధోరణిగలవారు కర్తవ్యాన్ని తప్పించుకోడంలో ముందుంటారు" అని వారితో ఒకాయన అన్నమాట నరహరిని గుచ్చివేధించసాగింది. కర్తవ్యంనుంచి పారి పోడానికా తాను ఈ నిర్ణయం తీసుకున్నది. ఒకవేళ నిజంగానే ఈ ఉద్దేశం తనలో నిద్రాణంగా వుండి ఈ నిర్ణయం తీసుకునే టట్టు తనని నిర్దేశించలేదుకదా! తన అంత రంగాన్ని తరచి తరచి చూసుకున్నాడు.

తను దిగాల్సిన స్టేజి వచ్చింది. బస్సు దిగి ఫుట్‌పాత్‌మీది జనాల మధ్యనుంచి నడచి, ఒకవీధి దాటి మరోవీధి దగ్గర ఒక పెద్ద కట్టడంలో మూడవ అంతస్తులో వున్న తన ఆఫీస్‌లోకి ప్రవేశించాడు.

నరహరి బారిస్టర్ దస్తూర్‌గారి ఆఫీస్‌లో టైపిస్టు. ఇరవైమంది చిన్న లాయర్లు కూడా పనిచేసే ఆఫీసులో అతనికొచ్చే జీతం చాలా తక్కువ. కేవలం జీతంతో బతకడం కష్టం గనుక సాయంత్రం మరో రెండున్నర గంట లెక్కువగా పనిచేసి ఓవర్‌టైమ్ పేమెంట్ తీసుకునేటంత పని వుండేది గనుక ఆ రాబ డితో ఖర్చులు లాగించేవాడు.

మిషన్‌ముందు కూర్చుని అర తమలపా కులో కొద్దిగా తంబాకు చుట్టి బుగ్గన పెట్టు కుని ఎడమ పక్కనున్న ట్రేలో వున్న లెటర్ తీసి టైప్ చెయ్యడానికి పెట్టుకున్నాడు. తన లాగే టైప్ రైటర్లముందు కూర్చున్న మిగతా ఆరుగురిలో ఒక్కరుకూడా పని ప్రారంభించ లేదు. వాళ్ళల్లో ఎవరన్నా ఈరోజు టైమ్స్ పత్రిక చూసి, తనని అడిగేస్తారేమోనని కల వరంగా వున్నాడుగానీ ఎవరూ అడగలేదు.

అంతలో అతనికి ఫోన్ వచ్చింది. లేచి వెళ్ళి రిసీవర్ అందుకున్నాడు. ఆ ప్రకటన తీసుకుని వేయించిన మిత్రుడు శెనాయ్ అడి గాడు,

"చదివారా? "

"ఊం"

"సరిగ్గావుందా? "

ఏం జవాబు చెప్పాలో నరహరికి తెలియ లేదు.

"శవంతోబాటు కాల్చిపారేసే పాడెని ఎలా కడితే ఏముందిలెండి? శవభారాన్ని మోస్తే చాలదూ? "

"చాలా ఎమోషనల్ అయిపోయినట్టు న్నారు మీరు. లంచ్ టైంలో వస్తాను. కాసేపు మాట్లాడుకుందాం"

పత్రికోద్యోగంలోవున్న శెనాయ్‌కి సంగీతం, సాహిత్యం, వేదాంతం, రాజకీయం... ఇలా చాలా విషయాల్లో ఆసక్తి వుంది. ఎనిమిదే ళ్ళక్రితం రామకృష్ణాశ్రమం- న్యూయార్క్ శాఖకి చెందిన స్వామీ దేవానందుల ఉప న్యాసం జరిగింది. దానికి రిపోర్టర్‌గా వచ్చా డతను. ఇద్దరూ ఒకే ప్రాంతంవారు అవ





టంతో పరిచయం పెరిగింది. గుణగణాలు వేర్వేరయినా అప్పుడప్పుడు కలుసుకోడంవల్ల ఇద్దరిలోను విశ్వాసం, అభిమానం పుట్టి పెరిగాయి.

ఒంటిగంటకి సరిగ్గా శెనాయ్ వచ్చాడు. సుమారుగా నరహరి వయసే ఉంటుందతనికి. జర్నలిస్ట్ గనుక చురుకుగా కనిపిస్తున్నాడు. మంచి శరీర సౌష్టవం, మంచి రాబడి కలవాడు కావడంతో మంచి దుస్తులు కూడా ధరించి వున్నాడు. చేతిలో పత్రిక ప్రతి ఒకటి. ఇద్దరూ బయటకి నడిచారు. హోటల్లో కూర్చున్నాక శెనాయ్ అన్నాడు, "మీరు చాలా డిప్రెస్ అయినట్టున్నారు. సహజమేగాని, మరీ అలా అధైర్యపడితే ఎలా? ఐమీన్ స్థైర్యం పోగొట్టుకుంటే ఎలా? "

నరహరి భావగర్భితంగా తలవాల్చాడు. తన చేతిలో వున్న పత్రికని తెరచి శెనాయ్ అన్నాడు, "ఈ రెండు వర్ణనలు చూడండి. మూడవబిడ్డ గణేశుడు, నాలుగు, ఐదవ వారైన రామలక్ష్మణులు తుంటరి వారని చేర్చాను. ఎందుకో తెలుసా? "

శూన్యమైన ముఖంలో ఒక ప్రశ్నార్థకం తొంగిచూసింది. శెనాయ్ మళ్ళీ అన్నాడు, "తుంటరి పిల్లలంటే ఆడవారికి చాలా ఆకర్షణ. అది ఆడవారి సైకాలజీ. మనకి అసహజం అనిపించే తుంటరితనమే స్త్రీలకి ఇష్టం"

నరహరి మాట్లాడలేదు. బలవంతం చేసినా తినడానికేమీ తీసుకోలేదు. శెనాయ్ మాట్లాడుతూనే వున్నాడు, "ఇక్కడివాళ్ళే ఎవరన్నా పిల్లల్ని చూడ్డానికి రావొచ్చు మీ ఇంటి చిరునామాకి కూడా ఉత్తరాలు రావొచ్చు ఎవరికీ వెంటనే మాట ఇవ్వకండి. బారిస్టర్ ఆఫీస్‌లో పనిచేస్తున్నారు, మీకు తెలీనిది ఏముంటుంది? దత్తత అడిగేవారి ఉద్దేశాలు ఒక్కొక్కరికి ఒక్కోరకంగా వుండొచ్చు"

నరహరి కాఫీ మాత్రం తాగాడు. బయటకొచ్చి అర తమలపాకు వేసుకుని, కొంచెం పొగాకు పొడి చేసుకుని నోట్లో వేసుకున్నాడు. ఇద్దరూ ఎవరి దారిన వాళ్లు బయల్దేరుతుంటే "నాకివాళ ఏం మాట్లాడాలో తెలియటంలేదు" అన్నాడు నరహరి.

శెనాయ్, "నేను అర్థంచేసుకోగలను" అని అతని భుజాన్ని మృదువుగా అదిమి వెళ్ళిపోయాడు.

నరహరి ఆరోజు సాయంత్రం ఐదుగంటలకల్లా బయటకొచ్చేసాడు. హెడ్‌క్లర్క్ ఇతని దగ్గరకొచ్చి "ఏమిటి? ఇవాళ 'ఓ. టి' చెయ్యటం లేదా? " అని అడిగితే,

"నాకీరోజు మూడ్‌లేదు" అన్నాడు.

"ఇలారండి, ఒక చిన్నమాట" అని పిలిచాడాయన. నరహరినొక మూలకి తీసుకెళ్ళి కూర్చోబెట్టాడు. "నాకు తెలుసు, లంచవర్లో మిగతావాళ్ళంతా చెప్పుకొంటున్నారు. మీకు మీ ఊళ్ళో ఎవరూ లేరా? అమ్మమ్మ, మేనత్త, పిన్ని... ఇలా ఎవరూ..."

నరహరి జవాబుగా తల అడ్డంగా వూపాడు.

"మీరసలే గంభీరంగా వుంటారు. ఈ విషయం మీతో మాట్లాడాలని అందరికీ కుతూహలంగా వున్నా, ఏం మాట్లాడితే ఏం తప్పో అని వూరుకున్నారు"

"ఏం మాట్లాడాలట? ఎవరన్నా ఏమన్నా సహాయం చెయ్యగలరా? "

"అంతా మీలాంటి టైపిస్టులే! ఏం సహాయం చేస్తారు? మీరు మరో పెళ్ళి చేసుకోండి. పిల్లల కోసమయినా..."

"నాకు భార్య కావాలని కాదు, పిల్లలకి తల్లికావాలని ఇలా చేసాను"

"అదీ నిజమే అనుకోండి"

నరహరి అక్కడ్నుంచి బయల్దేరి

బస్‌స్టాప్‌కొచ్చాడు. రోజూ ఏడున్నరకి ఆఫీసు నుంచి బయల్దేరే అతనికి, ఐదున్నర సమయంలో పెద్దక్యూ వుంటుందన్న జ్ఞాపకమే లేదు. అయినా క్యూలో నుంచుని చెంబూర్ వెళ్లే బస్సెక్కాడు. ఇంకొద్ది రోజుల్లో పిల్లలతో బంధం తెగిపోతుందని తలచుకుంటే మనసంతా కలవరంతో నిండిపోయింది. మొదటి భార్య బతికివున్నప్పుడు తను రోజూ ఐదు గంటలకల్లా బయల్దేరి ఇంటికి వెళ్లిపోయేవాడు. ఇద్దరు పిల్లలు పుట్టాక ఒక గంట ఓవర్‌టైమ్ చేసేవాడు. మూడవ బిడ్డ కూడా పుట్టేసరికి రెండుమూడు గంటల ఓవర్‌టైమ్ చెయ్యక తప్పిందికాదు. రెండవ వివాహం అయ్యాక ఇక ఆదివారం నాడు మాత్రం భార్యాపిల్లలతో గడిపే అవకాశం వుండేది. కానీ వాళ్లని త్వరగా వెళ్లి చూడాలనే ఆత్రం ఎప్పుడూ వుండేదికాదు. ఆమె చనిపోయే ముందూ, ఆస్పత్రిలో వున్నప్పుడూ కంగారుకొద్దీ తిరిగేవాడు. ఇహ కొన్ని రోజుల్లో ఈ పిల్లలూ తనకి కానివాళ్ల యిపోతారనుకుందుకు మనసొప్పలేదు. ఇంకొన్ని రోజుల్లో పిల్లలకు తను తండ్రిగా ఉండడు.

చావు తప్పదని తెలిసిన రోగి, బతికినకొద్దిరోజులయినా తన వారికి దగ్గరగా బతకాలని కోరుకున్నట్టుగా ఇకమీద ఓవర్‌టైమ్ చెయ్యకూడదని, రోజూ త్వరగా ఆఫీసు వదిలి ఆరున్నరకల్లా ఇల్లు చేరాలనీ తీర్మానించుకున్నాడు.



బస్సు దిగి మురికివాడ దాటుకుని ఇల్లు చేరేసరికి రామలక్ష్మణులిద్దరూ ఏడుస్తున్నారు. వాళ్లెప్పుడు విరేచనం చేసుకున్నారోగానీ నేలంతా ఖరాబయ్యి, ఎండి ఇల్లంతా వాసనతో నిండిపోయి ఉంది.





చిన్న ఇల్లు, చిన్న వంటిల్లు, బాత్‌కమ్‌లావెట్రీ కలిసిన ప్రత్యేక ఏర్పాటు. చిన్న బెడ్‌రూమ్. ఐదడుగుల పొడుగు, నాలుగడుగుల వెడల్పువున్న ఆ బాల్కనీలోకి అడుగు పెట్టగానే పక్కింటావిడ ఇతన్ని చూసింది. "పిల్లలు రోజంతా గోల చేస్తారు. భవాని అసలేమీ పట్టించుకోదు. తొమ్మిదేళ్ల పిల్లకి ఆమాత్రం తెలియక్కర్లా? మా ఇంటిదాకా కొడుతోందీ కంపు" అని విసుక్కుంది. అనుకోనివిధంగా ఇంత త్వరగా తండ్రి ఇంటికి రావడం, ఆ ఆరోపణలన్నీ వినడం చూసి భవాని బెదరి వంటగదిలోకి వెళ్లి దాక్కుంది.

చిన్న పిల్లలిద్దరూ భయంతో ఏడుపు ఆపేశారు. ఇంటినిండా ఉన్న దుర్వాసనకి ఒక నిమిషం ముక్కు మూసుకున్నా, తరువాత కూతుర్ని అడిగాడు, "తల్లీ, ఇదంతా ఇలాగే వదిలేసావేమమ్మా? " అని.

వంటింట్లో నుంచున్న ఆ పిల్ల మాట్లాడలేదు. అతనే ఒక పాత పేపర్ తీసుకుని ఆ స్థలం శుభ్రం చేశాడు. బాత్‌రూమ్‌నుంచి బకెట్‌నిండా నీళ్లు, ఒక చీపురు తెచ్చి నేలంతా శుభ్రంగా కడిగాడు. అప్పుడు భవాని బయటకొచ్చి "నేను కడుగుతానివ్వండి" అంది. ఆమె గొంతులో ఇంకా భయం వుంది.

"సరేలే... మీ అందరి బట్టలూ తెచ్చియ్యమ్మా ఉతికేస్తాను..."

"నేను ఉతుకుతానులే నాన్నా"

"మురికి పోయేలా రుద్ది, గుంజి ఉతకడానికి నీ చేతుల్లో బలం వుండదమ్మా. బట్టలు తెచ్చియ్యి తల్లీ..." అని బట్టలన్నీ తడిపి, సబ్బుతోరుద్ది, జాడించి, పిండి శుభ్రం చేసేసరికి రాత్రి ఎనిమిది గంటలయింది. అతనిదంతా చేసేసరికి భవాని వంటింట్లో గిన్నెలు కడిగి అన్నీ సిద్ధం చేసి నరహరికి స్టవ్ వెలిగించడానికి అంతా రెడీ చేసింది. స్టవ్ వెలిగించబోయి లంగా అంటించుకున్న నాటి

నుంచి ఆ పిల్లని స్టవ్ ముట్టించద్దని చెప్పే శాడు నరహరి.

బట్టలు ఆరేసి తండ్రి అడిగాడు, "విజ యుడు, గణేశ్ ఎక్కడమ్మా? "

"సైపుకటువేపు ఆటలాడుతూ వుంటారు. రోజూ ఇంటికి ఎనిమిదింపావుకి వస్తారు. ఇవాళ మీరు తొందరగా వచ్చేశారని వాళ్లకి తెలీదుగా"

అక్కడ తాగుబోతులు, జేబుదొంగలు తిరుగుతుంటారనీ అది దొంగసారా వ్యాపారం జరిగే చోటనీ నరహరికి బాగా తెలుసు. అప్పుడప్పుడు పోలీసులు రావడం, దొరికిన జనాన్ని జీపులో ఎక్కించుకుపో వడం అందరికీ తెలిసిన విషయమే.

నరహరి రెండు స్టవ్‌లు వెలిగించి ఒకదా నిమీద అన్నం మరోదానిమీద చారు ఎక్కించి, షర్టు తగిలించుకుని పాత చెప్పులు తొడుక్కుని సైపులవైపు బయల్దే రాడు. అంతలో ఏడేళ్ల విజయుడు, ఐదేళ్ల గణేశ్ ఇంటికి చేరారు. వాళ్ల బట్టలు, ఒళ్లు మట్టిగొట్టుకుపోయున్నాయి. ముఖమ్మీద దుమ్ము, చెమట కలిసి అట్టగట్టిపోయింది. తమకంటే ముందుగా ఇంటికొచ్చేసిన తండ్రిని చూసి ఇద్దరూ బెదిరి నుంచు న్నారు. లాగి ఒక్కొక్క లెంపకాయ ఇద్దామ నిపించింది గాని, మనసంతా వ్యధతో నిండి పోగా, "ఎన్ని గంటలకిరా ఇల్లు చేరేది? " అని గద్దించి వూరుకున్నాడు.

"భవానీ అన్నం, చారు పొంగితే నన్ను పిలువమ్మా" అని చెప్పి, పిల్లలిద్దర్నీ స్నానాల గదిలోకి తీసికెళ్లి, ఒళ్లు, వీపు బాగా రుద్ది స్నానాలు చేయించి శుభ్రమైన గుడ్డలు తొడిగాడు. మురికి గుడ్డల్ని నీళ్లల్లో నానబె ట్టాడు.

చంటి పిల్లలిద్దరూ ఏడవకుండా గోడని పట్టుకుని నడుస్తూ ఆడుకుంటున్నారు. అది చూసి అతనికి ఆశ్చర్యం! వంటింట్లోకి వెళ్లేస రికి స్టవ్‌ముందు కూర్చున్న భవాని వెక్కి వెక్కి ఏడుస్తోంది. ఆమెపక్కనే కూర్చుని వీపు మీద నిమురుతూ అడిగాడు, "ఎందు కమ్మా ఇందాకట్నుంచీ దిగాలుగా వున్నావు? "

"అయితే మమ్మల్నందర్నీ ఎవరెవరికో పెంచుకోమని ఇచ్చేస్తారా నాన్నా? " అనడి గింది ఏడుస్తూనే ముఖంపైకెత్తి.

"ఎవరన్నారలాగ? "

"మీరు పొద్దున్న ఆఫీసుకి వెళ్లాక కింద ఫ్లోర్‌లో వుండే ఆంటివాళ్లు పేపర్ తెచ్చారు. అందులో మా అందరి ఫొటో వుంది. ఇంట్లో చూసుకోడానికి ఎవరూ లేరు. పెంచుకోదల్చుకున్న వాళ్లెవరన్నావచ్చి తీసుకు వెళ్లండి అని రాశారటగా? "

తండ్రి అవును కాదు అంటూ ఏ జవాబూ ఇవ్వలేదు. సీరియస్‌గా అన్నం వార్చసాగాడు. మిగిలిన పిల్లలు ఇద్దరూ బయట గదిలో వున్నారు. గణేశు విజ యుణ్ణి తిడుతున్నాడు. "నువ్వే బద్మాష్, బాంచోద్, నఫరత్..."

"ఏం నాన్నా, నిజమేనా? " భవాని అడి గింది.

అవుననలేకపోయాడు. కాని ఏదో ఒక రోజు ఈ విషయం చెప్పక తప్పదు. అలాం టప్పుడు కాదని అబద్ధం చెప్పనేల.

తండ్రి మౌనం అంగీకార సూచకమనే సంగతి అనుభవంవల్ల తెలిసిన కూతురు వెక్కివెక్కి ఏడవసాగింది. ఆ పిల్ల వీపుమీద చెయ్యివేసి దగ్గరకి లాక్కుని ఓదార్చాడు. "వాళ్లేవేవో మాట్లాడతారుకదా అని నువ్వేడ వవచ్చా తల్లీ!"

"అయితే మా ఫొటో ఎందుకు వేశారు? "

"అదంతా తరువాత చెబుతాగానీ ఆంటీ వాళ్లు ఏ టైములో వచ్చారు? "

"నువ్వు ఆఫీసుకెళ్ళిన కొంచెం సేపటికి"

"అప్పుడు విజయ్, గణేశ్ ఇంట్లో వున్నారా? "

"స్కూలుకని వెళ్లిపోయారు"

"అంత త్వరగానా? "

"రోజూ అంతే, నేనెంత చెప్పినా వినరు. స్కూల్ కి అని చెప్పి పైపులైను దగ్గర ఆడ తారు"

"ఆ ఆడవాళ్లొచ్చి ఏమేం అన్నారు? "

"మీ నాన్న మిమ్మల్ని ఇచ్చేస్తారట. మీరంతా ఎవరెవరి ఇళ్లల్లో కూలి పనులు చేయాలో అన్నారు. 'కన్నతండ్రి ఇలా ఎలా చేస్తున్నాడో, మనసెలా వచ్చిందో' అని ఒకరూ, 'మగజాతండీ' అని మరొకరూ



అన్నారు. "

అంతలో అన్నం వుడికింది. గిన్నె క్రిందకి దించి ఆ స్టవ్ ఆర్పి, చారులో చింతపండు రసం పిసికి పోసాక, కంచాలు పెట్టమ్మా! అన్నం వడ్డించేస్తాను, ఆరుతూ వుంటుంది" అన్నాడు.

"అదంతా నిజమేనా నాన్నా? " మళ్లీ అడిగింది కూతురు.

"వాళ్లంతా ఏవేవో అంటారులే. అదంతా ఎందుకు? రాత్రి పడుకునేటప్పుడు చెబుతాగా! ఇప్పుడు కంచాలు పెట్టు"

వంటగదిలో భోజనాలకి కూర్చునేటంత చోటులేదు. గదిలోకి వచ్చిన భవాని చెప్పింది. రామలక్ష్మణులిద్దరూ నిద్రపోయారు. గణేశు జోగుతున్నాడు.

అప్పుడే తొమ్మిది గంటలయింది. పిల్లలు మధ్యాహ్నం తిన్నారో లేదో. ఇప్పుడైనా లేపి తినిపించాల్సిందే. నిద్రమధ్యలో లేచి ఏడిస్తే వూరుకోపెట్టడమూ కష్టమే. కాని కడుపుకి తిండి లేకుండా రోజూ అలా పడుకుంటే ఎవరికైనా ఆరోగ్యం ఏమవుతుంది. గబగబ అన్నం వడ్డించి చల్లారబెట్టాడు. గిన్నెలో వున్నచారుని నీళ్లగదిలోవున్న నీళ్ల బకెట్ లోని నీళ్లలోకి తగిలించిపెట్టి చారుకూడా చల్లార్చాడు. లేపినప్పుడు ఏడ్చారుగాని చంటి వాళ్లిద్దరూ కడుపునిండా తిన్నారు. కాని మజ్జిగ పూర్తయ్యేలోగానే కూర్చున్న చోటే ఖరాబు చేసుకున్నారు. మళ్లీ నేల కడిగి శుభ్రం చేసి, వాళ్ల ఒళ్లు, కాళ్లు అంతా కడిగి క్లీన్‌చేసి పడుకోపెట్టాడు. విజయ్, గణేశుల భోజనం కూడా అయింది. వాళ్లందర్నీ పడుకోబెట్టి తండ్రి, కూతురు కంచాల ముందు కూర్చున్నారు.

పిల్లలిద్దరికీ 15 రోజుల్నుంచి విరేచనాలు. నరహరి తనకి తెలిసిన మందులు వాడుతున్నాడు. డాక్టరు దగ్గర ఒకసారి చూపించి మందులిప్పిస్తే బాగుంటుందిగానీ డాక్టరు దగ్గరకి తీసుకెళ్లేవాళ్లెవరు? తను ఒక్కరోజు శలవుపెట్టినా జీతం నష్టమవుతుంది. ఉన్న శలవంతా భార్య మరణించినప్పుడు వాడేసుకున్నాడు. మితంగా ఆహారం పెట్టకపోతే ఈ వయఃసు పిల్లలకి ఇలా అవడం సహజమేగాని, వెంటనే మందు పడాలిగామరి. తండ్రి, కూతురు మౌనంగా భోజనం పూర్తి చేశారు. తండ్రి గిన్నెలన్నీ మూతలు పెట్టి, వంటిల్లు శుభ్రం చేసివచ్చేసరికి కూతురు పక్కలు పరచింది. పిల్లలందర్నీ ఎత్తి సరిగ్గాపడుకోబెట్టి తనూ కూర్చున్నాడు.

పిల్లలంతా నిద్రపోతున్నారు. తనకి మటుకు కన్ను మూత పడటంలేదు. భవాని ప్రశ్నలకి బదులు చెప్పాలి. విజయ్‌కి, గణేశ్‌కీ కూడా అన్నీ అర్థమవుతాయి. మాట్లాడకుండా వూరుకుంటారా? దత్తతివ్వ

కుండా తనే పెంచడానికి కుదరదా? అని పదేపదే అనుకున్నాడు. అదే వీలయితే ఏ బాధాలేదుకదా! కానీ కుదిరే పనికాదే! తన వేపుగాని, భార్యవైపుగాని ఏ ముసలమ్మలూ లేరుకూడా. ఈ వాతావరణంలో పిల్లలు పాడయిపోడం ఖాయం. ఈ క్షణంలో, ఈ పరిస్థితిలో ఈ అడుగు వేయటంవల్ల తనకి, పిల్లలకి మనసులు నొచ్చుకున్నా భవిష్యత్తు ముఖ్యం. ఈ స్థితిలో ఇదొక్కటే వివేకంగల పని అని తనకి తనే జవాబుచెప్పుకున్నాడు.

ఎంతసేపటికీ నిద్ర రాలేదు. దిండు పక్కనేవున్న తంబాకు మీదకి చెయ్యిపోయింది. ఇప్పుడు దాన్ని నోట్లో వేసుకుంటే పదిసార్లు లేచి వెళ్లి ఉమ్మిరావాల్సి వస్తుంది. ఎందుకొచ్చిన గోల. వద్దులే అని చెయ్యి వెనక్కి లాక్కున్నాడు. పిల్లలెవరో కదిలిన అలికిడి అయితే అటు తిరిగి చూశాడు. ఇందాకటి నుండి పట్టించుకోనేలేదు. భవానీ కూడా

స్థిమితంలేకుండా చాలాసేపట్నుంచి అటు ఇటూ దొర్లుతూనే వుంది. నిద్రపట్టిందో లేక నిద్రలోనే పొర్లుతోందో మెల్లగా, "అమ్మలూ..." అన్నాడు. భవాని పలుకలేదు. మళ్లీ "ఏమ్మా నిద్ర పట్టలేదూ? " అని అడిగాడు. అయినా జవాబు రాలేదు. నిద్రపోయిందేమో. నిద్రలోనే అటు ఇటు తిరిగిందేమో అనుకున్నాడు. అందరికంటే పెద్దది. అందులోనూ ఆడపిల్ల. జ్ఞానం తెలిసినది. పరిస్థితులను చురుగ్గా ఆకళించుకోగలిగింది. ఆ పిల్ల తల్లి స్వభావం కూడా అలాగే వుండేది. ఇప్పటికే ఈ బిల్డింగ్‌లో ఆడవాళ్లొచ్చి ఈ పిల్లతో ఏవేవో చెప్పిపోయారు. తనతో ఎవరూ అంతగా మాట్లాడరు. కష్టం, సుఖం ఎవరూ వచ్చి చూడరుగానీ, దీనికి మాత్రం వచ్చారన్నమాట. వీళ్లెవరన్నా కాస్త ఇంటికి వచ్చి పోతూండినా, ఈ పిల్లల్నే ఒక అరగంట వాళ్లిళ్లకి రమ్మని పిలుస్తూ ఉండినా పిల్లలకి ఇంత బెంగబెంగగా బెరుకు బెరుకుగా వుండేదికాదు. విజయ్‌కీ, గణేశుకీ స్నేహితులు లేరు. అందుకే ఆ వైపు దగ్గర అలగా కుర్రాళ్లతో ఆటలకి పోతారు. ఈ బిల్డింగ్‌లోనే పెద్దలు వీళ్లని తమ పిల్లలతో కలుపుకోవచ్చుగా. వీళ్ల మురికి బట్టలు తొడుక్కుని వుంటారు నిజమే. రెండు పూటలా బట్టలు మార్చే దిక్కులేదు, ఉతికే దిక్కులేదు. వాళ్లే ఉతుక్కోగలిగే వయసుకాదు. కాలనీలో మహిళా సమాజం పెడతారట. ఆడవాళ్లంతాచేరి ఏవేవో చర్చిస్తారట. ఇలాంటి పిల్లల బాధ్యతవాళ్లు అంతో ఇంతో తీసుకుంటే ఎంత బాగుంటుంది.

భవాని మళ్లీ పక్కకి తిరిగింది. "అమ్మలూ" అని పిలిచాడు. మాట్లాడలేదు. అటు తిరిగి రామలక్ష్మణులు మీదుగా తన కుడిచెయ్యి జాపి భవానిముఖం మీద పెట్టాడు. అప్పుడూ మాట్లాడలేదు. మరో క్షణానికి ఊపిరి బిగపట్టి సన్నగా ఏడుస్తున్న శబ్దం వినిపించింది.

"ఎందుకమ్మా ఎందుకు? " అంటూ తనే చీకట్లో తడుముకుంటూ వెళ్లి ఆ పిల్ల పక్కన పడుకున్నాడు. తల, వీపు నిమురుతూ అడిగాడు మళ్లీమళ్లీ.

"ఏంలేదు, ఏంలేదు" అంది తప్ప ఆ పిల్ల ఇంకేమీ మాట్లాడలేదు. తనే ఏమన్నా మాట్లాడి ఓదార్చాలి. కాని ఏంచెప్పడం? ఎలా ఓదార్చడం? ఆ అమ్మాయికంతా తెలిసిపోయింది. "ఆ ఆంటీలు చెప్పినదంతా అబద్ధం అని చెప్పి, ఆ పిల్ల చేయి తన చేతిలోకి తీసుకుని అరచేతిమీద ఒట్టేసినట్టు కొట్టి, అరచేతిలో గిల్లి నీ తోడు అని అంటే నమ్ముతుంది. ఏడుపాపుతుంది. కానీ దొంగ ఒట్టుపెట్టి ప్రస్తుతం నమ్మకం పుట్టించినా మళ్లీ ఒట్టుతీసి గట్టున పెట్టే రోజురాక తప్పదే. పసిమనసులతో ఆటలాడకూడదు. విడమరచి, వివరించి చెబితే వాళ్లే అర్థంచేసుకుంటారు. పెంచుకోడానికిచ్చేసినా తనేమీ

వాళ్లని పూర్తిగా వదిలెయ్యడు. తనూ వెళ్లి చూసివస్తుంటాడు. వాళ్లు వచ్చిపోతుంటారు. వాళ్ల జాగ్రత్తలు చూడ్డానికి ఒక మంచి తల్లివద్దా? కేవలం ఆ ఒక్క కారణానికే తను వాళ్లని దత్తు ఇవ్వాలనుకుంటున్నాడు. అని వాళ్లకి వివరంగా చెబితే తెలుస్తుంది. అయినా ఇదంతా ఇప్పుడు చెప్పవలసిన అవసరంలేదు. పత్రిక ప్రకటనకి జవాబులు రావాలి. ఎలాంటి మనుషులొస్తారో ఏమో, తనకు నచ్చుతారో లేదో. అన్నీ చూసుకోవాలిగా. పిల్లలకిప్పుడే అన్నీ చెప్పటం ఎందుకు? ఏం మాట్లాడాలో తోచక కూతుర్ని దగ్గరగా లాక్కుని పడుకున్నాడు. ఆపిల్ల కూడా మౌనంగా పడుకుంది.

కొంచెం సేపయ్యాక భవానియే అడిగింది. "ఆరోజు శెనాయ్ మామయ్య వచ్చి మాకందరికీ మంచి మంచి బట్టలు వేసుకోమని చెప్పి, నన్ను తల దువ్వుకుని, బొట్టు పెట్టుకోమని చెప్పి ఒక్కొక్కరికీ ఫొటోలు తీసారు కదా! ఇందుకేనా నాన్నా? "

'ఊ' అనిగానీ 'ఉహూ' అని గాని అనలేదతను. కానీ ఏదో ఒకటి మాట్లాడాలిగా.... "నీకెలా తెలిసింది బుజ్జీ" అన్నాడు.

" ఆయన పేపర్‌లో పనిచేస్తారుటకదా! దీపావళప్పుడు వైదేహి పిన్ని బతికుందికదా! అప్పుడు నాకు లంగా తొడిగి జడవేసింది. పూలు కూడా పెట్టింది. ఆ రోజు మనింటికి శెనాయ్ మామయ్య రాలా? నా బుగ్గ చిదిమి, ఎంత బాగుందో నీ జడ. కెమేరా తేలేదుగానీ తెచ్చుంటే నీ ఫొటోతీసి సన్‌డే పేపర్‌లో వేసేవాడిని. ఇంకోసారి తెస్తాను అన్నారు గుర్తుందా? "

"ఊc"

"ఆరోజు మాకందరికీ ఫొటోలు తీస్తే అందుకేనేమో అనుకున్నాను. కానీ జడ వేయించుకోలేదు. వైదేహి పిన్ని వుంటే వేసేది"

"ఊc"

ఇంకేం మాట్లాడాలో తెలియకనో తండ్రి మాట్లాడకుండా వూరికే ఊ కొడుతున్నాడనో గానీ నిరుత్సాహంగా వూరుకుంది. కొంతసేపయ్యాక మళ్లీ అడిగింది. చిన్న పిల్ల ఫొటోలెప్పుడూ ఆదివారం పేపర్లో వస్తాయిటకదా మరి మా ఫొటోలు ఇవాళే వేసారేం? ఆంటీ చెప్పింది నిజమా నాన్నా? "

"అమ్మలూ, వాళ్లేవేవో చెప్తారుగాని అవన్నీ పట్టించుకోకు నిద్రపో"

"అయితే అబద్ధమా? "

"ఊc" అంటే సరిపోయేది. హాయిగా నిద్రపోయేది. కాని తండ్రి అలా అనలేదు. "నిద్రపో బుజ్జీ, ఎంతసేపయిందో చూడు" అని వీపుమీద తట్టాడు.

కూతురు ఇంకేమీ అడగలేదు. చీకట్లో కళ్లు విప్పార్చుకుని కనపడని దానిని దేనినో చూస్తూ పడుకుంది. మళ్లీ కదలలేదు, పక్కకి ఒత్తిగిలలేదు.



మర్నాడు ఆఫీసులో కూర్చుని టైపు చేసేటప్పుడు నరహరికి ఒక ఆలోచన వచ్చింది. రామలక్ష్మణులు మరీ పసిపిల్లలు. తమ ఇల్లేదో, తండ్రేమిటో, తల్లిఏదో, అక్క, అన్న

ఇలాంటి ఏ బంధాలు ఇంకా తెలియనివాళ్లు. వాళ్లిద్దర్నీ మాత్రం పెంచుకోడానికి ఇచ్చేసి పెద్దపిల్లలు ముగ్గుర్నీ తనే ఎలాగో తిప్పలు పడి పెంచేస్తే సరి అనుకున్నాడు. ఈ ఆలోచన అరగంటలోనే తలక్రిందులయింది.

ఓవర్‌టైమ్ చెయ్యకపోతే సంసారం గడిచే ప్రశ్నేలేదు. తన ప్రత్యక్ష పర్యవేక్షణ లేకపోతే మగపిల్లలు దారికిరారు. ఇక భవానీకి కూడా స్కూలు చదువుకావాలి. ఇప్పుడు సరేగాని మరో నాలుగైదేళ్లకి భవాని పెద్దదవుతుంది. ఇంట్లో మరెవ్వరితోడు లేకుండా రోజంతా ఒక్కతే వుండటం మంచిదికాదు. ఏమన్నా సమస్యలు రావొచ్చు. ఆడపిల్లల్ని పెంచడం మగపిల్లల్ని పెంచడం కన్నా ఎక్కువ కష్టం... అని ఆలోచిస్తుండగా,

శెనాయ్ ఫోన్ చేశాడు, "చూడండి, అప్పుడే ఎంక్వైరీ మొదలుపెట్టారు. అమెరికానుండి వచ్చిన వృద్ధ దంపతులు ఇండియా టూర్ చేస్తున్నారు. ప్రకటన చూశారట. పదిగంటలకి ఆఫీసుకొచ్చి నేరుగా నన్నే ఎంక్వైరీ చేశారు. ఆడపిల్లంటే ఆసక్తి చూపిస్తున్నారు. నా దగ్గరున్న ఒరిజినల్ ఫొటో చూసి ఫైన్ అన్నారు. వాళ్లకి ముగ్గురు ఆడపిల్లలు, ఇద్దరు మగపిల్లలు వున్నారట. శ్రీమంతులట. ప్రపంచ పర్యటన చేస్తున్నారట, ఈ బిడ్డను తీసుకువెళ్లి పెంచి పెద్ద చదువులు చదివిస్తారట. అది మానైతిక బాధ్యత అన్నారు. ఇప్పుడు మూడు గంటల ప్లేన్‌లో హైదరాబాదు వెళ్తారట. "రేపు తిరిగి రాగానే అమ్మాయిని చూస్తాము. మాకు, మీకు అన్నీ నచ్చి ఒక ఒప్పందం కుదిరితే ఇక్కణ్ణుంచి చికాగోకి ఏర్ టికెట్‌కి ఏర్పాటు చేస్తాం" అన్నారు. వాళ్ల టూర్ ప్లాన్ ప్రకారం మలయా, హాంకాంగ్, జపాన్ మీదుగా వాళ్ల దేశానికి వెళ్తారట. వాళ్లక్కడకి చేరారని తెలిసాక మనం ఇక్కణ్ణుంచి అమ్మాయిని పంపిస్తే సరి"

నరహరికి ఏమని జవాబు చెప్పాలో తెలియలేదు. "ఎల్లుండి ఉదయం పది గంటలలోపున నాకు తెలియబరచండి. విదేశాలు మీరు చూడలేదు. బాన్‌లో నేను విలేకరిగా మూడు ఏళ్లున్నాను. వాషింగ్టన్‌లో రెండేళ్లున్నాను. ఆ దేశాల్లో కొందరు జనాలు ఉదారంగా ఖర్చుపెట్టి ఇలాంటి పిల్లల్ని పెంచుతారు" మరో పది సెకన్లు శెనాయ్ మాట వినపడలేదు. తరువాత "మా ఎడిటర్ కబురు పంపారు. నేను వెళ్తున్నాను. మీరు ఆలోచించి రేపు రింగ్ చేయండి" అని రిసీవర్ పెట్టేశాడు.

భవాని ఒక్కదాని గురించి రేపటిలోగా నిర్ణయించుకోవాలి. అదోపెద్ద భారంలా మనసుని ఆవరించింది. పరాయిదేశం, వేరే ప్రజలు, వేరే సంస్కృతి అన్న సంగతి ప్రబలమైన కారణంగా కనపడలేదు. అయినా ఇద్దరు తల్లుల్ని ముందే పోగొట్టుకుంది. ఇప్పుడు తండ్రిని, తమ్ముళ్లని కోల్పోతుంది. తన పాత జీవనవిధానం, అలవాటయిన మనుషులు, పరిసరాలు లేకుండా బొత్తిగా విభిన్నమైన, విరుద్ధమైన మరో దేశానికి పంపించేస్తే చాలానే ఇబ్బంది పడుతుందేమోననిపించింది. నల్లరంగులోవున్న ఈ ఆడపిల్ల అక్కడకి వెళ్తే ముందుముందు పెళ్లికి, సంసారానికి కూడా కష్టం కావచ్చు

ఆ రోజూ నరహరి ఐదు గంటలకే ఆఫీసునుంచి బయలుదేరాడు. హెడ్‌క్లర్క్‌తో "మా చిన్న పిల్లలిద్దరికీ ఒంట్లో బాగోలేదు. రేపు నేనే డాక్టర్ దగ్గరకి తీసికెళ్లి మందిప్పించి ఆఫీస్‌కి వస్తాను. ఒకటి రెండు గంటలు ఆలస్యం కావచ్చు సాయంత్రం ఆవార ఎక్స్‌ట్రా అవర్స్ చేసేస్తాను" అన్నాడు.

ఇల్లు చేరేసరికి ఆరున్నరయింది. చిన్నవాళ్లిద్దరికీ మోషన్స్ కంట్రోలవలేదు. వాళ్లిద్దర్నీ ఎత్తుకుని ఒక ప్రైవేట్ డాక్టర్ దగ్గరకి తీసి




కెళ్లి చూపించి మందులు తెచ్చుకున్నాడు. అతను ఇంటికొచ్చేసరికి భవానివెళ్లి పైప్ దగ్గర ఆడుతున్న విజయ్‌ని, గణేశ్‌ని పిలుచుకొచ్చింది. వాళ్లిద్దరి బట్టలు యుగయుగాలనుంచీ ఉతుకు మొహం చూడనట్టుగా వున్నాయి. ఇంటికి రాగానే గణేశు అడిగాడు, "మమ్మల్నందర్నీ ఎవరెవరికో ఇచ్చేద్దామనుకుంటున్నావా నాన్నా? "

"ఎవరన్నారలాగ? "

"కదే భవానీ? "

"నేనేమీ చెప్పలేదు" అని నల్లబడ్డ ముఖంతో తప్పు దాచుకుంటున్నట్టుగా వంట గదిలోకి వెళ్లిపోయింది.

"భవాని ఏం చెప్పలేదునాన్నా. కౌసల్యాబాయి ఆంటీ, ఇంకా ఎవరెవరో ఈ మాట చెప్తూనే వున్నారు" అని విజయుడు అక్కని సమర్థించాడు.

భవాని చెప్పివుంటే తప్పేమీలేదు. అక్కడ మిగతా ఆడవాళ్లేమన్నా చెప్పటమూ అసంభవం కాదు. ఇలా అనుకున్న తండ్రి మౌనంగా వూరుకున్నాడు. పిల్లల బట్టలిప్పుడే ఉతికెయ్యడం మంచిది. స్టవ్ వెలిగించి, అన్నం ఎక్కించి అది ఉడికేలోగా బట్టలు ఉతికేయొచ్చు. రేపు ఆఫీసుకి లేటుగా వెళ్లటమెందుకులే. సాయంకాలం ఆ పని బేలన్స్ చెయ్యకపోతే జీతం తగ్గిస్తారు. ఇవాళ, నిన్న ఓటీ లేదుకూడా. వచ్చే నెల బియ్యానికి, పప్పులకి కటకటలాడాలేమో... ఇవన్నీ బుర్రలో తిరుగుతుండగా బట్టలు మారుస్తున్నాడు. అంతలో గణేశ్ మళ్లీ అడిగాడు, "నాన్నా మమ్మల్ని నిజంగానే పంపించేస్తావా? "

తండ్రి మాట్లాడలేదు. కాసేపాగి తండ్రి తొడమీద కూర్చుని మళ్ళీ అదే ప్రశ్న. అడిగాడు. తండ్రి అవుననీ అనలేదు. కాదనీ అనలేదు. కుర్రాడికి కోపం వచ్చింది. చెయ్యెత్తి ఫెడీల్మని తండ్రి చెంపమీద ఓటిచ్చుకున్నాడు.

వీడు దుడుకు వెధవని అందరికీ తెలుసు, తండ్రికీ తెలుసు. కాని తననే ఇలా వాయించగలడని వూహించలేదా తండ్రి. అరక్షణంపాటు ఆ పనికి కోపం కూడా వచ్చింది. కాని ఆ దెబ్బ అతని అంతరంగానికి తగిలినట్టయి తల తిరిగినంత పనయింది. నిన్న ఉదయం పేపర్లో తన పిల్లల ఫోటో చూసినప్పుడు అయినట్లుగానే కళ్ళు తిరిగి స్పృహ తప్పేలా అయిపోయింది. దెబ్బతిన్న ప్రాంతంలో బుగ్గ వెచ్చగా ఆవిరి వస్తున్నట్టయింది. తంబాకు నోట్లో వేసుకుంటే వేడి గొంతులోకి దిగినట్టయింది. అలాగే గోడకి ఒరిగి కూర్చున్నాడు.

గణేశ్ తొడమీంచి దిగి బయటకి పారిపోయాడు. నాన్నకి కోపం వచ్చింది. ఇక తనని కొట్టొచ్చు అనే భయంతో బెదిరాడు. తమమీద కోపం తెచ్చుకునే శక్తిని నాన్న కోల్పోయాడని వాడికి తెలియదు. విసురుగా చెయ్యి ఎత్తినా పిల్లల్నింక కొట్టలేననే సంగతి నరహరికి అర్థమైపోయింది. తనే కిందకి దిగి వెళ్ళి చీకట్లో డ్రైనేజి పక్కన కూర్చున్న కుర్రాడికి 'కొట్టను' అని హామీ ఇచ్చి ఇంటికి తీసుకొచ్చాడు.

బట్టలుతికి, వంట చేసి అందరికీ వడ్డించి, తన భోజనం కూడా అయ్యాక, నరహరి గణేశునే వాటేసుకుని పడుకున్నాడు. కుర్రవాడి ఒంటిమీంచి బురద మట్టి వాసనొస్తోంది. ఇలాంటి పిల్లల్ని శుభ్రంగా వుంచగలిగే వాళ్ళిద్దరే. ఒకరు తల్లి, ఇంకొకరు జైలు అధికారి అనుకుంటూ కళ్ళు మూసుకున్నాడు.

రామలక్ష్మణులు నిద్రపోయారు. భవాని, విజయ్ ఆ చివరి పరుపుమీదొకరు, ఈ చివరి పరుపుమీదొకరు పడుకున్నారు. భవాని ఈరోజు ఆ విషయమై తండ్రినేమీ అడగలేదు. డల్‌గా, మౌనంగా వుండిపోయింది. విజయ్ కూడా మౌనంగానే



వున్నాడు. వాళ్ళిద్దరిదీ సూక్ష్మబుద్ధి. అదీ గాక ఇద్దరికీ తల్లుల చావులు బాగా జ్ఞాపకం వున్నాయి. భవాని ఆడపిల్ల, పెద్దది. సరే, కాని విజయ్ ఎందుకు మాట్లాడలేదు? గణేశ్ నాన్నని చెంపమీద కొట్టడం చూసి విజయ్ నోరు కట్టుబడిపోయిందేమో.

మర్నాడు త్వరగాలేచి, పిల్లలని లేపి పక్క దుప్పట్లన్నీ ఉతికి ఆరేసాడు. అంతలో అన్నం ఉడికింది. రాత్రి మిగిలిన చారు వేసుకుని అందరూ అన్నం తినేసారు. మిగిలిన అన్నంలో మజ్జిగ వేసుకుని మధ్యాహ్నం పిల్లలు తింటారు. చిన్నపిల్లలిద్దరికీ లూజ్ మోషన్స్ కొద్దిగా కంట్రోల య్యాయి. కాని మళ్ళీ డాక్టర్ దగ్గరకి వెళ్ళి రావాలంటే మళ్ళీ ఫీజిచ్చుకోవాలి. అంత కంటే ఏదన్నా మందుల షాపుకి వెళ్ళి విరేచనాలు తగ్గడానికి పిల్లల డోసేదన్నా ఇమ్మని తెచ్చుకోడమే నయమని తీర్మానించుకున్నాడు.

మధ్యాహ్నం ఒంటిగంటకి శెనాయ్ నరహరి ఆఫీసుకొచ్చాడు. ఇద్దరూ ఉడుపి హోటల్‌కి వెళ్ళి కూర్చున్నారు. "అమెరికా పంపే ఆలోచనేమీ వద్దులెండి. మరీ సంబంధం లేని వాతావరణంలో పిల్ల మనసుకి కష్టం కలగొచ్చు సర్దుకోలేకపోవచ్చు" అన్న నరహరి మాటని శెనాయ్ కూడా ఒప్పుకున్నాడు. తరువాత అతనే "ఇవాళ పొద్దుట్నుంచీ ఆరు ఫోన్ కాల్స్ వచ్చాయి. కొందరు మేం ఒక బిడ్డని పెంచుతాం. అయితే ఏ జాతి, ఏ భాష అని అన్నీ వివరాలు అడిగారు. ఇంకొందరు పెద్ద కుర్రాడిని తీసుకుంటాం. మా ఇంట్లో పనిపాటలు చేసుకుని వుంటాడు. స్కూలుకి పంపిస్తాం అన్నారు. నేను కుదరదని చెప్పేసాను. పూర్తిగా దత్తత తీసుకునేవారికి, అన్ని విధాల బిడ్డ పూర్తిగా తమ స్వంత బిడ్డ అనే ఉద్దేశంతో స్వీకరించేవారికి మాత్రం ఇస్తాం. లేకపోతే లేదు అని చెప్పేసాను"

నరహరి మౌనంగా వుండిపోయాడు. "ఎందుకు మీరు ఒక్క మాట కూడా మాట్లాడకుండా వుండిపోయారు? " అని అడిగాడు శెనాయ్. మరో రెండునిమిషాలు అలాగే కూర్చుని, మెల్లగా నిట్టూర్చి తరువాత అన్నాడు. "ఏం చెప్పాలో, ఏం చెయ్యాలో తోచడంలేదు. మీరేం చేసినా నా పూర్తి సమ్మతి వుంది. మీరే నిర్ణయించండి"

"అది సరే, కాని జవాబ్దారీ మీది కదా"

ఆమాట నరహరి మనసుని దొలిచివెయ్యసాగింది. మనిషిచేసే పనులన్నింటికీ అతనే బాధ్యుడు. కొన్ని పనులు, నిర్ణయాలు పెద్ద బాధ్యత వహించాల్సిన అవసరం లేనంత తేలిగ్గా జరిగిపోతాయి.

కాని ఈ పిల్లల్ని దత్తత కిచ్చేద్దామనుకున్న క్రియకి వహించాల్సినంత గురుతరమైన బాధ్యత, మోయవలసిన భారం - బహుశ ఇంకే నిర్ణయానికి వహించాల్సిన అవసరం వుండదేమో.

మనసులో వేధిస్తున్న ప్రశ్నలకి సమాధానాలు వెతుక్కుంటూ అతను మరింత అంతర్ముఖుడవుతున్నాడు. అంతర్ముఖుడై తన అంతరంగాన్ని తరచి తరచి చూసుకుంటూ బాహ్యాలోకంతో సంబంధం లేకుండా ఎందరి మధ్య వున్నా ఏకాకి బతుకు బతకడం అతనికేమీ కొత్తకాదు. కాని అందువల్ల పిల్లలెంతో దూరమైపోతున్నారన్న సంగతి అతనికి అర్థంకాలేదు.

★ ★ ★

ఒకరోజు శెనాయ్ దగ్గర్నుంచి ఫోన్ వచ్చింది. నాసిక్ నుంచి ఒక దంపతుల జంట వచ్చిందిట! ఐదున్నరకి మేం ముగ్గురం మీ ఆఫీస్ కొస్తాం. అంతా కలిసి మీ ఇంటికి వెళ్దాం. వాళ్ళు పిల్లల్ని చూడాలనుకుంటున్నారు అన్నాడతను.




ఐదున్నరకి తమ కారులో వచ్చిన ఆ దంపతులు శ్రీమంతులని తెలుస్తూనే వుంది. ఆ ఇల్లాలికి సుమారు ముప్పై అయిదేళ్ళు వుండొచ్చు సుఖంగా పెరిగిన శరీరం. ఖరీదయిన చీర, నగలు. భర్తకి 50 సంవత్సరాలుంటాయి. ఏజెన్సీ వ్యాపారం. ఇద్దరూ ఇంగ్లీష్ మాట్లాడతారు. ఆమె రెండవ భార్య. కారు నడపడానికి డ్రైవరున్నాడు. నరహరి దారి చెబుతున్నాడు. దారిలో ఆయన నరహరిని కొన్ని ప్రశ్నలడిగాడు. ఆయనకి బాగా చిన్నపిల్లవాడు కావాలట.

అంతా కారు దిగి మేడ ఎక్కడం ప్రారంభించారు. ఆవిడకి నాల్గవ అంతస్తు ఎక్కడం కష్టమయి ఆయాసపడసాగింది. శెనాయ్ వారిద్దరి భావాల్ని సూక్ష్మంగా పరిశీలిస్తున్నాడు. నరహరి ముందుగా ఇంట్లోకి వెళ్ళి చూసాడు. మామూలే, రామలక్ష్మణులు ఇద్దరూ మోషన్ చేసుకున్నారు. భవాని క్లీన్ చెయ్యలేదు. ఇల్లు, వాళ్ళ ఒళ్ళు అంతా ఖరాబయ్యి, ఎండి కంపుకొడుతోంది. భవాని ఇంట్లోనే లేదు. నరహరి గబగబ వాళ్ళిద్దర్నీ బాత్‌రూంలోకి తీసికెళ్ళి వాళ్ళ ఒళ్ళు కడగసాగాడు. అంతలో మిగతా ముగ్గురు పైకి వచ్చారు. వాసన భరించలేక ఆ దంపతులిద్దరూ ముక్కులు మూసుకున్నారు. నరహరి గబగబ నేల కూడా కడిగి శుభ్రం చేసాడు. ఫినైల్ వేసి గుడ్డతో తుడిచేసాడు. ఒక చెక్కపెట్టి, మరో రెండు స్టూల్స్‌వేసి వాళ్ళని కూర్చోబెట్టాడు.

"వీళ్ళిద్దరూ చిన్నపిల్లలు. పెద్దపిల్లలిద్దరూ ఆడుకోడానికి వెళ్ళుంటారు. అమ్మాయి కింద ఇంటికేమన్నా వెళ్ళిందేమో"

ఆ స్త్రీ అడిగింది. "పిల్లల చర్మం ఎందుకిలా వుంది? "

"ఎప్పుడూ నేలమీద ఆడుతూ వుంటారు. దుమ్ము గొట్టుకోకుండా చూసుకుని అప్పుడప్పుడు బట్టలు మార్చి ఒంటికి కాస్త క్రీమ్ రాసేవాళ్ళు లేరు. చర్మం పగిలి, దుమ్ము నిండిపోయి ఇలా వుంది"

"ఇలా మోషన్స్ ఎందుకు చేసుకుంటున్నారు"

"క్రమంగా వేళప్రకారం ఆహారం ఇచ్చేటందుకు ఎవరూ లేరు. మందులిప్పిస్తున్నాం గాని, ఆహార నియమం లేకపోతే మోషన్స్ ఎలా కంట్రోలవుతాయి చెప్పండి"

ఆమె ఇంకా కొన్ని ప్రశ్నలడిగింది. యజమాని ఊరికే కూర్చున్నాడు. తరువాత వాళ్ళిద్దరూ బాల్కనీలోకి వెళ్ళి చిన్న గొంతులతో కాసేపు మాట్లాడుకున్నారు. అంతలో భవాని ఇంటికొచ్చింది. విజయ్, గణేశులు కూడా ఇంటికొచ్చారు. ఆ దంపతులిద్దరూ లోపలకొచ్చారు. ఆమె అంది. "రేపొకసారి ఈ పిల్లలిద్దర్నీ తీసుకొస్తే, దాదర్‌లో మా డాక్టరొకాయనున్నారు, ఆయన దగ్గర మెడికల్ ఎక్జామ్ చేయించి, తరువాత మా అభిప్రాయం చెప్తాము"

"మంచిది, సాయంకాలం అయితే వీలుగా వుంటుంది. మీరు ఇక్కడకి ఎన్ని గంటలకొస్తారు? లేదంటే మీరు ఎక్కడకి రావాలనుకుంటారో, ఆ సంగతి నాకు ఆఫీస్‌కి ఫోన్ చేసి చెప్పండి" అన్నాడు శెనాయ్.

వాళ్ళు వెళ్ళిపోయారు. శెనాయ్ ఆగాడు. భవాని అడిగింది, "నాన్నా! మమ్మల్ని చూడ్డానికే కదా వీళ్ళు వచ్చారు? "

"లేదమ్మా, నీకేం తెలీదు. నువ్వేమీ మాట్లాడకు"

"అలా సర్దెయ్యకండి నరహరిగారూ. సంగతేమిటో పిల్లలకి తెలిసిపోతేనే మంచిది. అంతా వాళ్ళకి చెప్పేసెయ్యండి" అని శెనాయ్ ఇంగ్లీష్‌లో చెప్పాడు.

"శెనాయ్ మామా మీరు ఇంగ్లీష్‌లో ఏమంటున్నారు? "

"నేనంతా తరువాత చెప్తాలేమ్మా"

అన్నాడు తండ్రి.

శెనాయ్, భవానిని దగ్గర కూర్చోబెట్టుకుని అంతా వివరంగా విడమరచి చెప్పాడు. "నిజంగా ప్రేమగా చూసుకునేవాళ్ళకే పెంచుకోడానికిస్తాం. పిల్లల్లేని వాళ్ళు ఎంతో ముద్దుగా పెంచుకుంటారు. దత్తతకిచ్చేసాక కూడా మీ నాన్న వచ్చి చూసిపోతుంటారు. ఆడపిల్లలు పెళ్ళయ్యాకయినా మరోచోటికి వెళ్ళవలసిందే కదా! దత్తత తీసుకున్న ఇల్లూ అంతేనమ్మా, 'వెళ్ళను' అనకూడ దమ్మా"

అతనిదంతా చెబుతుంటే నరహరి లోపలకి వెళ్ళి రెండు చాయ్‌లు తయారు చేసి, స్టవ్‌మీద అన్నంగిన్నె పెట్టి చాయ్ కప్పులు తీసుకుని వచ్చాడు.

శెనాయ్ అడిగాడు, "నరహరిగారూ ఈ వచ్చిన వాళ్ళిద్దరూ ఎలా అనిపించారు మీకు? "

"ఎందుకో వాళ్ళ పద్ధతి అంతగా నచ్చ లేదు"

"నాకూ అలాగే అనిపించింది. వాళ్ళకి చిన్నవాళ్ళిద్దర్లో ఎవరో ఒకర్ని తీసుకోవాలనే ఇంట్రెస్ట్ వుంది గాని, ఆమె పిల్లలిద్దర్లో ఏ ఒక్కర్నీ చేత్తో తాకనుకూడా తాకలేదు. చూసేటప్పుడు కూడా ముఖంలో ఒకరక మైన పేట్రనైసింగ్ లుక్"

"డాక్టర్ పరీక్షలేమిటి? "

"బిడ్డకి నయంకాని వ్యాధులేమన్నా వున్నాయేమో ఖాయం చేసుకోడానికి పరీక్ష చేయించుకుంటే చేయించుకోనీయండి. దాని కేంగాని, ఆవిడలో స్త్రీ సహజమైన మార్ద వత, ప్రీతి ఏమాత్రమూ కనపడలేదు నాకు'

"అలాగైతే మనం ఇవ్వం అని చెప్పేద్దాం'

"రేపెలాగూ ఫోన్ చేస్తారుగా అప్పుడు చెబుతాలెండి"

వాళ్ళిలా మాట్లాడుకుంటుంటే భవాని అక్కడే వుంది. ఇదంతా విని తనలో తనే ఏదో ఆలోచిస్తూ కూర్చుంది.

★ ★ ★

ఎంతోమంది వచ్చి పిల్లల్ని చూసుకుని వెళ్తున్నారు. కొంతమంది అసమ్మతి సూచ కంగా, మౌనంగా వెళ్ళిపోతున్నారు. మరి కొందరు ఒప్పుదల సూచించారు. ఒక గుజ రాతి శ్రీమంతురాలు వితంతువు, స్వయంగా వచ్చి చూసి గణేశ్‌ని ఒప్పుకుంది. నరహరి, శెనాయ్‌లతో సంప్రదింపులు జరిపేటప్పుడు, శెనాయ్ ఉపాయంగా కొన్ని ప్రశ్నలు అడి గాడు. అప్పుడు బయటపడింది అసలు సంగతి.

పెళ్ళయిన ఆరు నెలలకల్లా భర్త మర ణించాడు. తనకి పిల్లల్లేరు. భర్త ఆస్తి అతని అన్నదమ్ములకి చేరనీకుండా చేయడా నికి ఈ దత్తత స్వీకారం చేసుకోడానికి తయారైంది. ఆమెకి పుట్టింటివైపు అలాంటి పిల్లలెవరూ లేరు. ఉంటే వాళ్ళనే పెంచుకు నేది. ముప్పైరెండు, ముప్పై మూడేళ్ళ వయసు, చాలా ఘటికురాలని అర్థమైంది శెనాయ్‌కి. దత్తతివ్వడం తమకిష్టంలేదని చెప్పి పంపించేసాడు.

మరో దంపతులు రత్లామ్‌నుండి వచ్చారు. గణేశ్‌ని ఇష్టపడ్డారు. వీళ్ళకీ వాళ్ళు నచ్చారు. జమీందారు కుటుంబం. పిల్లల్లేరు. యజమానికి తమ్ముళ్ళున్నారు గాని, వాళ్లకి వీళ్ళకి మొదట్నుంచీ పొందిక లేదు. వీళ్ళు మొదట్నుంచీ వేరుగానే వున్నారు. మంచి అద్దెలొచ్చే ఇళ్ళున్నాయి. యజమానికి నలభై అయిదు సంవత్సరా లుంటాయి. ఆమెదీ ప్రీతిమయస్వభావం. వాళ్ళకే ఇవ్వాలని నిర్ణయించడము, మాటి వ్వడం కూడా జరిగింది. పిల్లలందర్ని ఒకే




రోజు దత్తత స్వీకరణకివ్వాలని నరహరి నిశ్చయించాడు. దత్తత రెజిస్ట్రేషన్ కూడా ఆరోజే అయిపోవాలి. పిల్లలందరి సంగతి నిర్ణయం కాగానే, ఒక ఏర్పాటుచేసి, మంచి రోజు చూసి తెలియబరుస్తానని వారితో చెప్పాడు. వెళ్ళేటప్పుడు ఆ యజమాని,

"మీరూ మా వూరికి వచ్చివెళ్ళండి. ఇల్లు వాకిలి చూసుకోండి. మేం ఎలాటి వాళ్ళమో చుట్టుపక్కల అడిగి తెలుసుకోండి. ఏమీ కంగారు పడవద్దు" అన్నారు.

నరహరి తనే స్వయంగా వాళ్ళని బొంబాయి సెంట్రల్‌లో రైలెక్కించి అట్నుంచి ఆఫీసుకి వెళ్ళిపోయాడు. ఆ తరువాత ఎనిమిది రోజులకి రత్లామ్ నుంచి ఆరుగురు వస్తాదుల్లాంటి ఆసాములు ఇతని ఇల్లు వెతుక్కుంటూ వచ్చారు. అందులో ఇద్దరు గణేశ్‌ని దత్తు తీసుకుందామనుకున్న జమీందారు తమ్ముళ్ళట.

"మా అన్నయ్య పెంచుకోవాలంటే మా పిల్లల్లోనే ఒకరిని దత్తత చేసుకోవాలి. అతనడిగాడు కదా అని మీరిచ్చేద్దామనుకుంటున్నారేమో సావధాన్! ముందే చెప్తున్నాం. మీ పిల్లాడక్కడ మూడు నెలలకంటే బతకడు. విషప్రయోగమో, బందిపోట్లు ఎత్తుకుపోడమో ఏం జరుగుతుందో చెప్పలేంగానీ అది జరిగి తీరుతుంది" అని ఉజ్జైని మహాకాళేశ్వరుడిమీద ఒట్టుపెట్టి చెప్పారు.

మిగిలిన నలుగురు సభ్యగృహస్థులు. మీ కుర్రాడు బతకాలనుకుని ఇస్తున్నారా? చస్తే చావనీ అని వదిలించుకుంటారా? మీరూ మానవత్వం వున్న మనుషులేగా. కొడుకు అంటే మీకేమన్నా ప్రేమ లేదా ఏం? మాకివ్వడానికి కుదరదని రాసెయ్యండి అని బెదిరించి బుద్ధి చెప్పారు. ఈ నలుగురూ తమ దగ్గరకొచ్చిన దంపతుల బంధువులేనని అర్థమయింది. తన కొడుకు క్షేమంకోసం వాళ్ళు చెప్పినట్టు చేసెయ్యడమే మంచిదని తోచింది నరహరికి. వాళ్ళెదురుగా ఒక ఉత్తరం వ్రాసి వాళ్లచేతికే పోస్ట్ చెయ్యమని అప్పచెప్పాడు. కూడా వచ్చిన నలుగురు గణేశ్ తలమీద చెయ్యిపెట్టి 'వెయ్యేళ్ళు చల్లగా బతుకు అని ఆశీర్వదించారు. ఇద్దరు సోదరులూ తలో పాతిక రూపాయలు కుర్రాడి జేబులో పెట్టి "మిఠాయీ ఖావో" అన్నారు. ఒద్దు గాక ఒద్దని నరహరి అడ్డపడ్డాడు. వాళ్ళు వినలేదు. "మా అభిమానం కొద్దీ ఇచ్చాం, మా పిల్లలెలాగో వాడూ అలాగే" అని రెండు మర్యాదవాక్యాలు పలికి బయల్దేరారు. కూడా వచ్చిన నలుగురూ వెంట వెళ్ళారు.

ఇంటికెవరన్నా రావడం, తమని చూసి వెళ్ళడం పెద్దపిల్లలు ముగ్గురికీ అలవాటయిపోయింది. తండ్రి తమని ఇచ్చివేయడం ఖాయమన్న సంగతి భవానికి అర్థమైపోయింది. ఆ పిల్ల ఆ విషయం గురించి మళ్ళీ మాట్లాడలేదు. తమ నుదుటి వ్రాత అనే విషయాన్ని తనకి తెలియని వివరణతో తనకితనే చెప్పుకుని ఓదార్చుకుంటోంది. తండ్రి ఇంట్లో లేనప్పుడు ముగ్గురూ ఇవే సంగతులు మాట్లాడుకుంటూంటారు. విజయ్ కూడా అక్కలాగే లోలోపల తర్కించుకుంటాడు. ఇంకా ఆలోచించడం చేతకాకపోతేనో లేక ఆలోచించడం కష్టమై ఏడుపొచ్చినట్లయితేనో పైప్ దగ్గరకి ఆటకి వెళ్ళిపోయేవాడు. మురికివాడలో కూడా నలుగురైదుగురు మర్యాదగా, గంభీరంగా వుండే కుర్రాళ్ళున్నారు. విజయ్ వాళ్ళతో గోలీలాడేవాడు. లేదా వాళ్ళ గుడిసెల్లో జరిగే తగువులు, తిట్లు వింటూండేవాడు. తన స్కూల్లో కొత్త పాఠం ఏదన్నా చెబితే వాళ్ళకా కథలు చెప్పేవాడు.

గణేశ్ మొదట్లో నాలుగురోజులు దిగాలుగా వున్నాడు. తరువాత వాడిలో అదో రకం ఉత్సాహం చోటుచేసుకుంది. రత్లామ్ వాళ్ళిచ్చిన డబ్బు నాన్న తీసేసుకోలేదు. భవాని, విజయ్ వద్దంటున్నా వినకుండా



వాడే స్వయంగా వెళ్ళి అందరికీ మిఠాయి కొనుక్కొచ్చాడు. బెలూన్లు కొన్నాడు. మిగిలిన డబ్బు వాడు నిద్రపోతుండగా భవాని తీసి దాచిపెట్టింది.

ఒకరోజు భవాని, విజయ్ తాము వెళ్ళిపోయే విషయం మాట్లాడుకుంటున్నారు. భవానికి ఉన్నట్టుండి ఏడుపొచ్చేసింది. విజయ్ కళ్ళల్లోనూ నీరూరింది. ఇద్దరూ ఒకరి చేతినొకరు పట్టుకుని వెక్కివెక్కి ఏడ్చారు.

అక్కడే కూర్చున్న గణేశ్ "ఎందుకురా ఏడుస్తారు? దత్తత ఇల్లంటే చాలా షావుకార్లుంటారట. సినిమా యాక్టర్లలాగ ఎప్పుడూ కారుల్లోనే తిరగచ్చుట. ఇంట్లో రోజూ గులాబ్ జాంలు తినచ్చుట" అన్నాడు.

"నీకెవరు చెప్పార్రా ఈ అబద్ధాలన్నీ?" అంది అక్క.

"ఆటలకెళ్ళినప్పుడు గుడ్డీ, టింకూ చెప్పారు"

విజయ్ అన్నాడు, "చూడవే భవానీ! గుడ్డీ, టింకు అంటే కుర్లాస్టేషన్‌లో పిక్‌పాకెట్ చేసుకొచ్చేవాళ్లు. వాళ్ళతో చేరద్దంటే వినడు వీడు"

"ఏడవనీ మనకెందుకు? అయినా, నువ్వు ముందే నాన్నకెందుకు చెప్పలేదు? అది కాదురా గణేశూ, దత్తత వెళ్ళాక నీకు నాన్ననీ, మమ్మల్ని చూడాలనిపించదా? అప్పుడేం చేస్తావు?"

"చూడాలనిపిస్తే కారేసుకుని పాం, పపాం అనుకుంటూ వచ్చేస్తాను. జుం...య్ మని ఏరోప్లేన్‌లో వస్తాను"

"ఆహాహా... కాసుక్కూర్చో వెళ్ళిరా నాయనా అని కారిచ్చి పంపిస్తారు. రెండు తగిలిచ్చి చీకటి గదిలో పడేస్తారు" అని విజయ్ వాడి ఉత్సాహపు పొంగుమీద నీళ్ళు జల్లాడు. కోపం వచ్చిన గణేశ్ ఫెడీల్మని జవాబిచ్చాడు. గదిలో మూసేస్తే 'తాలా తోడ్' చేస్తానంతే. తలకాయ పగలగొట్టి పారిపోయి వచ్చేస్తాను.

గణేశ్ మాటలకి అన్నయ్య తెల్లబోయాడు. తను వాడికంటే పెద్దవాడే. తనూ అదే పని చెయ్యొచ్చు కాని వాడికున్న ధైర్యం తనకెక్కడిది? వాడు ఘటికుడు. ఏం చేయాలనుకున్నా చెయ్యగలడు. అందుకే మరి. ఆరోజు ఆరుగురు పెద్దవాళ్ళొచ్చి వాడికి అంత డబ్బిచ్చి వెళ్ళారు. తనకెవరూ ఏమీ ఇవ్వలేదు. అని ఆలోచనలో పడ్డాడు.

భవాని మనసు మరోరకంగా వుంది. 'తను ఆడపిల్ల. చెప్పినట్టు విని తీరాలి. ఎలాంటి వాళ్ళొచ్చి తీసికెళ్తారో ఏమో. కింద ఇంట్లో పనిచేసే 'జీజు' నిన్ననే అంది దానికి పెళ్ళి అయినప్పుడు తొమ్మిదేళ్ళట. "నీకు ఇప్పుడు తొమ్మిదేగా. నువ్వూ అత్తగారింటికి వెళ్తున్నాను అనుకుని వెళ్ళిపో, ఏం చేస్తాం మరి?" అంది. ఎన్ని రకాలుగా ఆలోచించినా భయం మాత్రం పోవడంలేదు. మళ్ళీ కన్నీళ్ళు పెట్టుకుంది. విజయ్ ఆమె చెయ్యి పట్టుకున్నాడు.



బరోడానుంచి ఒక జంట వచ్చారు. భర్త బాబూబాయి శాంతి బాయి పటేల్ వ్యాపారి. పల్లెలో పొగాకు, పత్తి పెరిగే పెద్ద పొలం వుంది. సుమారు నలభైయేళ్ళ వయసు. ఖాదీవస్త్రాలు ధరించి వున్నాడు. భార్య ఇందూ బెన్‌కి ముప్ఫైరెండేళ్ళు. స్థూలకాయం. ముందే ఉత్తరాల వ్యవహారం జరిపి మరీ వచ్చారు వాళ్ళు. బోంబే సెంట్రల్ దగ్గర తమ బంధువులింట్లో దిగి సామానక్కడపెట్టి, తిన్నగా పత్రికా ఆఫీస్‌కి ఫోన్‌చేసి శెనాయ్‌ని చూశారు. అతన్ని వివరాలు అడిగి నరహరి ఆఫీస్‌కి వెళ్ళారు. సాయంత్రం నాలుగున్నరకి అతన్ని కూడా తీసుకుని ఇంటికి బయల్దేరారు వాళ్ళు.




వాళ్లు బస్సుదిగి మురికివాడ దాటి వచ్చే సరికి వీళ్ళ బిల్డింగ్ ముందు ఒక టాక్సీ ఆగి వుంది. ఈ గుజరాతి దంపతుల వయసు వాళ్లే అయిన మరో జంటతో టాక్సీలో శెనాయ్ దిగాడు. నరహరిని చూసి, వీళ్ళు ఎంక్వైర్ చేసి వెళ్ళగానే వీళ్లొచ్చారు. జయపూర్ వాస్తవ్యులు- చాంద్‌మల్‌జీ, వారి శ్రీమతి లక్ష్మీదేవి. నేను మీకు ఫోన్ చేసే సరికే మీరు వీళ్ళని తీసుకుని ఇంటికి బయల్దేరారని చెప్పారు. సరే, మేమూ వెంటనే టాక్సీ తీసుకుని బయల్దేరాము" చాంద్‌మల్‌జీ టాక్సీవాడికి డబ్బిచ్చి పంపించేశారు.

అందరూ పైకి వెళ్ళేసరికి పరిస్థితి మామూలే. చిన్నపిల్లలు ఇద్దరూ ఏడుస్తున్నారు. రాముడిని ఎత్తుకుని తీసికెళ్ళి భవాని బాత్‌రూమ్‌లో కడుగుతోంది. పక్కనే ఆడుతున్న లక్ష్మణుడి కాళ్ళు కూడా యాక్ అయ్యాయి. "ఆహారం సక్రమంగా లేక పిల్లల కడుపు అప్‌సెట్ అయింది" శెనాయ్ సంజాయిషీ ఇచ్చాడు. నరహరి లక్ష్మణుడిని ఎత్తి తీసికెళ్ళేలోగానే ఇందూబెన్ ఆ పిల్లవాడి చంకలకింద చెయ్యివేసి బాత్‌రూంలోకి తీసికెళ్ళింది. జయపూర్ లక్ష్మీదేవి నరహరి చేతిలో వున్న కాగితం ముక్కని లాక్కుని నేలమీద శుభ్రం చేసేసింది. ఇది చూసి నరహరికి ఆశ్చర్యం. శెనాయ్ ముఖంలో తృప్తి. అంతలో భవాని రాముణ్ణి శుభ్రంచేసి తీసుకొచ్చింది. ఇందూబెన్ లక్ష్మణుడిని ఎత్తుకుని తన చీరకొంగుతో వాడి కాళ్లు, ఒళ్లు తుడుస్తూ వచ్చింది. నరహరి ఒక చాప పరచాడు. గోడకి మరో కపక్క జంబుఖానా వేశాడు. ఇందూబెన్ లక్ష్మణుడిని తొడమీద వేసుకుని భర్తపక్కన కూర్చుంది. భవాని చేతుల్లో వున్న రాముడిని లక్ష్మీదేవి అందుకుంది. తమని ఎత్తుకున్నవాళ్లు కొత్తవాళ్లు అని తెలియగానే పిల్లలు ఏడవసాగారు. వాళ్ళని తీసుకుని ఊరుకోపెడదామని నరహరి చెయ్యిచాచాడు. కాని ఆ స్త్రీలు ఇవ్వలేదు. వాళ్ళే చిటికెలువేసి, ముద్దులాడి, చేతుల్లో ఉయ్యాలలూపి వాళ్ళని ఐదు నిమిషాల్లో ఊరుకోబెట్టారు. కొత్తవాళ్లిద్దరూ ఒకరితో ఒకరు పరిచయం చేసుకున్నారు. లక్ష్మీదేవిది రాజస్థానీ హిందీ. ఇందుబెన్‌ది గుజరాతి. ఇందూబేన్ అడిగింది "మీరూ చిన్నబిడ్డకోసమే వచ్చారా? "

"అవును, ఊహ తెలియని పిల్లలయితే మనకీ బాగుంటుంది, వాళ్ళకీ బాగుంటుంది. మేము ఆ మాట ముందే రాసేశాము"

"మా చాహ్ కూడా అదే. రాగానే వీడే చేతికి దొరికాడు. వీడినే ఎత్తుకున్నాను. ఇప్పుడు వీడే ఒళ్ళోచేరి కూర్చున్నాడు"

"వీడూ అంతే కాసేపు పిర్రమీద తట్టేసరికి ఏడుపాపి కరచుకుని పడుకున్నాడు" అని లక్ష్మీదేవి రాముణ్ణి కౌగలించుకుంది.

కొంతసేపు ఆ కొత్తగా వచ్చిన మగవాళ్ళిద్దరూ ఒకరితో ఒకరు మాట్లాడుకున్నారు. తరువాత నరహరి, శెనాయ్‌లతో మాట్లాడారు. మిగతా సంగతులన్నీ ఉత్తరాల్లోనే స్పష్టంగా వెల్లడించుకోవడం అయింది. ఆడవాళ్ళకూ నచ్చుబాటయింది. లక్ష్మణుడిని బరోడా పటేల్ దంపతులకి, రాముణ్ణి జయపూర్ చాంద్‌మల్ దంపతులకీ ఇవ్వచ్చుని తాత్కాలికంగా నిర్ణయం తీసుకోవడం కూడా అయింది. దంపతులిద్దరూ రాత్రి తొమ్మిదిగంటలవరకు కూర్చున్నారు. ఇంట్లో వున్న పాలతోటే నరహరి టీ చేసిచ్చాడందరికీ.

మర్నాడు కూడా ఆ జంటలు రెండూ వచ్చి తమ తమ పిల్లల్ని చూసుకుని కాసేపు ముద్దులాడి వెళ్ళిపోయారు.

ఇదయిన రెండవరోజే ఆగ్రానుంచి ఒక బట్టల వ్యాపారి, అతని భార్య వచ్చారు. ఆరోజు నరహరి ఆఫీస్‌కి వెళ్ళలేదు. సత్యపాల్, అగర్వాల్ అనే ఈ వ్యక్తితో మొదటే

ఉత్తరాల్లో వ్యవహారం జరిగింది. ఫలానారోజున వస్తామని ముందుగానే తెలియబరచారు. అగర్వాల్ గారిని చూడగానే ఈయన 'వ్యాపారి' అని చెప్పెయ్యచ్చు కొంచెం స్థూలకాయం. తెల్లపంచె కట్టుకుని, వదులైన జుబ్బా తొడుక్కున్నారు. జుబ్బాకి గుండెల మీదక్కనపడేలా లోపలిజేబు ఒకటుంది. మొలతాడుకి కట్టిన రెండు తాళంచెవులు ఆ పల్చటి జుబ్బాలోంచి కనిపిస్తున్నాయి. వెడల్పాటి తెల్లటి ముఖం, గుబురుమీసం. ఆయన భార్య శోభారాణి కూడా కళకళ్లాడే లక్షణమైన ముఖం గల స్త్రీ. భర్తకంటే మరి కాస్త స్థూలకాయం. ఒంటిమీద తగినంత బంగారం వుంది. మొట్టమొదట కంటబడ్డ రామలక్ష్మణులలో ఒకర్ని తీసుకోవాలనుకున్నారు. కాని వాళ్ళిద్దర్నీ ఎవరికో ఇవ్వడానికి ఒప్పందం జరిగిపోయిందని చెప్పాక, ఆడుకోడానికి వెళ్ళిన విజయ్‌ని, గణేశ్‌ని కబురు పెట్టి పిలిపించారు. చిలిపిదనం ముఖంలో కొట్టొచ్చినట్టు కనిపించే గణేశ్ వారిని వెంటనే ఆకర్షించాడు. అగర్వాల్ గారు 'వాడి బుగ్గనిమిరి, "మా ఇంటికొస్తావా బేటా?" అని పలుకరించారు. గణేశ్ మౌనంగా





క్షణం తల తిరిగినట్టయింది. కాని తొంద రగా స్పృహ తెచ్చుకున్నాడు. అగర్వాల్ దంపతులు రెండుగంటలసేపు కూర్చుని మాట్లాడారు. మరీ జమీందార్లు కాకపో యినా, తామూ అంతో ఇంతో వున్నవాళ్ళమే నని, బట్టల వ్యాపారం మంచిస్థితిలో వుందని చెప్పారు. "మీరొకసారి మా వూరొచ్చి అన్నీ చూసుకువెళ్ళండి. ఎవరికీ ధోకా ఇచ్చే పద్ధతులేం లేవు మాకు" అన్నారు.

నరహరిని, గణేశ్‌ని వెంటబెట్టుకుని ఒక బట్టలషాప్‌కి వెళ్ళారు. నరహరి ఒద్దు ఒద్దంటున్నా విజయ్‌కి, రామలక్ష్మణులకి రెడీమేడ్ డ్రెస్‌లు కొన్నారు. భవానికి లంగా, జాకెట్ బట్ట తీసుకుని మళ్ళీ ఇంటి కొచ్చారు. శోభారాణి భవానిని చెంపమీద ముద్దెట్టుకుంది. భోజనం చేసి వెళ్ళమని నరహరి బలవంతం చేశాడు. శోభారాణినే అన్నం పప్పు ఉడికించడానికి స్టవ్‌లముందు కూర్చుంది. అగర్వాల్‌గారు సంప్రదాయం, భక్తిభావం కలబోసుకున్న వ్యక్తి. ఆయన పిల్లలకోసం తను మొక్కిన మొక్కులు, చేసిన తీర్థయాత్రలు అన్నీ వివరంగా చెప్పారు. "మళ్ళీ పెళ్ళి చేసుకోమని ఎంత మందో చెప్పారు. పిల్లలు పుడితే ఈవిడవల్లే పుట్టాలి. ఒక భార్య వుండగా మరో భార్యని తెచ్చుకోవడం సచ్చాకామ్ కాదు. అందుకే నేనొప్పుకోలేదు. దత్తత తెచ్చుకోవాలని రెండేళ్ళనుంచీ అనుకుంటూనేవున్నాము. పేపర్‌లో మీ సంగతి వచ్చింది. నాకు ఇంగ్లీష్ చదవడం రాదు. ఏదో అడ్రస్ చదివి అర్థం చేసుకోగలను. షాపులో బిల్లులు రాయగలను. అంతే. పేపర్ చద వలేను. మా ఇంట్లో అద్దెకున్నాయన చెప్పాడు. ఆయన కాలేజి లెక్చరర్. ఆయనే మీకు లెటర్ వ్రాసిపెట్టారు. ఇంగ్లీష్ నేనె



నుంచున్నాడు. శోభారాణి వాడి ముఖాన్ని దోసిట్లోకి తీసుకుని ముద్దు చేస్తూ, "వస్తావా బాబూ? మనింట్లో మిఠాయి పెడతాను. కొత్త కొత్త బట్టలు కుట్టిస్తాను. మనదే కప్‌డా దుకాన్ ఉంది" అని వూరించింది.

గణేశ్ "ఏరోప్లేన్‌మీద తీసికెళ్తారా? " అని అడిగాడు.

"వాహ్ బేటా, అలాగే వెళ్దాం. ఇక్క డ్నుంచి ఢిల్లీకి ప్లేన్‌లో వెళ్ళి, అక్కడ్నుంచి ఫస్ట్‌క్లాస్‌లో రైల్లో వెళ్దాం"

గణేశ్ "ఊc..." అన్నాడు.

నరహరికి ఆశ్చర్యం వేసింది. కడుపులో పేగులు మెలిపెట్టినట్టయింది. ఒక్క అర

క్కడ వ్రాయగలను? "

ఆయనది వ్యాపారం అవటంవల్ల వీలై నంత త్వరగా వూరికి వెళ్ళిపోవలసివుంది. మధ్యాహ్నం మూడుగంటలకల్లా ఇల్లు వదలి బయల్దేరారు. బొంబాయిలో వాళ్ళకి పరిచయస్థులెవరూ లేరు. సూట్ కేస్, బెడ్డింగ్ క్లాక్ రూంలో పెట్టివచ్చారు. ఎలా గన్నా సాయంత్రం రైలు ఎక్కి వెళ్ళాలని నిర్ణయించుకుని బయల్దేరారు.

మర్నాడు శెనాయ్ ఫోన్ చేశాడు. "అతని ఫ్రెండ్‌కి మరో ఫ్రెండ్ వున్నాడట. పేరు త్ర్యంబక్ పణందీకర్. బొంబాయి గవర్న మెంట్ తాలూకు పి.డబ్ల్యు.డి పూనా డివిజ న్‌లో ఇంజనీర్‌ట. పన్నెండు సంవత్సరాల కొడుకున్నాడట వారికి. ఆ దంపతులకి ఆడ పిల్ల కావాలని కోరిక. వాళ్ళు వచ్చి భవానిని చూసి ఒప్పుకుంటే పంపవచ్చు. పణందీకర్ దంపతులతో శెనాయ్‌కి ప్రత్యక్ష పరిచయం లేదు. కాని శెనాయ్ స్నేహితుని మాటల ప్రకారం, వారిద్దరూ మంచి మనుషులు.

రమ్మను అన్నాడు నరహరి. శెనాయ్ పూనాకి టెలిగ్రాం ఇచ్చాడు. తరువాత ఆది వారం వాళ్లు శెనాయ్‌తో కలిసి నరహరి ఇంటికొచ్చారు. భవాని వారికి నచ్చింది. ఆవిడ "మా అబ్బాయి విఠల్‌ని కూడా తీసు కురావాలనుకున్నాం. కాని స్కూల్లో పిక్నిక్ వుంది. ఎక్స్ట్రా కరిక్యులర్ ఏక్టివిటీస్‌కి వాడే లీడర్. అందుకని వాడు వెళ్ళకతప్ప లేదు" అంది.

త్ర్యంబక్‌రావుగారు, "ఆడపిల్లల్లేని ఇల్లు అందంలేని ఇల్లు. అసంపూర్తిగా వుంటుంది. విఠల్ పుట్టేటప్పుడు తల్లికి ఇబ్బంది కలగ టంవల్ల ఇక పిల్లలు పుట్టే అవకాశం లేకుండా అయింది. ఆడపిల్లంటే మాకిద్దరికీ ఎంతో ప్రీతి. భవాని అనే పేరు బాగుంది. శివాజీ మహారాజు కులదేవత పేరుకదా? ఆడపిల్ల అని వూరుకోం. బాగా చదివిస్తాం. చక్కగా పెంచుతాం. తరువాత మంచి సంబంధం చూసి చేస్తాం. కన్యాదానఫలం కూడా దొరుకుతుంది" అన్నారు.

★ ★ ★

పిల్లలొక్కొక్కరి భవిష్యత్తు నిశ్చయమ య్యేకొద్దీ నరహరి మనసు మరింత లోలో పలికి కుంచించుకుపోసాగింది. ఇంటి వాతా వరణమే మారిపోయినట్లనిపించసాగింది. ముందు కూడా అతను భార్యాపిల్లలతో పెద్ద కబుర్లు చెబుతూ ఎప్పుడూ కూర్చునే వాడు కాడు. ఎప్పుడూ మాటలు తక్కువే. కాని అప్పటి మౌనానికి కూడా ఒక స్పష్ట మైన అర్థం, భాష్యం వుండేది. ఇప్పుడు పిల్లలు కూడా అతని ఎదుట మౌనంగా వుండటం అలవాటు చేసేసుకున్నారు. ఈ మౌనం వేరేరకం. జడివాన కురిశాక మిగి లిన నిశ్శబ్దంలా, మాటల ప్రవాహం తరు వాత మిగిలిన శాంతిలా వుండేది ఆ మౌనం. ఇప్పటి నిశ్శబ్దం భయంకరం, మహాశూన్యం, దుర్భిక్షం, కరువు కాటకం కాటేసిన వూరిని విడిచి ప్రజలంతా వెళ్ళి పోతే మిగిలిన స్మశానంలాటి మౌనం ఇది.

రామలక్ష్మణులు ఎప్పుడూ ఒకలాగే వున్నారు. వాళ్ళ నోటినుంచి చిన్నచిన్న అర్థం పర్థంలేని శబ్దాలు వస్తూవుంటాయి.

భవాని, విజయులిద్దరూ మితభాషులు. ఇప్పుడయితే అసలు మాటలాడరు. ఇదివ రకు భవాని తండ్రి ఇంటికి రాగానే అప్పటి వరకు జరిగినవన్నీ వార్తలు చేరేసేది. గణేశ్ పోకిరిమాటలు నేర్చుకుంటున్నాడని చెప్పి, "మరీ మితిమీరిపోతున్నాడు. రెండు తగల్నివ్వాలి నాన్నా" అనేది. ఇప్పుడే మీ మాట్లాడదు భవాని. తను చెయ్యాల్సిన పనులన్నీ చేస్తుంది. మునుపటికంటె ఎక్కువ శ్రద్ధగా చిన్నపిల్లలిద్దరి అవసరాలు జాగ్రత్తగా చూసుకుంటోంది. తను చనిపో తానని ఖాయంగా తెలిసిపోయాక వాళ్ళమ్మ




ముఖంమీద ఎలాంటి భావం వచ్చిందో అదే భావం భవాని ముఖంమీద కూడా వచ్చింది.

విజయ్ స్కూలుకి వెళ్తున్నాడు. స్కూలు నుంచి వచ్చాక పైప్ దగ్గర ఆటలకి వెళ్ళడి ప్పుడు. ఎప్పుడూ ఇంట్లో అక్కతోబాటు వుండిపోతాడు. అక్క తమ్ముళ్లు ఒకిరితో ఒకరు ఎన్నో మాట్లాడుకుంటారేమోగాని, తండ్రి వచ్చాక మాత్రం మూగవాళ్ళలా వుండిపోతారు.

గణేశు మాత్రం పైప్ దగ్గర ఆటలకి వెళ్తాడు, తెగమాట్లాడుతాడు. "నేను ఏరోప్లే న్‌లో వెళ్తాను. రోజూ మిఠాయి తింటాను" అంటుంటాడు. మౌనంగా వుండకపోయినా వాడి మాటలు మిగతావాళ్ల మౌనంకంటే కఠోరంగా వున్నాయి. భవాని, విజయుల మౌనంలో ఈ ఇంటినుంచి దూరమైపోతు న్నామనే బాధ చిందుతుంది. గణేశ్ మాటల్లో రోజూ మిఠాయిలు తినే ఇంటికి వెళ్తానన్న సంతోషం కనిపిస్తుంది. భవాని, విజయ్‌లు తనతోను, ఈ సంసారంతోను బంధం వున్నవాళ్లు. బంధాన్ని వదులుకోలే నివాళ్లూను. గణేశుడి మనసులో వెళ్లాలనే ఆకర్షణ వుంది. ఇక్కడ ఏమీ మిగల్లేదు. తండ్రి ఆంతర్యాన్ని అనుక్షణం ధిక్కరిస్తాడు. ఈ ధిక్కారంవల్ల కలిగే బాధెక్కువా? లేక భవాని, విజయుల మౌనంవల్ల తన కన్నపే గుకి కలిగే యాతనెక్కువా? అని విశ్లేషించు కుంటాడు నరహరి. అవి ఒకే తీవ్రతగల యాతనయొక్క రెండు రూపాలుగా వేధిస్తు న్నాయి.

విజయ్ తప్ప మిగిలిన నలుగురి గమ్యం నిర్ణయమైపోయింది. సాధారణంగా రామల క్ష్మణుల వయసు పిల్లల్నే దత్తు తీసుకోవా లని కోరుకుంటారు. గణేశుడిదీ పెద్దవయ సేమీ కాదు. ఈ దేశంలో ఆడపిల్లల్ని ఎవరూ కోరుకోరు. వంశాభివృద్ధి కోసమే కదా దత్తత అంటూ చేసుకునేది. అయినా భవానికి కూడా ఏర్పాటయిపోయింది. విజ యుడిదొక్కడిదే బాకీ. అప్పుడే ఏడు సంవ త్సరాల వయసనే కారణం వల్లనా? అతని సౌమ్య, శాంత స్వభావం, ఆలోచనాజ్ఞానం సూచించే గంభీరత ఎవర్నీ ఆకర్షించలేదా?

ఈ నలుగుర్నీ ఇచ్చేసి విజయుడిని మాత్రం తన దగ్గరుంచేసుకుంటేనేం? అనే ఆలోచన తళుక్కుమంది. అవును, ఎందు కలా చెయ్యకూడదు? అనే ఆలోచన వేళ్లూని నిలబడింది. వాడొక్కడే అయితే ఓవర్‌టైం చెయ్యక్కర్లేదు. రోజూ ఆఫీసుకి బయల్దేరే టైంకి వాడూ స్కూలుకి వెళ్తాడు. సాయంత్రం త్వరగా ఆరుకల్లా తను ఇంటికి వచ్చేస్తాడు. తరువాత తనే కూర్చుని పాఠాలు చెబుతాడు. మంచి బట్టలు కుట్టి స్తాడు. పైప్ దగ్గర కుర్రాళ్ళతో ఆడకూడదని మంచి మాటలతో చెప్పి మాన్పించి, తమ బిల్డింగ్ కుర్రాళ్ళతోనే ఆడుకునేటట్లుగా చేయొచ్చు. మంచి బట్టలు వేసుకుని శుభ్రంగా వుంటే వాళ్ళూ చేర్చుకుంటారు. ముడుచుకుపోయిన నరహరి అంతరంగం ఈ ఊహతో కొద్దిగా విచ్చుకుంది. ఐదుగం టలకే ఆఫీసు వదలి ఇంటిదారి పట్టాడు. ఇంటి వెనుక మూడు ఫర్లాంగుల దూరంలో ఒక గుట్ట వుంది. ఇదివరకు అప్పుడప్పుడు అక్కడకి వెళ్ళి అది ఎక్కి కాసేపు కూర్చుని వచ్చేవాడు. ఎత్తుకి ఎక్కేకొద్దీ తనకిష్టమైన ఒంటరితనపు అనుభవాన్ని ఆస్వాదించే వాడు.

వైదేహి చనిపోయాక మళ్ళీ అటు రాలేదు. అంత తీరికా లేదు. ఇవాళ మళ్ళీ వెళ్ళి ఎక్కాలనిపించివెళ్ళాడు. ఇప్పుడెక్కు తుంటే త్వరగా అలసట వచ్చేస్తోంది. ఇంత కుముందు ఎప్పుడూ ఇలా కాలేదు. తను ముసలివాడైపోతున్నాడేమోనన్న భావన కలి గింది. విజయుడు పెద్దకొడుకు. వాడిని తనతోనే వుంచేసుకుంటే మంచిదికదా! అనే

ఆలోచన మళ్ళీ వచ్చింది. పెద్దకొడుకైతే వంశాభివృద్ధికి, పిండప్రదానానికి శ్రేష్ఠమట.

తనకి మగపిల్లాడు, అందులోనూ పెద్ద వాడే ఎందుకు కావాలి? విజయ్‌నెవరూ పెంచుకోడానికి అడగలేదు గనుక వుంచుకోవాలని అనుకుంటే అది వేరే సంగతి. కాని వ్హాడిని ఉంచేసుకుందామనే ఆలోచనతో చాలా ఆకర్షణ కలుగుతోంది. ఈ ఆకర్షణ అనేది ఒకరకంగా పక్షపాతానికి సంకేతం కాదూ? తనకున్న ఐదుగురు పిల్లల్లో నలుగుర్ని ఏ సంబంధం లేనట్టుగా పంపించేసి, వీడొక్కడితోటి బంధాన్నెందుకు కొనసాగించుకోవాలి? వీడినింకెవరూ అడగరనే పరిస్థితి ఇంకా ఏమీలేదు. త్వరలో వాడికోసం కూడా ఎవరన్నా రావొచ్చు అప్పుడేం చేయడం? ఒప్పేసుకోవడమేనా? ఒప్పుకుని ఇచ్చెయ్యడమే రైటని నిశ్చయించుకున్న మరుక్షణం మనసులో ఏదో జ్వాల రేగింది. వెంటనే 'ఒద్దులే, ఇవ్వను' అని నిశ్చయించుకున్నాడు. అందువల్ల విజయ్‌కి సంతోషంగా వుంటుంది అని ఒకక్షణం అనిపించింది. మళ్ళీ అక్క, తమ్ముళ్ళు లేని ఈ ఇంట్లో ఒక్కడే వుండటం వాడికిమాత్రం ఏం సంతోషమని అని కూడా అనిపించింది. భవాని ఎక్కడున్నా తనని, పిల్లల్ని తల్చుకుంటుంది. గణేశ్ వెళ్తాను వెళ్తానని ఎంత గంతులేసినా వెళ్ళాక అందర్నీ తల్చుకుని దుఃఖపడతాడు. రామలక్ష్మణులిద్దరూ ఇప్పుడేమీ తెలియని వాళ్లు. పెరిగి పెద్దయి అన్నీ తెలుసుకునే వయసొచ్చాక తన గురించి ఏమనుకొంటారు?

ఎవర్నీ దత్తత ఇవ్వకపోతేసరి. ఇప్పటికి మాట ఇచ్చినవాళ్ళందరికీ క్షమించండి. నేనెవరికీ పిల్లల్నివ్వను' అని రాసేద్దామా అని బలంగా అనుకున్నాడు. కాని పిల్లల్నుంచుకుని ఏం చెయ్యడం? ఎవరు పెంచుతారు? ఓవర్‌టైం, భవానికి చాకిరి, విజయ్ గణేశ్‌ల షైప్ దగ్గరి ఆటలని అదుపులో పెట్టలేకపోవడం, చిన్నపిల్లల పనులు... ఈ బదులు లేని ప్రశ్నలేకదా దత్తత ఇవ్వాలనే పరిస్థితిని సృష్టించాయి. దీనికి పరిహారం ఏముంది?

బాగా చీకటి పడిందని గమనించి ఇంట్లో ఇంకా చేసుకోవలసిన వంట-వార్పు కార్యక్రమాలు తలచుకుని లేచి గుట్టదిగటం ప్రారంభించాడు.

★ ★ ★

నరహరి ఇంటికి చేరేసరికి ఒకజంట ఎదురుచూస్తున్నారు. తమ చేతిలో వున్న బ్యాగ్స్, ఒక లెదర్ సూట్‌కేస్ అక్కడే పెట్టుకున్నారు. వాళ్ళల్లో భర్త, రూమ్‌లో కూర్చుని రామలక్ష్మణులని, గణేశ్‌ని ఆడిస్తున్నాడు. విజయ్ వూరికే కూర్చున్నాడు. ఆ స్త్రీ భవానితోబాటు వంటింట్లో వుంది. ఆమె స్టవ్ ముట్టించింది. భవానినడిగి అప్పటికే బియ్యం, పప్పు చెరొక స్టవ్‌మీద ఎక్కించింది. ముఖలక్షణాలు, వస్త్రధారణ బెంగాలీలని వెంటనే తెలిసేలా వున్నారు. సన్నటి ఒంటితీరు, పొడవుగా విరబోసుకున్న నల్లటి కురులు, పాపట నడుమ సింధూరం, తెల్లటి చీర ధరించిందామె. సుమారు ముప్పై సంవత్సరాలుంటాయి. కళ్ళజోడు పెట్టుకుంది. భర్తకి ముప్పైఏడు/ముప్పై ఎనిమిదేళ్లుంటాయి.

నరహరి తననితాను పరిచయం చేసుకున్నాడు. అతడూ తన పరిచయం చెప్పుకున్నాడు. "ధీరేంద్ర మోహనబసు జబల్‌పూర్. లెటర్ వ్రాశాను గుర్తుందా? "

ఎన్నో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపిన నరహరికి చటుక్కున గుర్తురాలేదు. చివరికి ఆయనే గుర్తుచేశారు. డి.ఎం.బసు జబల్‌పూర్‌లో రైల్వే అసిస్టెంట్ స్టేషన్‌మాస్టర్‌గా వున్నారు. వీలైనంత త్వరలో రావడానికి ప్రయత్నిస్తాననీ, కాని తను ఎగ్జిక్యూటివ్ లైన్‌లో వుండటంవల్ల శెలవు దొరకడం కొంచెం ఆలస్యం కావచ్చని వ్రాశారు. నరహ





రికి ఇప్పుడు గుర్తొచ్చింది. అతని దృష్టి నేల మీద ప్రసరించింది. అక్కడంతా చాక్లెట్ పేపర్లు, చింపిన బిస్కట్ పొట్లాల కవర్లు పడున్నాయి.

"బొంబాయిలో పరిచయస్థులెవరూ లేరు. రిటైరింగ్ రూంలో దిగొచ్చుగాని, ఇక్కడే మీ ఇంట్లోనే ఎందుకు దిగకూడదు అన్న ఆలోచన వచ్చి, తిన్నగా ఇక్కడకే వచ్చిపడ్డాం. చూడండి, మా ఆవిడ వంటిల్లు ఎలా ఆక్రమించేసిందో" అన్నారు బసుజీ.

ఆవిడ పేరు శచి. బయటకొచ్చి నమస్కరించింది. ఆమె సరళత, సౌజన్యత చూసి నరహరి తృప్తిపడ్డాడు.

"బిజోయ్ పేరు చాలా బాగుంది. మిగతా అందర్ని ఎవరెవరికి దత్తతిస్తారో భొభాని చెప్పింది. మాకూ బిజోయ్‌నే కావాలి. వాడి ముఖంలో గాంభీర్యం. ఆలోచనా ధోరణి... కళ్ళకి కళ్ళజోడొకటి పెట్టేస్తే అచ్చు బెంగాలీ బాబులా వుంటాడు. చేపలు తినడం ఒక్కటి నేర్చుకోవాలంతే" అనేసి గట్టిగా నవ్వేసాడు. "మేం బెంగాలి వాళ్లమయినా చేపలు తినం, పెద్ద కారణాలేం లేవు. జస్ట్ 'తినం' అంతే" అన్నాడు మళ్ళీ.

అంతలో వంటయింది. శచి చారు అన్నం మెత్తగా కలుపుకొచ్చి హాల్లో ఒక మూల కూర్చుని రామలక్ష్మణులిద్దరినీ చెరో తొడమీద కూర్చోబెట్టుకుని తినిపించసాగింది. ఈ పిల్లలకిలా గోరుముద్దలు తినిపించుకోవడం అనే అలవాటేపోయింది. ఆమె ఆ పిల్లలిద్దర్ని ముద్దులాడుతూ గోరుముద్దలు తినిపించడం చూస్తే ఎవరైనా ఆమె కడుపున పుట్టిన పిల్లలనుకోవాల్సిందే. అన్నం పెట్టి బాత్‌రూంకి తీసికెళ్ళి మూతులు కడిగింది. భవాని పరచిన పరుపుమీద పిల్లలిద్దర్నీ తడుతూ పడుకోపెట్టింది. సన్నటి గొంతుతో మంచి బెంగాలీ జోలపాట పాడింది. పిల్లలిద్దరూ నిద్రపోయారు. తరువాత లేచి పెద్దపిల్లలు ముగ్గురికీ వడ్డించింది. తనే అన్నం కలిపి పెడుతుంటే వాళ్ళకి మొహమాటంగా అనిపించింది. కంచంలోంచి ఒక ముద్ద తీసి గణేశ్ నోట్లో పెట్టబోతే వాడు సిగ్గుతో మొహం తిప్పుకున్నాడు. "తిను బేటా, ఎందుకు సిగ్గు పడతావు? నేనూ మీ అమ్మనే" అంటూ ఎడమచేత్తో వాడి ముఖాన్నిటు తిప్పి నోట్లో పెట్టింది. భోజనాలు కాగానే గబగబ కంచాలు కడిగి, తిన్నచోటు శుభ్రం చేసేసింది. నరహరి మూగవాడిలా అంతా చూస్తూ కూర్చున్నాడు. వాళ్ళు విజయ్‌ని పెంచుకోడానికి ఒప్పుకున్నారు సరే, వాడొక్కడే మిగిలాడని భవాని చెప్పింది సరే, కాని పిల్లలందరినీ సమానంగా చూస్తోంది, ముద్దుచేస్తోంది. బసుబాబు అంతే రామలక్ష్మణులతో, గణేశ్‌తో ఒకేరకంగా ఇష్టంగా ఆడుకుంటున్నారు.

ఆవిడ నరహరికి, తన భర్తకి కంచాలు పెట్టి వడ్డించింది. తనే యజమానురాలిగా సాదరంగా, సత్కారభావంతో ఇద్దరికీ ఉపచరిస్తూ వడ్డించింది. ఇంటి యజమానిగా తనేమన్నా రెండు ఉపచార వాక్యాలు చెప్దామన్నా నరహరికి అవకాశమూ రాలేదు. తోచనూ లేదు. భోజనాలయ్యాక అతను పరుపులు వేసాడు. అంతలోపల ఆవిడ లోపల కూర్చుని తన భోజనం పూర్తిచేసింది. బయటకొచ్చి, "ఇటు పిల్లలకి వరసగా వేసేయండి, వాళ్ళ మధ్యలో నేను పడుకుంటాను" అంది.

పిల్లలకి, ఆవిడకి లోపల ఏర్పాటుచేసి, తనకి, బసుబాబుకి బాల్కనీలో జంబుఖానా పరచాడు నరహరి. రెండు దిండ్లు, కప్పుకోడానికి దుప్పటి పెట్టాడు. వీళ్ళిద్దరూ బాల్కనీలోకి వెళ్ళాక ఆవిడ రామలక్ష్మణులని ఒక పక్క పడుకోబెట్టుకుని వాళ్ళమీద చెయ్యివేసి పడుకుంది. పడుకుని భవానీతో కబుర్లు చెప్పసాగింది. నరహరి ముందరి తలుపు

తమవైపుకి దగ్గరకి లాగి గడియపెట్టాడు.

బసుబాబుకీ తంబాకు తినే అలవాటుంది. సరే ఇద్దరూ కాస్త నోట్లో వేసుకున్నారు. ఆయన నరహరి సంసారం, జీవితం మొదలయిన విషయాలు అడిగారు. ఇద్దరిదీ ఒకేరకమైన ఆలోచనాసరళి అని అర్థమైంది. వేదాంత పరమైన మాటలూ కొన్ని దొర్లాయి. నరహరి ఆలోచిస్తూ పడుకున్నాడు. అతడు ఒక తీర్మానానికి వచ్చాడు. విజయ్‌ని బసు దంపతులకి ఇచ్చేయడం, భవాని పణందీకర్‌కి అభిమాన పుత్రిక. గణేశ్ ఆగ్రాకి వెళ్తాడు. రామలక్ష్మ ఇలాగూ నిర్ణయమయిపోయారు. పిల్లలందరికీ ప్రేమ లభిస్తుంది. సుఖంగా వుంటారు. రోగం రొష్టూ వస్తే సేవ, ఆదరణ లభిస్తాయి. అందరికీ చదువు సంధ్యలబ్బుతాయి. భవాని తమ్ముళ్ళని కోల్పోయినందుకు బాధపడుతుంది నిజమే. కాని, ఆడపిల్ల అన్నాక ఏనాటికైనా, సోదరులని విడచి వెళ్ళవలసిందేకదా! ఇకమీదట ఒక అన్నయ్యకు ప్రియమైన చెల్లిగా బతుకుతుంది. పణందీకర్ ప్రియ పుత్రికగా విఠల్ ముద్దుల చెల్లెలిగా సుఖపడుతుంది. పిల్లల్ని తనతో ఉంచుకోవాలనుకోడం సుఖ ప్రయోజనాలు లేని మోహం. వాళ్లకి ప్రీతి, సౌకర్యం, మంచి చదువు, అవకాశం అన్నీ తప్పిపోతాయి. తనూ ఇహలోక బంధనాలలో కొట్టుమిట్టాడాలి. ఇదే రైటు. ఇదే చివరి నిర్ణయం కూడా.

జీవితంలో బంధాలలో, మోహంలో పడకూడదనుకున్న నరహరి బంధాలలో బందీ అవనూ అయ్యాడు, మళ్ళీ అవన్నీ వదిలించుకుని ఒంటరీ అయ్యాడు. పిల్లల సమస్య పరిహారమవుతుందని దత్తత కార్యక్రమం పెట్టుకున్నాడు. వాళ్లంతా వెళ్ళిపోయాక తన పరిస్థితేమిటి, తన భవిష్యత్తేమిటి అన్నది స్పష్టంగా ఆలోచించలేదు. పురోహితుడిని పిలిచి ఒకేరోజున పిల్లలందర్నీ ఒకేసారి శాస్త్రోక్తంగా దానం ఇచ్చేసాడు. ఎవరెవరి కొత్త తల్లిదండ్రులు వారి వారి పిల్లల్ని తీసుకుని బయల్దేరారు. అంతవరకు పోతానుపోతానని గంతులేసిన గణేశ్ తీరా వెళ్ళే సమయంలో నేను "వెళ్ళను..." అని ఏడుస్తూ కన్నతండ్రి తొడని గట్టిగా పట్టేసుకుని బిగువుగా నుంచుండిపోయాడు. "నేను వచ్చి చూసిపోతుంటాను నాన్నా, ఏడవద్దు" అని ఓదార్పు పలికిన మీదట భవాని, విజయులు ఏడ్చి రాద్ధాంతం చేయకుండా బయల్దేరారుగాని, తప్పనిసరిగా శిక్షభరించవలసొస్తే తల వంచినట్టు తలవంచుకుని, దుఃఖభారంతో, కన్నీరు నిండిన కళ్ళతో నడచివెళ్ళారు. ఏమీ తెలియని పిల్లలుగనుక ఏ ఏడుపు లేకుండా వెళ్ళినవాళ్లు పసిపిల్లలిద్దరూ మాత్రం.

దత్తత తతంగం జరుగుతుండగా ఎవరో అతని చెవిన పడేటట్లే అన్నారు. "తన పిల్లలేకదా అని ఇతను అప్పుడప్పుడు వెళ్ళి చూడటం అంత సరి అయిన పనేమీకాదు. ఒకసారి ఇచ్చేసాక ఇంక అయిపోయింది. ఆ పిల్లలు కొత్త తల్లిదండ్రులతో పూర్తిగా అలవాటుపడద్దా? "

అప్పుడతను ఈ మాటల్ని పెద్ద పట్టించుకోలేదు. కాని ఇప్పుడు పిల్లలంతా వెళ్ళిపోయి తనొక్కడే మిగిలిపోయాక దాని భావం అంతరంగాన్ని తట్టి పలుకుతోంది. ఇక ఎప్పటికీ తనకీ వాళ్ళకీ సంబంధం లేదు.

ఇంట్లో సమారంభం అయ్యాక మరుసటి రోజు కూడా ఆఫీసుకి వెళ్ళలేదు. రెండవ రోజుకూడా బయటకి వెళ్ళలేదు. తలుపు వేసుకుని ఊరికే పడుకుని వుండిపోయాడు. పొద్దున లేచేటప్పటికి ఇంక ఇంట్లో వుండటం కష్టమనిపించింది. తొందరగా ముఖం కడుక్కుని క్షౌరం, స్నానం పూర్తిచేసాడు. వంట చేయబుద్ధికాలేదు. పిల్లలు





# ఏరిన ముత్యాలు

★ అతి కష్టమైన పనిని శ్రద్ధగా నిర్వహిస్తూ బాగా ముగించేవారికి ఆత్మగౌరవం ఎప్పటికీ నశించదు.

-జార్జ్ బెర్నాడ్‌షా

★ వివేకంతో కూడిన ప్రసంగం, బ్రహ్మాండమైన వాగ్ధాటికంటే విలువైనది.

-ఫ్రాన్సిస్ బేకన్

★ నీ సంతృప్తికి నీవు తిను, ఇతరుల సంతృప్తికి బట్టలు ధరించు.

-బెంజమిన్ ఫ్రాంక్లిన్

★ ఒకసారి భంగపడితే శీలం ఎన్నడూ కుదుటపడదు.

-థామస్ మిడిలేటన్

★ కష్టాలను జయించడానికి చిరునవ్వులకుండే శక్తి నిట్టూర్పులకు ఉండదు.

-అమ్మ

★ రచయితలు సదా తమ రచనా నైపుణ్యాన్ని, విధానాన్ని, పద్ధతిని అభివృద్ధి పరుచుకుంటూ ఉండాలి.

-గోర్కి

★ నేను స్వంతం చేసుకొన్న సౌభాగ్య సంపద నా తృప్తి.

-గాంధీజి

★ మహనీయులకు ఆదర్శాలు ఉంటాయి. ఇతరులకు కోరికలు ఉంటాయి.

-వాషింగ్టన్

★ మనకు గల సత్తానుబట్టి మనలను మనం అంచనావేసుకుంటాం. మనం చేసిన పనులనుబట్టి ఇతరులు మనలను అంచనావేస్తారు.

-లాంగ్‌ఫెలో

★ తన కర్తవ్యాన్ని సక్రమంగా నిర్వర్తించే వ్యక్తికి వాటంతట అవే హక్కులు సంక్రమిస్తాయి.

-మహాత్మాగాంధి

★ తలుపు అంత గట్టిగా వేయకు, తిరిగి అటు వెళ్లాలనుకొంటావేమో!

-డాన్ హెరాల్డ్

★ ప్రజాస్వామ్యానికి సంక్రమించే సకల జాడ్యాలనూ మరింత ప్రజాస్వామ్యం సమకూర్చడంద్వారా నయం చేయవచ్చు

-ఆల్ఫ్రెడ్ స్మిత్

★ మనల్ని చూసి ఇతరులు జాలిపడాల్సిన స్థితిలో ఉండటంకన్నా ఈర్ష్య పడాల్సిన స్థితిలో ఉండడమే మేలు

-హెరొడోటస్

సేకరణ:
జక్కల భరత్




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాశక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

**కూపన్**

**జనవరి చతుర నవల నిరాకరణ**

**సమీక్షకుని పేరు :** ..........

**చిరునామా :** ..........

..........

..........

..........

వెళ్ళాక వంటింట్లోకి వెళ్ళనేలేదు. తలుపు తాళం పెట్టి కిందకి దిగాడు. బిల్డింగ్‌లో ఆడవాళ్ళు, మగవాళ్ళు అందరూ తననే చూస్తున్నారు. తన మానాన తను బస్సెక్కి ఆఫీసుకి వచ్చాడు.

ఆరోజు సాయంత్రం ఆఫీసయ్యాక శెనాయ్ దగ్గరకి వెళ్ళి ఒక గంట గడిపి, తరువాత అక్కడే ఒక ఉడుపి హోటల్లో భోజనం చేసి, రాత్రి పదిగంటలకి ఇంటికి వెళ్ళి పడుకున్నాడు. నిద్రపోడానికి పెద్ద కష్టమేమీ కాలేదు. కాని రోజూ శెనాయ్‌ని కలవడమూ కుదిరేది కాదు. కలవాల్సిన అవసరమూ వుండేది కాదు. పత్రికోద్యోగి అయిన అతనికి సాయంత్రాలు మామూలుగా తీరిక తక్కువ. మర్నాడు సాయంత్రం ఐదుగంటలకే బస్సెక్కాడు. ఆరుంపావుకి ఇల్లు చేరేసరికి ఇంకా సూర్యాస్తమయం కాలేదు. ఇంట్లో కూర్చుని ఏం చెయ్యాలి? వంట చేసే మనసు లేదు. రాత్రి 'ఉపవాసం ఉంటే సరి' అని నిర్ణయించుకున్నాడు. సంసారం పెరగకముందు కొంటూ వుండిన పాత వేదాంత సంబంధమయిన పుస్తకాలన్నీ మళ్ళీ చదువుదామని అటకమీద పెట్టిన రెండు పాతపుస్తకాల పెట్టెలు కిందకి దింపాడు. దుమ్ముదులిపి. ఒక్కొక్క పుస్తకం అట్టసీ చూస్తుంటే, వాటిని చదివినపుడు ఆ తరువాత ఉండిన తన మనఃస్థితి గుర్తురాసాగింది.



వేదాంత గ్రంథాలు బంధాల మోహంలో పడకూడదనే నీతిని నేర్పాయి. చిన్నవయసులో కలిగిన అనుభవాలవల్ల అతని మనసు ఈ ధోరణివేపు మళ్ళింది.

చిన్న వయసులోనే తల్లిదండ్రులు గతించారు. ఉమ్మడి కుటుంబంలో ఇద్దరు బాబాయిలు, ఒక పెద్దనాన్న, వాళ్ళ పిల్లలు, వీళ్ళ మధ్య చేదు అనుభవాలతోనే పెరిగాడు. ఉమ్మడి ఆస్తిలో తండ్రి, తద్వారా తనదీ అయిన భాగం వుంది. కాని ఈ న్యాయాన్ని గుర్తించి పెద్దలు, జ్ఞాతులు ఎక్కడ నడచుకుంటారు? ఇంట్లో జీతగాడిలా పాలేరులా బతికాడు. అలా పెరిగినా బుద్ధిగా చదువుకుని హైస్కూలు చదువు పూర్తిచేసే ప్రయత్నంలో వున్నాడు. అంతలో పెద్దనాన్న, చిన్నాన్నలు భాగాలు పంచుకుని విడిపోయారు. అది ఏ లెక్కలు వేసుకుని భాగాలు పంచుకున్నారో తెలియనేలేదు. మొత్తంమీద తనకి భాగం దొరకనేలేదు. "మీ నాన్న తాగుబోతు, జూదగాడు. బోలెడన్ని అప్పులు చేసాడు. అవన్నీ పోగా నీ భాగానికొక ఎకరం పొలం వస్తుంది" అన్నారు. వాళ్ళనెదిరించడానికిగాని, చట్టప్రకారం తేల్చుకోడానికిగాని తెలివి, వయసు, ధైర్యం ఏమీ లేకపోయాయి. వాళ్ళు చెప్పినదానికల్లా తలవూపాడు. పంపకాలకి కాగితాలు తయారయ్యాయి. తన తండ్రి తనకి తెలిసినంత వరకు తాగుబోతూ కాడు. జూదగాడూ కాదు.

ఎకరం పొలంతో జీవితం ఎలాగడుస్తుంది? హైస్కూలు పరీక్షకి కట్టడానికి ఎవరూ ఫీజుడబ్బు ఇవ్వలేదు. పొలం అమ్మి డబ్బు సమకూర్చుకోవలసొచ్చింది.

ఆస్తిని బయటివాళ్లకివ్వడాన్కి పెద్దనాన్న ఒప్పుకోలేదు. నోటికొచ్చిన రేటు చెప్పి తామే కొన్నట్టు సంతకాలు పెట్టించుకున్నారు. ఫీజు డబ్బిచ్చారు. మిగతాది తరువా తిస్తాంలే అన్నారు. ఆ 'తరువాత' అన్నది రానేలేదు.

"నేను పెంచి పెద్దచేసిన కుర్రాడివి, నా దగ్గరే వసూళ్ళగురించి మాట్లాడేటంత వాడివా. నువ్వు? నలుగుర్నీ పిల్చి నీ నడ వడిక గురించి చూపిస్తాను" అన్నాడు. దెబ్బలాడే మనసు, తీరిక, ఓపిక ఏవీలేవు. దెబ్బలాడినా ప్రయోజనమూ లేదు. మెట్రిక్ పాసయ్యాడు. బతకడానికి దారి దొరక లేదు. ఎక్కడా ఉద్యోగం దొరికే అవకాశం లేదు. ఇంకా పదిహేడేళ్ళ వయసు. ఎవరో చెప్పారని కాస్త కూస్త ఉన్నదేదో అమ్మేసి బొంబాయొచ్చాడు. రాగానే "తీసుకోవయ్యా" అని ఉద్యోగం ఎవరిస్తారు? కొట్లన్నీ తిరి గాడు అడుక్కున్నాడు. చివరకి ఒక ఇరానీ హోటల్లో సప్లైయర్‌గా చేరాడు. జీతం తక్కువేగాని భోజనం, టిఫిను గడచిపో యేది. శుద్ధ శాకాహారేగాని మాంసాహా రాన్ని ముట్టక తప్పలేదు. కస్టమర్లకి సప్లై చెయ్యాలిగా మరి! ఒక సంవత్సరం పనిచే సాక అదే హోటల్లో, తమ వూళ్ళోని శకుని గౌడగారి కొడుకు రంగడు దొరికాడు. చదు వేమీ లేని రంగడు బొంబాయిలో ఏమి ఉద్యోగం చేస్తున్నాడో ఎవరికీ తెలియదు. ఊరికొచ్చేటప్పుడు కాకీనిక్కరు, తెల్ల షర్ట్, మెరిసే బూట్లు, సాక్సులు ధరించి తలకొక హ్యాట్, చేతిలో లెదర్ బ్యాగ్ పట్టుకునొచ్చి ఊళ్ళో హోటల్లో టిఫిన్ తిని బిల్లెంత అనే లెక్కలేకుండా నోటు ఉండలా చేసి విసిరేసి వెళ్ళిపోయేవాడు. ఇప్పుడు నరహరే రంగ య్యని గుర్తుపట్టి పలుకరించాడు.

రంగడు చేసే ఉద్యోగం ఏమిటయ్యా అంటే టాంగా తోలడం. నరహరికి కూడా అదేపని ఇప్పిస్తానన్నాడు. హోటల్ ఉద్యోగం కంటే ఇదే నయం అనిపించింది. సంపాదనకూడా హోటల్ సప్లైయర్ జీతం కంటే ఎక్కువే. సరే, అందులోనే చేరాడు. వాళ్ళంతా కలిసి ఒకే గదిలో ఏడుగురు వుండేవారు. సరే, ఇతనూ చేరాడు. కలిసి వంట చేసుకోడం వల్ల చాలా తక్కువ ఖర్చు తోనే భోజనం గడిచిపోయేది. పైగా సరు కులు కూడా పెద్ద ఖరీదుండేవి కావు ఆరో జుల్లో. గది అద్దె, పప్పులు తప్ప మిగతా వన్నీ చవకే. టాంగా తోలడంవల్ల డబ్బులు బాగానే మిగిలేవి. అందులోనూ ఇతను ఇంగ్లీష్‌లో అరవటం, పిలవడం చూసి పర దేశస్థులు, హిందీ రానివాళ్ళంతా ఇతని టాంగానే ఎక్కేవారు. కాని కొన్నాళ్ళకే అత నికాపని విసుగొచ్చింది. ఇతని టాంగాలో కూర్చున్న ఆసామి ఒకరు "ఇంగ్లీష్ వచ్చిన ట్టుంది, ఏం చదివావు? "

"ఎస్. ఎస్. ఎల్. సి. ఫస్ట్‌క్లాస్"

"మరో నౌకరీ ఎందుకు చెయ్యకూడదు? '
'

"ఏం నౌకరి దొరుకుతుంది? "

ఆయన కాస్త ఆలోచించి అన్నారు. "నిజమే, వూరికే 'నౌకరి' అంటే కష్టమే. టైపింగ్ అయినా నేర్చుకో. త్వరగా పని దొరుకుతుంది"

ఇంతే ఆయన ఇచ్చిన సలహా. వారం రోజుల్లో టైపింగ్ ఇన్‌స్టిట్యూట్‌లో చేరాడు. రోజూ సాయంత్రం గంటసేపు ప్రాక్టీస్ చేసే వాడు. ఆరు నెలలకల్లా బాగా నేర్చుకున్నా డంతా. సరిగ్గా అప్పటికి ఒక పుస్తకాల షాపులో ఒక టైపిస్ట్ కావాలన్నారట. చేర తావా? అని ఇన్‌స్టిట్యూట్ ప్రిన్స్‌పాల్ అడి గాడు. సరే చేరాడు. ఉద్యోగం అంటే ఆఫీస్ టైమ్‌లో పని. మిగిలిన టైములో తీరిక. ఆదివారం సెలవు. పగలనీ, రాత్రనీ లేకుండా, ఎండనీ, వాననీ చూడకుండా బేరా లకోసం కాచుకోనక్కర్లేదు. చదివే అలవాటు పుస్తకాల షాపులోనే ప్రారంభంఅయింది. కొత్తలో ఇంగ్లీష్ పుస్తకాలర్థమయ్యేవి కావు. తరువాత తరువాత మెల్లగా అలవాటయిపో యింది. రంగడి గదిలో కూర్చుని చదువు కోడానికి చోటు, శాంత వాతావరణం రెండూ లేకపోయాయి. అదే సమయంలో చెంబూర్‌లోని ఈ ఇల్లు కట్టించాడెవరో

షావుకారు. అప్పటికి బోంబే ఇంతలా పెరిగిపోలేదు. ఇళ్ళకింత కష్టమూలేదు. ఆ స్థితిలో ఒక రూమ్ (అదేహాలు) వంటిల్లు, బాత్‌రూం, బాల్కని వున్న ఇల్లు చవగ్గానే దొరికింది. ఆ ఇంటికోసం పోటీలేమీ లేవు. ఒకరోజు అక్కడకి వచ్చి చూశాడు. వెనుక వైపు కొండ. మిగతా మూడు దిక్కులా ఇంచుమించు అడవిలా వుంది. సంసారస్థులు వుండటానికి భయపడే వాతావరణం. వేదాంతం పిచ్చిలో పడ్డ ఇతనికి అది చాలా అనుకూల వాతావరణంలా తోచింది. అద్దె కొద్దిగా ఎక్కువేననిపించినా ఒప్పుకుని వచ్చేసాడు.

సుమారు ఇరవై సంవత్సరాలు ఇదే ఇంట్లో గడిపాడు. మిళింద్ పన్హా, జాతక కథలు, ఉపనిషత్తులు, వివేకానందుడు, రామకృష్ణ పరమహంస మొదలైన పుస్తకాలెన్నో చదివాడు. మళ్ళీ మళ్ళీ తిరగేసాడు. ఈ ఇంటికి వచ్చిన కొత్తల్లో జీవితం గురించి, జీవితార్థం గురించి చాలా ఆలోచించేవాడు. బంధువులంతా తనకీ గతి ఎందుకు పట్టించారా అని తాత్వికంగా ఆలోచించేవాడు. 'ఆశే'కదా దీనికంతటకీ మూలం! వాళ్ళకీ పిల్లలున్నారు. సోదరుడి పుత్రుడైన తనని వాళ్ళ బిడ్డల్లో ఒకడిగా చూసుకోగలిగే దృక్పథం లేకపోయింది. 'నేను' నాది అనే బంధం అతిగా వున్నందు వల్లనే వాళ్ళ దృక్పథం ఇంత సంకుచితం అయిపోయింది. దేన్నీ పట్టుకుని వేళ్ళాడకూడదనే దృఢనిశ్చయం అంతరంగాన్నాక్రమించడంవల్ల ఊరి తాలూకు పాత జ్ఞాపకాలేవీ తిరగదోడకూడదని నిశ్చయించుకున్నాడు. తను ఇప్పుడు బొంబాయిలో వుంటున్నాడని వాళ్ళకి తెలుసు. రంగడు ఊరికెళ్లినప్పుడు చెప్పాడట. తప్పకుండా వచ్చి వెళ్ళమని ప్రేమ కబుర్లు చెప్పి కబురు పంపాడు పెద్ద నాన్న. నిరసనగా నవ్వి వూరుకున్నాడు. మళ్ళీ ఎటువంటి బంధాలనీ పెంచుకోకూడదన్న సంకల్పం మరింత గట్టిదయింది.

కొద్దిరోజుల్లో తన భవిష్యజ్జీవితం ఏదిక్కుగా సాగాలన్నది అతనికి స్పష్టంగా అర్థమైంది. బంధాల మోహంలో పడకుండా వుండటమే సుఖానికి ప్రథమ సోపానం. భార్యాపిల్లలు మొదలైన ఏ బంధాలు ఒద్దు. తన ఇల్లు, ఈ జీతం చాలు. మిగతా వేళల్లో ఏమన్నా వేదాంత పుస్తక పఠనం, ఉపన్యాసాలు, ప్రవచనాలు వినడం, ఇంకా ఏకాంతవాసపు ఆనందాన్ని ఆస్వాదించడం దానికే పరిమితమై గడిపేవాడు. మొదట్లో మనుషులతో పెద్ద కలిసేవాడు కాడు. ఆఫీసులో తన పనేదో తను చూసుకునేవాడు తప్ప, ఇతర సహోద్యోగులతో అవసరానికి మించి మాట్లాడేవాడు కాడు. ఇతని స్వభావం అందరికీ తెలుసు. ఎవరూ దాన్ని తప్పుగా భావించేవారు కారు.

నాలుగైదేళ్ళల్లో మార్గం దృఢమైంది. ఎన్నో రోజులు 'అణిక్' కొండమీద ఎక్కి అర్ధరాత్రివరకు అక్కడే గడిపేవాడు. అప్పుడు కొండమీద 'జంగల్'లో నక్కలు, చిరుతలు తిరిగేవట. ఏ బంధమూ కోరుకోనివాడికి మరణభయం మాత్రం ఎందుకు? అని తనని తనే ప్రశ్నించుకునేవాడు. ఈ రకమైన జీవితం అలవాటయిపోయింది. బొంబాయిలో కూడా ఇదే సహజం అన్నంతగా ఏకాంతవాసం అలవాటయిపోయింది.



స్వభావాల్లో చాలా అంతరం వున్నప్పటికీ ఇతనికీ, రామకృష్ణకీ మధ్య స్నేహాభిమానాలు పెరగడానికి ఒక కారణం వుంది. ఒక్కోసారి రామకృష్ణ కూడా వేదాంతోపన్యాసాలకి వెళ్లేవాడు. దాన్ని గురించిన పుస్తకాలుకూడా అప్పుడప్పుడు చదివేవాడు. చురుకైన బుద్ధి కలవాడవడంవల్ల సత్యం, మిథ్య,



మాయ, జగత్తు, పరబ్రహ్మ మొదలైన విషయాలన్నీ ఏవిధంగా కల్పించబడ్డాయో త్వరగా అర్థం చేసుకునేవాడు. కానీ అతను ప్రాపంచికమైన మనిషి. అన్నింటిలోనూ ఆసక్తి కలవాడు.

ఇద్దరికీ పరిచయమైనది ఒక వేదాంతసభలో. స్వామి విశ్వాసానందజీ దాదర్ బీచ్ దగ్గరున్న మైదానం (ఇప్పటి శివాజీ పార్క్)లో పెద్ద పందిట్లో ఏడు రోజులు సాయం సమయాల్లో ఉపనిషత్తుల గురించి ఉపన్యాసాలిచ్చారు. రామకృష్ణ కూడా అక్కడికొచ్చాడు. అనుకోకుండా ఇతని పక్కనే కూర్చున్నాడు. చేతిలో పుస్తకాన్ని పట్టుకున్న అతన్ని గమనించి నరహరే పలుకరించాడు. పరిచయం పెరిగింది. పుస్తకాల షాపులో ఉద్యోగం మాన్పించి ఇంకాస్త ఎక్కువ జీతం వచ్చే బారిష్టరు ఆఫీసులో తనని పనిలో చేర్చిందీ అతనే. అతని నిష్కపట స్వభావమే తనని అతనికి దగ్గరచేసింది.

తనకంటే ఒకటి రెండేళ్ళు పెద్దవాడయిన రామకృష్ణ విన్‌సెంట్ కంపెనీలో లెక్కలు రాసేవాడు. అతనూ ఎస్.ఎస్.ఎల్.సీనే కాని మంచి జీతం వచ్చేది. ఇంగ్లీష్ కంపెనీ కావడంవల్ల మంచి ఇంగ్లీష్ మాట్లాడేవాడు. స్వంత ఊరు తెనాలి దగ్గర ఒకపల్లె. ఊళ్లో వితంతువైన తల్లి, ఇద్దరు చెల్లెళ్లు వున్నారు. స్వంతిల్లు, రెండెకరాల పొలం వుంది. ఇంటి బాధ్యతంతా ఇతనిదే.

ఒకరోజు సాయంత్రం నరహరి రూమ్‌కి వచ్చాడు. తాగి వచ్చాడని వాసన చెప్తూనే వుంది. కొద్దిగా హుషారుగానే వున్నా బుద్ధి స్థిమితంగానేవుంది. అరుదుగా ఎవరన్నా కంపెనీ వుంటే డ్రింక్స్ తీసుకుంటానని ఇదివరకోసారి చెప్పాడు. అందులో రహస్యమేమీ లేదు. కాని మరీ కళ్లెదుట అలా కనపడేసరికి నరహరి సహించలేకపోయాడు. కోపం వచ్చింది. సీరియస్‌గా బుద్ధి, నీతివాక్యాలు చెప్పాడు. రెండు మూడు తిట్లుకూడా వచ్చాయి. అయినా రామకృష్ణ కోపం తెచ్చుకోలేదు.

"తాగితే తప్పేమీలేదు. కాని అదే వ్యసనం కారాదు. నేను రోజూ తాగటం చూశారా?"

"చెడ్డపని ఒకసారైనా మాత్రం ఎందుకు చెయ్యాలి"

"ఏది మంచి? ఏది చెడు? అన్నీ రెలెటివ్. వ్యసనానికి బానిసలవుతామేమో అన్న భయం వున్న మీలాంటివాళ్లే ఇలా అన్నింటికి దూరంగా వుంటారు. ఇప్పుడు నా సంగతే చూడండి సిగరెట్, తంబాకు, చుట్ట, తాగుడు అన్నీ వున్నాయి. కాని ఏదీ నా బలహీనతగాని, వ్యసనంగాని కాదు. మీరు ఏ దురలవాటు లేనివారు. తంబాకు నెందుకు అలవాటు చేసుకున్నారు?"

"అది మీరే అంటించిన జబ్బు"

"కావచ్చు పోనీ వదిలిపెట్టెయ్యండి చూద్దాం"

తంబాకు మానెయ్యాలని నరహరి నిశ్చయించాడు. కాని చాలా కష్టమయింది.

ఊరొదిలి వచ్చి పన్నెండు సంవత్సరాలు గడిచినా నరహరి తన ఊరివైపే వెళ్లలేదు. దక్షిణదేశానికీ వెళ్లలేదు. అక్కడేముందని వెళ్లాలి? ఏ సంబంధాలు, బాంధవ్యాలు వద్దని నిశ్చయించుకున్నాక అతనికి అటువేపు వెళ్లాలనే కోరిక ఎంతమాత్రమూ కలగలేదు. ఒకసారిమాత్రం రెండు నెలలు శెలవు తీసుకుని ఉత్తర హిందూ దేశమంతా తిరిగివచ్చాడు. అంతే. ఈమధ్య...

ఒకరోజు రామకృష్ణ వచ్చి అడిగాడు. నేను మా ఊరెళ్లాల్సిన పనిపడింది. మీకూ ఎలాగూ బోలెడంత శలవుంది. శలవు తీసుకోలేదుకదా అని ఆవార మీకేమీ జీతం ఇవ్వరు. శలవుపెట్టి సరదాగా నాతోరండి. నాకూ కంపెనీ వుంటుంది"




దక్షిణదేశం వెళ్లడానికి మనసంగీకరించ లేదు. రానన్నాడు. కాని రామకృష్ణ బలవం తపెట్టాడు. నరహరి వూరికీ రామకృష్ణ ఊరికీ ఏ సంబంధమూలేదు. తన గ్రామం వెళ్లాలంటే నరహరికి భయమనికాదు, వాళ్ల సంబంధంనుంచి దూరంగా వుండాలని ఉద్దేశం అంతే. "మీ వూరు ఫలాన అని నేనెవరితోనూ చెప్పను. బెంగుళూరు అనే చెప్తాను పదండి" అని బయల్దేరదీశాడు.

వీళ్ల తెల్లవారి లేచేసరికి రైలు హుబ్లిదాటి ముప్పై మైళ్లు ముందుకి వెళ్లిపోయింది. నరహరి మనసు ఒక విధమైన విభ్రాంతికి లోనైంది. ఛ! నేనిటు రాకుండా వుండా ల్సింది అని కూడా అనిపించింది.

తిపటూరులో దిగి ఉత్తరదిశగా నాలుగు మైళ్లు నడవాలి. మధ్యలో ఒక ఈత తోపు. దానవతల కొబ్బరి తోటలు. పంటకొచ్చిన రాగిచేలు. మధ్యలో చెరువు. వెనకాల మైదానం. బన్నికొప్పలు సుమారు ఏభై ఇళ్లుండే వూరు. కొబ్బరితోటల కాలవాలం గనుక పేద సంసారాలన్నవి కనపడవు. ఆ మాటకొస్తే రామకృష్ణదే పేద సంసారం. అతనూ వూరినుంచి డబ్బు పంపిస్తాడు గనుక తిండికి, బట్టకి బాధ లేదా ఇంటికి. తండ్రి కట్టించిన ఇల్లుంది. రెండెకరాల పొలముంది. ఇంటికి సరిపడినంత రాగులు అనపకాయలు వస్తాయి. అతని తల్లి, చెల్లెళ్లు మోదుగాకులతో విస్తళ్లు కుడతారు. వాటిమీద కూడా ఆదాయం బాగానే వస్తుంది. చెల్లెళ్లు లలితకి ఇరవై యేళ్లు, వైదే హికి పదహారేళ్లు. తల్లి బనశంకరమ్మ ఇలా సంపాదించిన డబ్బుని, రామకృష్ణ నెలనెలా పంపే సొమ్ముని పొదుపుగా వాడుతూ, ఆడ పిల్లల పెళ్లిళ్లకోసం కూడబెడుతోంది.

ఆ ఊరు, ఇల్లు నరహరికి చాలా నచ్చాయి. దట్టమైన కొబ్బరితోటల మధ్య వూరు. ఒక పక్క చెరువు. దాని దిగువగా పచ్చికబయలు. రామకృష్ణ వాళ్ల ఒద్దికైన పెంకుటింట్లో నిరాడంబరత కొట్టొచ్చినట్టు కనిపిస్తుంది. అది పేదరికంవల్ల వచ్చిన నిరాడంబరతా! లేక మనుషుల సరళ స్వభా వరీత్యా కనిపించే నిరాడంబరతా? అని పనిగట్టుకుని అతను ఆలోచించలేదు. అతి థులని నిండైన ఆదరంతో చూసుకోడమనేది ఎంతో సహజంగా జరిగిపోతుంది వారింట్లో.

అతడు హాయిగా చెరువులో స్నానం చేసే వాడు. తన బట్టలు తను ఉతుక్కుని ఆరే సుకోవాలంటే ఎవరూ ఒప్పుకునేవారు కారు. రామకృష్ణ బట్టలతోబాటు ఇతని బట్టల సంగతి కూడా అక్కచెల్లెళ్లే చూసుకునేవారు.

ఇద్దరూ ఇక్కడొక నెల రోజులు గడపా లని ముందే నిర్ణయమయింది. రామకృష్ణ కొన్ని పనులు చేయించాలని ముందుగానే అనుకున్నాడు. ఇంటి కప్పుమీద పెంకులు సర్దించాలి. ఇంటివెనుక చిన్న పశువుల కొట్టం ఒకటి కట్టించాలి. వచ్చిన మర్నాడే ఈ పనులు మొదలుపెట్టాడు. ఒద్దన్నా నర హరి కూడా సాయం చేశాడు. చిన్నప్పుడు అతనికీ ఇలాంటి పనులు చేసిన అలవా టుంది. ఇప్పుడు రామకృష్ణకి తోడుగా ఉత్సాహం, సంతోషంతో పాలుపంచుకు న్నాడు.

వీళ్లకి లలిత, వైదేహి కూడా తోడ య్యారు. గోడ కట్టడానికి కూలిని పిల్చారు గాని, మట్టికలిపి ముద్దలు చేసివ్వడం వీళ్ల పనే. ఆడపిల్లలిద్దరూ నీళ్లు తోడిపోస్తారు. రామకృష్ణ పారతో బాగా కలిపాడు. తరు వాత అంతా కలిసి కాళ్లతోబాగా తొక్కి ముద్దలు చేశారు, నరహరి కూడా చేశాడు గాని వాళ్లంత ఝుమాయింపుగా చెయ్యలేక పోయాడు. ఇప్పుడర్థమయింది నరహరికి రామకృష్ణ కేవలం బొంబేవాలా కాడని.

త్వరలోనే లలితకి వివాహం చేయాలి. అందుకే వీళ్లు డబ్బు కూడబెడుతున్నారు.



బాధ్యత తీసుకుని పెళ్లి కొడుకుని వెతకడం ఒక కష్టమైన పని. నీళ్లు తోడి మట్టి కలిపే టప్పుడు, చెరువులో బట్టలుతికేటప్పుడు, ఇల్లు ఊడ్చేటప్పుడు, ఆకులు తీసి శుద్ధి చేసే టప్పుడు, నరహరి ఇద్దరాడపిల్లలనీ గమనిం చేవాడు. చడీ చప్పుడూ లేకుండా, మాటల ఆర్భాటం లేకుండా నిశ్శబ్దంగా చేసుకుపోయే వారు. అలాగని తను కొత్తవాడని, సిగ్గుపడి పోయి పనులు మానేసి, మాట్లాడకుండా పారిపోవడం లాంటివేమీ చేసేవారుకాదు.

గోడపని పూర్తయ్యాక పెంకు సర్దేపని మొదలుపెట్టారు. అది ఆడపిల్లలవల్ల జరిగే పనికాదు. వర్షపునీళ్లు కారకుండా పెంకు పరవడం రామకృష్ణకి కూడా చేతకాదు. సరే ఇద్దరు పనివాళ్లని పెట్టారు. ఒకరోజు నర హరి వెళ్లి చెరువు కట్టమీద రావిచెట్టుకింద కూర్చున్నాడు. లలిత బట్టలు ఉతకడానికి అక్కడికే వచ్చింది. ఇతనక్కడ కూర్చున్న సంగతి గమనించిందో లేదోగాని, తన మానాన తను బట్టలుతుక్కుని వెళ్లిపో యింది. మరి కాసేపటికి రామకృష్ణ ఇతని బట్టలు, సబ్బు తీసుకొచ్చి ఇచ్చి, మీరింకా స్నానమే చెయ్యలేదట! లేవండి స్నానం చేయండి అని బట్టలందించాడు. ఇతను విడచిన బట్టలు ఇంటికి తీసుకుపోయాడు. నరహరి స్నానం చేసి ఉతికిన బట్టలు వేసు కుని మళ్లీ చెట్టుకింద కూర్చున్నాడు. ఇతను ఇంటికి పంపిన మురికిబట్టలు తీసుకుని మళ్లీ లలిత వచ్చింది. ఉతుకుడు బండపై పెట్టి సబ్బురుద్ది, నుసిమి ఉతకసాగింది. ఇతను అటే చూస్తూ కూర్చున్నాడు. ఆమె పంచె ఉతికేటప్పుడు కుడికాలు నీళ్లల్లో పెట్టి ఎడమకాలు పైకెత్తి రాయిమీద పెట్టి వంగి ఉతుకుతుంటే శరీరం వెనక్కీ ముందుకీ ఊగసాగింది. కుడికాలి కదలికవల్ల ఉతికిన నీటి తుంపరలు పడటంవల్ల నీటిలో కొంత వరకు కదలికవున్నా ఆమె ప్రతిబింబం నీళ్లల్లో స్పష్టంగా కనపడుతోంది. ఉన్న ట్టుండి ఆమెని అలా ఇంతకుముందు ఎక్కడో, ఎప్పుడో చూసినట్టు అతనికి మాటి మాటికి అనిపించసాగింది. ఎక్కడ చూశాను? అసలు అవకాశమేలేదు. వీళ్ల యితే ఎప్పుడూ తిపటూరునుంచి ఉత్తర దేశానికి వెళ్లిన జాడేలేదు. తను పదమూడు సంవత్సరాలనుంచి దక్షిణదేశానికి రానేలేదు. అయినా ఎక్కడో చూసినట్టు, బాగా పరి చయం వున్నట్టు, తనని ఆకర్షించే ఒక జ్ఞాపకం. ఆమెనే చూస్తూ కూర్చున్నాడు. ఆమె మాత్రం పంచె ఉతికి, మూడు బట్టలూ జాడించి, పిండి భుజం మీద వేసు కుంది. మిగిలిన సబ్బుముక్క ఒక చేతిలో పట్టుకుని గట్టుమీదకొచ్చింది. గట్టుదిగువన కొబ్బరి చెట్టుకింద రెండు కొబ్బరి మట్టలు పడున్నాయి. సరే, పంచె ఎడమ భుజం మీద వేసుకుని, మిగతా చిన్న బట్టలు, సబ్బు ఎడమ చేతిలో పట్టుకుని, రెండు కొబ్బరి మట్టలు ఎత్తి కుడిచేతిలో పట్టుకుని లాక్కుంటూ వెళ్లి ఎగువకెక్కి ఇంటికి వెళ్లింది.

ఆరోజునుంచీ అతను లలితను అప్పుడ ప్పుడు గమనించి చూసేవాడు. ఈమెనెక్కడ చూసి వుంటాను? అని తన జ్ఞాపకశక్తిని తవ్వితవ్వి తరచి తరచి చూశాడు. "మీకు మా ఊరి వేపు బంధువులెవరన్నా వున్నారా? చిన్నప్పుడు అటు ఎప్పుడైనా వెళ్లారా? " అని రామకృష్ణని అడిగాడు. అటువేపు ఎప్పుడూ వెళ్లలేదు. మాకు అటు చుట్టాలెవరూ లేరని స్పష్టం చేశాడు రామ కృష్ణ. వీళ్లేమో తమ గ్రామం దాటి ఎప్పుడూ బయటకి అడుగుపెట్టలేదు.

స్నేహితులిద్దరూ బొంబాయికి వచ్చేశారు. లలితని తను ఎక్కడ చూశానన్న కుతూ హలం మాత్రం పీడిస్తూనే వుంది.

★ ★ ★

ఒకరోజు రామకృష్ణ నరహరి గదికి




వచ్చాడు. కొంచెంసేపు అవీ ఇవీ మాట్లా డాక జేబులోంచి ఒక ఉత్తరం తీసిచ్చి చద వమన్నాడు. ఊరినుంచి తల్లి రాయించింది. క్షేమ సమాచారాలు, పంటల వివరాలు రాసి, చివర్న నీతో మన వూరికి వచ్చిన నీ స్నేహితుడున్నాడుకద, ఆయన గోత్రం ఏమిటో కనుక్కో. ఎలాగూ నీ మిత్రుడేగా, జాతకం వుంటే అడుగు. చి॥సౌ॥లలిత జాతకం నీ దగ్గరే వుంది. ఇద్దరికీ ఈడు జోడు బాగుంటుంది. చైత్రంలో ముహూ ర్తాలున్నాయి. దానికీ ఇరవైయేళ్లు వచ్చాయి. ఇంక ఆలస్యం చేయడం బాగుండదు. అని ఆశీస్సులు రాశారు. ఇది ఆవిడ చేతి రాత కాదు. ఆవిడకి చదువు, రాత రాదని నరహ రికి తెలుసు. ఇద్దరాడపిల్లల్లో ఒకరు రాసి వుండాలి.

రామకృష్ణ నరహరి వంక చూశాడిప్పుడు. నరహరి స్పష్టంగా జవాబు చెప్పాడు. "నా జీవితం ఏమిటో మీకు తెలుసు"

"సరే, బాగుంది. పెళ్ళి చేసుకోకుండా మనిషి జీవితం పరిపక్వం కాదు"

"మీ అమ్మగారికంటే నా విషయాలేమీ తెలియవు గనుక అలా వ్రాశారు. అన్నీ తెలి సిన మీరు దయచేసి వాదించకండి" అని ఆ సంభాషణ తుంచేశాడు.

రామకృష్ణ ఎక్కువ బలవంతం చేయ లేదు. రెండు మాటలు మాత్రం చెప్పాడు. పెళ్లి, బంధనాలు ఇవన్నీ ఒప్పుకుంటాను. చిన్నవయసులో ఆలన పాలన చూడటానికి తల్లి వుంటుంది. వయసొచ్చాక మనల్ని చూసుకోడానికి ఒక స్త్రీ సాహచర్యం అవ సరం. తల్లి బ్రతికివుంటే ఇలా పెళ్ళి చేసుకో నన్న కొడుకుని సరేలే అని వదిలేసి వూరు కుంటుందా? మీ అమ్మగారిని గుర్తు తెచ్చు కోండి" అని.

ఈ విషయంలో ఈ రెండు మాటలు చెప్పి, తరువాత కాసేపు లోకాభిరామా యణం మాట్లాడి తన గదికి వెళ్ళిపో యాడు. వెళ్ళేటప్పుడు తల్లి ఉత్తరం తీసి జేబులో పెట్టుకోవడం మర్చిపోయాడు. నర హరి దాన్ని మళ్ళీ చదివాడు. అందులో విశేషం ఏమీలేదు. ఒక మగపిల్లవాడికి, ఒక ఆడపిల్ల సంబంధాన్ని ప్రస్తావించడం అంతే. అదీ అతిసామాన్య పద్ధతిలో వ్రాసారంతే. రామకృష్ణ కూడా క్యాజువల్‌గానే చెప్పాడు. "మీ అమ్మగారిని గుర్తు తెచ్చుకోండి" అని. నిజంగానే నరహరికి తల్లి జ్ఞాపకాలు రాసా గాయి. ఆవిడ గతించి పంధొమ్మిది, ఇరవై సంవత్సరాలయ్యాయి. అప్పుడు తనింకా పదేళ్ళ పిల్లవాడు. ఆవిడ రూపం, ఆకారం ఇంకా తనకి స్పష్టంగానే గుర్తున్నాయి. ఆవిడ ఫొటో అంటూ ఏమీలేదు. ఒకవేళ అలాంటిదేమన్నా వుండి చూపిస్తే నరహరికి మా 'అమ్మదే' అనే గుర్తు దొరికేదో లేదో గాని, గుర్తించే అవకాశం వుండేదికాదు. కాని ఆవిడ రూపం అతని మనసులోనే స్పష్టంగా, ఫొటోకన్న స్పష్టంగా వుంది. అస లతనెప్పుడు మర్చిపోయాడు గనుక?

తల్లి బతికున్నప్పుడు బట్టలుతకడానికి చెరువు దగ్గరకి వెళ్లేది. ఆరేడు సంవత్సరా లున్న తనూ వెంట వెళ్ళేవాడు. లోతు లేని చోట రాతి దగ్గర ఒక కాలు నీళ్లల్లో, మరో కాలు బండపైన పెట్టి పెద్ద పంచెలు ఉతి కేది. పిండాక భుజంమీద వేసుకుని ఇంటి కొచ్చి ఆరేసేది. ఇలాంటి దృశ్యాన్నే ఈమధ్య... అరె, లలితనెక్కడో చూసినట్టుం దని అంత గింజుకున్నానుకదా, ఆ చూసింది లలితను కాదు. అమ్మని. అమ్మ బట్టలెలా ఉతికేదో సరిగ్గా లలిత కూడా అలాగే ఉతు కుతుంది. ఇంచుమించు ఇద్దరి పొడవు, ఆకృతి ఒక్కలాగే వుంటుంది. అంతే, ఆ బట్టలుతికేటప్పుడు గమనించిన బింబ సామ్యం తప్ప, విడిగా లలిత దగ్గరగా తిరి గినప్పుడు స్పష్టంగా కనపడే ఆమె కను, ముక్కుతీరుని అతడంత వివరంగా గమనిం చలేదు.



'లలితనెక్కడో చూశాను' అని తపించిన హృదయానికి కారణం ఇప్పుడు తెలిసిపోయింది. కారణం తెలిసింది సరే, ఆ తపనకి మూలకారణం జ్ఞాపకాన్ని తట్టి మాయమయిందో, లోతైన హృదయ సరోవరంలో ఇంకా అణిగివుందో తెలియలేదు.

ఒకరోజు సాయంత్రం రామకృష్ణ మళ్ళీ వచ్చాడు. ఇంకో ఉత్తరం ఇచ్చాడు. తల్లిదే మళ్ళీ మీ స్నేహితుడిని మళ్ళీ కనుక్కున్నావా? చైత్రమాసం దగ్గరకొస్తోంది. ఏ సంగతీ త్వరగా కనుక్కో. లేకపోతే సెలవు తీసుకుని ఇటువేపొకసారిరా. నాలుగైదు సంబంధాలున్నాయి. నువ్వే వెళ్ళి మాట్లాడి రావాలి. నీ స్నేహితుడే అయితే మాకందరికీ సంతోషం"

రామకృష్ణ, "చూడండి, మీకూ జీతం బాగానే వస్తోంది. ఉండటానికి ఇల్లు వుంది. ఈమధ్య అసలు బొంబాయిలో ఒక్కగది దొరకటం కూడా ఎంతో కష్టంగా వుంది. ఇళ్ళకి పగడీ వసూలు చేయడం మొదలుపెట్టారు. మీరు అదృష్టవంతులు. ముందే జాగ్రత్తపడి ఇల్లు సంపాదించివుంచారు. ఒప్పేసుకోండి సంసారం పెట్టాలంటే తాపత్రయం వుండదు. నా చెల్లెలు చాలా పొదుపుగా సంసారం చేస్తుంది. మీరే చూశారుకదా! అప్పుడు సరిగ్గా చూడలేదంటే మళ్ళీ చూద్దురుగాని నాతోబాటు రండి, తీసికెళ్తాను" ఈమాట చెప్పి అతను పొగాకు వేసుకుని కూర్చున్నాడు. తంబాకు నోట్లో వున్నంతసేపు ఇంకేమీ మాట్లాడ్డానికి వీల్లేదు. కాసేపు మౌనం తప్పదు. ఇక నరహరికి మాట్లాడక తప్పదు. జవాబు చెప్పాల్సిన బాధ్యత వుంది కూడాను. ఆ అమ్మాయిని చూడలేదని ఎలాగంటాడు? ఒక నెల రోజులపాటు వాళ్ళింట్లోనే వున్నాడుకదా! ఆ అమ్మాయేమీ సిగ్గుపడిపోతూ లోపల గదుల్లో దూరికూర్చోలేదుగా. ఇతనితోపాటు, ఇతని ఎదురుగా మట్టికలిపి, నీళ్ళతోడి, పనులుచేసి, భోజనం వడ్డించి, బట్టలుతికి అన్నిపనులూ చేసేది.

ఇలా కాసేపు లలిత జ్ఞాపకాలు తెరలు తెరలుగా కదిలి, మారి మనసును గందరగోళం చేసినా నెలరోజులు ఎట్ట ఎదుటనే చూసి లలితను చూడలేదని మళ్ళీ అక్కడకి బయల్దేరి వెళ్ళడం అప్రామాణికం అవుతుందనిపించింది.

అంతవరకు తంబాకు రసాన్ని నోట్లో బిగపట్టిన రామకృష్ణ బాత్‌రూంలోకి వెళ్ళి ఉమ్మేసి వచ్చి "ఏమంటారు? " అని ఇప్పుడడిగాడు. నరహరి "మీ ఇష్టం" అనేశాడు.

రామకృష్ణకి సంతోషంగా అనిపించింది. అయినా ఇవాళంతా మళ్ళీ ఆలోచించండి. పెళ్ళి చేసుకునేవాడి సంపూర్ణ అంగీకారంతో పెళ్ళికావాలి. పూర్తి బాధ్యత మీదికదా! రేపు ఫోన్‌లో మాట్లాడతాను. నేను స్వయంగా రావడానికి వీలవుతుందో లేదో మీరు ఫోన్‌లో కన్‌ఫర్మ్ చేయండి" అని చెప్పి బాధ్యత అతని నెత్తిమీదపెట్టి వెళ్ళిపోయాడు. నరహరి రాత్రంతా ఆలోచించాడు. కాని తన ఈ నిర్ణయం మార్చుకునే అగత్యం కూడా కనపడలేదు.



పెళ్ళయిన ఐదేళ్లలో ఎన్నేసి సంఘటనలు జరిగిపోయాయి. భవాని, విజయ్ పుట్టారు. రోడ్డు దాటుతూ మిలిటరీ ట్రక్కుకిందపడి రామకృష్ణ మరణించాడు. లలిత మూడవ కాన్పుకి ఊరికి వెళ్లి గణేశ్‌ని కని గతించింది. నాలుగేళ్ళ భవాని, రెండేళ్ళ విజయుడు, పసికందు గణేశ్ అమ్మమ్మ, పిన్నమ్మల ఆలనపాలనలోకి వెళ్ళారు. వాళ్లని తీసుకొచ్చి తనుమాత్రం ఏం చేయగలడు? కొడుకుపోయిన ఏడాదిలోగా కూతురు కూడా మరణించింది. అయినా అత్తగారు ఆ దుఃఖాన్ని అదిమిపెట్టి మనమల్ని పెంచడా

నికి సిద్ధపడ్డారు. ఒకరోజు ఊరికొచ్చి అత్త గారితో అన్నాడు, "అమ్మా, నాకు చాలినంత జీతం వస్తోంది. అందులో కొద్దిమొత్తం నా జీవనానికి వుంచుకుని, మిగతాది పిల్లల కోసం పంపిస్తాను. పిల్లల్ని మీరే చూసుకో వాలి. నేను మొదట సన్యాసిగా బతికినవా డినే. ఇకమీదట కూడా సన్యాసిగానే బతుకు తాను. వైదేహికెవర్నన్నా మంచి కుర్రాడిని చూసి పెళ్ళి చేసేయండి. రామకృష్ణ ప్రావి డెంట్ ఫండ్‌ని సద్వినియోగం చేయొచ్చు"

పెళ్లికిముందు నరహరి ఒంటరితనానికి అలవాటుపడ్డవాడే. అదే తన వ్యక్తిత్వానికి సహజస్థితి అన్నట్టుగా బతికేవాడు. అయితే లలిత తన జీవితంలో ఎలా ప్రవేశించిందో అన్నాళ్లు ఎక్కడో దాగివుండి ఒక్కసారిగా జన్మాంతర బంధంలా, లోతైన అనుబం ధంలా ఎలా మనసుని ఆక్రమించిందో అత నికే తెలియలేదు. ఏదేమయితేనేం తన ఒంటరితనాన్ని ఆమె భంగం చేసింది. ముగ్గురు పిల్లల తండ్రినిగా చేసి వదలివెళ్ళి పోయింది. ఇందుకోసమే వచ్చిందేమో ఆమె.

సంవత్సరానికొకసారి శలవు తీసుకుని బన్ని కొప్పులికి వెళ్ళేవాడు. అత్తగారు ఇత డిని చూసి కళ్ళల్లో నీళ్లు నింపుకునేది. పిల్ల లొచ్చి తొడమీద కూర్చునేవారు. ఇక్కడికి వస్తే తన ఏకాకితనానికి భంగమేకాని రాకుండా వుండటం ఎలా కుదురుతుంది? రమ్మని ఆవిడ ఉత్తరం వ్రాయించేది. ఆవిడ వ్రాయించకపోయినా వెళ్ళేవాడేనేమో తను. తిరిగి బొంబాయి వెళ్ళాక తన అంతర్ముఖత ప్రారంభం అయ్యేది. తనకెవరూ సంబంధీ కులు లేరు. తను ఒక్కడే. భార్యాపిల్లలు లేరు. అంతా ఏదో కలలా జరిగి మెలకువ వచ్చేసింది. ఇప్పుడు వాళ్ళపట్ల తన పరి మితిలో కర్తవ్యం నెరవేరుస్తున్నాడు. కర్తవ్యం బంధనాన్ని సృష్టించాల్సిన అవస రంలేదు. బంధాలనుండి విడుదల గావిం చాలి. అయినా తన జీవితం తనది. ఎవరి సహవాసంతోనూ కలవనక్కరలేదు.

రెండేళ్ల అంతరంలో పెళ్లికిముందుండిన తన మనఃస్థితికి మళ్ళీ అలవాటుపడ్డాడు. ఇంకొక్క కర్తవ్యం మాత్రం మిగిలింది. ఊళ్ళో అత్తగారు ముగ్గురు పెళ్లికొడుకుల్ని మాట్లాడి వుంచారట. ఈ సంవత్సరం శలవు తీసుకుని వెళ్ళి ఏదో ఒక పెళ్ళికొడు కుని నిశ్చయించి పెళ్లి చేసేయాలి. ఆ పిల్లకి అప్పుడే ఇరవైరెండేళ్లు. రామకృష్ణ బతికుంటే ఈ బాధ్యత తనదికాదు. అతనికున్న వ్యవ హార కుశలత తనకి లేదు. అయినా అత్త గారి గైడెన్స్‌లో ఈ పని ఒకటి కానిచ్చె య్యాలి. లేకపోతే తనకి బంధన విముక్తి కాదు. కర్తవ్యాన్ని పూర్తి చెయ్యకపోతే బంధ నాలు పెరిగి మళ్ళీ ఎలాగో అలా చుట్టుకుం టాయట. ఇంకొక నెలలోగా శెలవుతీసుకుని వచ్చి ఈ పని పూర్తిచేస్తానని అత్తగారికి ఒక ఉత్తరం రాసిపడేశాడు.

ఒకవారంలోనే టెలిగ్రాం ఒకటి వచ్చింది. ఇతను పగలల్లా ఆఫీసులో గడిపెయ్యడం వల్ల, శనివారం ఇంటి చిరునామాకి వచ్చిన టెలిగ్రాం, ఇతను ఇంట్లో దొరక్కపోవడం వల్ల తీరిగ్గా సోమవారంనాడు మామూలు పోస్ట్‌లాగా వచ్చి ఇంట్లోపడింది. సాయం కాలం ఏవో ఆధ్యాత్మిక సభకి హాజరయ్యి తీరిగ్గా రాత్రి పదిగంటలకి ఇంటికొచ్చిన నర హరి అప్పుడు చూసుకున్నాడు టెలిగ్రాం. "అత్తగారు చాలా సీరియస్, బతకడం కష్టం. తిపటూరు హాస్పటల్లో వున్నారు. వెంటనే బయల్దేరండి" ఇదీ సంగతి. వెంటనే ఏ రైలూ లేదు. అదృష్టంకొద్దీ ఇంట్లో సరిపడా డబ్బుంది. ఆఫీసుకి ఒక కార్డు రాసిపడేసి పోస్టుబాక్స్‌లో వేశాడు. తెల్లవారగానే రైలెక్కాడు. ఒక కునుకు తీసి లేచాక ఆలోచనలు మొదలయ్యాయి. ఒక వేళ అత్తగారు పోతే గతేమిటి? తనమా

నాన తను బొంబాయిలో సన్యాసిలా బ్రత కాలంటే అత్తగారు బ్రతికే వుండాలి. నర

హరి కొద్దిసంవత్సరాల క్రితంవరకు ప్రార్థన చేసుకునేవాడు. కాని అది మానేసి ధ్యానం మొదలుపెట్టాడు. ప్రార్థన అనేది సకామమైనది. ఏ కోరికా లేకపోతే ప్రార్థన అవసరం ఏముంది? ధ్యానమనేది నిష్కామమైనది. ఏ ఇష్టము, కోరికతో ప్రమేయం లేకుండా చేయొచ్చు. బంధాలలో బంధింపబడ్డవాడికి మాత్రం ప్రార్థన అనేది అగత్యం. కాని ఇప్పుడు రైల్లో కూర్చుని అతివేగంతో ప్రయాణిస్తున్న ఈ క్షణం ఉన్నట్టుండి అతని మనసు ప్రార్థన చేయడం ప్రారంభించింది. "ఆవిడకి జబ్బు నయమవాలి దేవుడా! ఆమె ప్రాణానికే అపాయం లేకుండా కాపాడు తండ్రీ" అని వేడుకున్నాడు.

ఊరికి వెళ్ళినప్పుడు అత్తగారు ఇతన్ని ప్రేమగా పలుకరించేవారు. కష్టసుఖాలు చెప్పారు. వైదేహిని అతనే పెళ్ళి చేసుకోవాలని కోరారు కూడా. మళ్ళీ సంసారం వద్దనుకున్న అతని సంకల్పాన్ని విని ఆవిడ ఒక రకంగా సంతోషించింది. అది లలితమీద అతడి ప్రేమకి గుర్తు అనుకుందావిడ.

మర్నాడు మధ్యాహ్నం ఒంటిగంటకి తిపటూరు చేరాడు. వెంటనే ఆస్పత్రికి వెళ్ళి విచారించాడు. ఆవిడ శనివారం సాయంకాలమే మరణించారు. ఆవిడ కూతురు, మనుమలు ఊరికి వెళ్ళిపోయారు. వెంట ఇద్దరు రైతులున్నారు. శవసంస్కారం తిపటూరిలోనే జరిగిందట.

ఏది జరుగకూడదనుకున్నాడో అది జరిగిపోయింది. మనసుని సమాధానపరచుకోవాలి. కాని సమస్యని పరిహరించుకోవడం ఎప్పుడు? భుజానున్న బ్యాగ్ మరొక భుజానికి మార్చుకున్నాడు. మరొక బ్యాగ్ చేతిలో పుచ్చుకుని బన్నికొప్పలువైపు నడిచాడు. రెండుమైళ్లు నడిచేసరికి కెంచయ్య కనిపించాడు. అతను తిపటూరు వెళ్ళి బొంబాయి తన అడ్రస్‌కి మరో టెలిగ్రాం ఇచ్చివస్తున్నాడట. అమ్మగార్కి జబ్బు చేయడం, ఆస్పత్రిలో చేర్పించడం చనిపోయేముందు ఆడిన మాటలు... అన్నీ తల్చుకుంటూ, చెబుతూ నరహరితోబాటు నడుస్తున్నాడు. 'కెంచయ్యా నువ్వే సాక్ష్యం. వైదేహిని పెళ్ళి చేసుకోమని నరహరితో చెప్పు. "వైదేహీ నా చెయ్యి పట్టుకో" అని కూతురి చెయ్యి చేతిలోకి తీసుకుని ప్రాణం వదిలిందట.

"ఈ బంధంలో తను పడడన్న సంగతి ఆవిడకి సరిగ్గా తెలియదు" అని తనలోనే వ్యంగ్యంగా నవ్వుకుని గబగబ అడుగులు వెయ్యసాగాడు.

ఊరికి వెళ్ళి అమ్మమ్మని పోగొట్టుకున్న పిల్లలకి, వైదేహికి ఓదార్పు మాటలు చెప్పి తరువాతి కార్యక్రమాలకి నిలబడ్డాడు. శ్రాద్ధ కర్మలమీద తనకేమీ నమ్మకాలు లేవు. కాని వైదేహి బాధపడుతుంది. చెయ్యకపోతే తృప్తికలుగదు. సరే సిద్ధపడ్డాడు వాటికి. పైగా వూళ్ళో వాళ్ళు రైతులు కూడా ఊరుకోరు. ఇంట్లో డబ్బుంది. తిపటూరునుంచి సరుకులు తెప్పించాడు. పురోహితుల్ని, బ్రాహ్మణుల్ని అక్కడినుంచే పిలిచి కర్మలను పూర్తిచేశాడు. తనకింకా పద్దెనిమిదిరోజులు శలవుంది. ఇక్కడ వుండి చేసేదేముంది? వైదేహి పిల్లల్ని చూసుకుంటుంది. వంట చేస్తుంది. తనకి వడ్డిస్తుంది. ఆమె మునుపే తనతో పెద్దగా మాట్లాడేది కాదు. ఇప్పుడింకా మౌనాన్ని ఆశ్రయించింది. తనకి చెప్పాల్సినదేమన్నా వుంటే భవానిచేత కబురు పెడుతుంది. కెంచయ్యగాని, అతని భార్యకాని వస్తే, ఆ సమయానికి తను అరుగుమీద వుంటే, వైదేహి సన్నగొంతుతో మాట్లాడటం వినిపిస్తుంది. మధ్య మధ్యలో సన్నగా ఏడుస్తున్న శబ్దం వస్తుంది.

ఒకరోజు తను చెరువుగట్టు ఎగువన రావిచెట్టుకింద కూర్చున్నాడు. అప్పుడు గతం మస్తిష్కంలో తిరిగింది. ఈ స్థలంలో కూర్చునే లలితని చూసేవాడు. అలా చూడకపోతే, చూసి తల్లినాటి జ్ఞాపకాలవలలో




చిక్కకోకపోతే ఆమెని పెళ్ళాడేవాడే కాదు. మొత్తానికి రామకృష్ణ పరిచయం అవడం ఎంత యాదృచ్ఛికం! ఆ పరిచయం తన జీవితాన్ని ఎన్నెన్నిమలుపులు తిప్పుతోంది. అని ఆలోచిస్తూ కాస్త తంబాకు నోట్లో వేసుకున్నాడు. ఇక అక్కడ కూర్చోబుద్ధికాక లేచి ఇంటివైపు నడవసాగాడు.

అంతలో కెంచయ్య ఎదురొచ్చాడు. మీతో మాట్లాడాలని వచ్చాను. మీరు ఇంట్లో లేరు.

"నేను ఇటొచ్చాను మరి"

"రండి బాబూ కొంచేపు మాట్లాడి ఎల్తాను" అని ఒక చెట్టుకిందకి వెళ్ళి కూర్చున్నాక, కెంచెయ్య నోట్లో వున్న తాంబూలం ఉమ్మేసి వచ్చి కూర్చుని అడిగాడు "ఇప్పుడేం సేత్తారో సెప్పండి మరి"

"దేని సంగతి"

"సిన్నమ్మగారి ఇసయం"

"ముగ్గురు పెళ్ళికొడుకుల్ని కనుక్కుని వుంచాను అని రాసారు అమ్మగారు. వాళ్ళు ఏవూరి వాళ్ళో కనుక్కుని చెప్పు. వెళ్ళి వివరాలు మాట్లాడతాను"

"అది కాదు, మీరు సేసుకునే సంగతి సెప్పండి"

"నీకు తెలీదా కెంచయ్యా? ఈ జన్మలోనే కాదు, ఇంకే జన్మలోనూ కూడా సంసార తాపత్రయం ఒద్దు నాకు"

"మరి పిల్లల్నేం సేత్తారు"

నిజానికి అతనా సంగతేమీ ఆలోచించుకోలేదు. అయినా వెంటనే, "నేను పెంచుతాను" అన్నాడు.

"ఎలా పెంచుతారు బాబూ, మీరు ఎల్తే పిల్లల్నెవళ్ళు సూత్తారు. పోని సంటిబాబుని ఎంటతీసుకెల్లి పెంచుదామంటే సిన్నమ్మగారి బరత ఇంట్లో ఊరుకుంటారా? మీరు సేసుకోక మరో దారి లేదు"

సొరంగ మార్గాలన్నీ మూసేసి కోటమీద దాడిచేసినట్టుంది కెంచయ్యమాట. దీనికి మార్గాంతరం ఏమిటా అని ఆలోచనలో పడ్డాడు నరహరి. మళ్ళీ కెంచయ్యే అన్నాడు. ఇదంతా ఆలోచించే పెద్దమ్మగారు, సిన్నమ్మగారి ఎదురుగానే నాతో సుబ్బరంగా, ఇవరంగా సెప్పి మరీ కన్ను మూసారు బాబూ"

ప్రస్తుత పరిస్థితి గురించి సీరియస్‌గా ఆలోచించసాగాడు. ఏమీ అర్థం కాకుండా వుంది. మార్గం తోచడంలేదు. తల దిమ్మెక్కిపోయింది. వెంటనే ఓ పిసరు పొగాకు నోట్లో పడితే బుర్ర పనిచేస్తుందేమోననిపించింది. "సర్లే, రేపు మాట్లాడతాను" అన్నాడు.

కెంచయ్య వెళ్ళిపోయాడుగాని నరహరి మస్తిష్కం పనిచేయడం మానేసింది. పరిష్కారం కనిపెట్టలేకపోతే పోనీ గాని, పరిస్థితి అర్థంచేసుకోడానికి కూడా చేతకావడంలేదే! లేచి ఇంటికెళ్ళాడు. వైదేహి తన కోసమే ఎదురుచూస్తున్నట్టుగా వుంది. పిల్లల భోజనం అయింది. మౌనంగా భోజనం చేసాడు. అరుగుమీద చాపవేసుకుని పడుకున్నాడు. నిద్రరాదు, బుద్ధి చురుకూ కాదు. వెనకాల పెరట్లో ఆడుతున్న గణేశ్ వైదేహి పనికి అడ్డం వచ్చి ఇబ్బంది పెడుతున్నట్టున్నాడు. "అరుగుమీద నాన్న కూర్చున్నారు. వెళ్ళి నాన్న పక్కన పడుకో" అని సన్నగా అన్న వైదేహి మాటలు వినిపించాయి. రెండేళ్ళ గణేశ్ వచ్చి అరుగుకింద నుంచుని చేతులు చాపాడు. తనే అరుగుమీదకి ఎత్తుకు తీసుకున్నాడు. బిడ్డకాసేపు ఏవేవో ముద్దుమాటలు మాట్లాడి, మాట్లాడుతూనే నిద్రపోయాడు. నిద్రలో తన కుడికాలు నరహరి పొట్టమీద వేసి పడుకున్నాడు.

కొద్దిసేపయ్యాక నరహరి లేచాడు. కెంచయ్య ఇంటికెళ్ళి ఒక తమలపాకు, కాస్త పొగాకు అడిగి తీసుకుని వేసుకున్నాడు.



అప్పుడింక బుర్ర పనిచేయడం మొదలుపె ట్టింది. కెంచయ్య అన్నాడు "ఈ పల్లెకొం పలో సిన్నమ్మగారిని ఒదిలేసి ఎట్టా ఎల్తారు బాబూ! బుడ్డోళ్ళు వయసులో వున్న పిల్లకి తోడవగల్తారా అయ్యా? బుడ్డోళ్ళని, సిన్న మ్మనీ కూడా మీతో బొంబాయి తీసికెళ్ళి పోండి. పొలం నేను జాగర్తగా చూసుకుం టాను. అలా ఒద్దంటే ఎవర్కైనా ఖరీదుకి ఇచ్చేయండి" అన్నాడు.

సాయంత్రం వరకు ఆలోచిస్తే అతను చెప్పిందే రైటని అనిపించింది. కాని పెళ్ళి మాత్రం ఇష్టంలేదు. కెంచయ్య అడగనే అడి గాడు. "అయితే పెళ్ళి బొంబాయిలో చేసుకుంటారా బాబూ? "

అతనిదగ్గర కాదనడానికి లేదు. కాని మనసు మాత్రం దానికి సిద్ధంగా లేదు. అక్కడకి వెళ్ళాక ఏదో ఒకటి ఆలోచిద్దాంలే అనుకుని "ఊ" అన్నాడు.

"అలాగే చేయండి. ఇక్కడమాత్రం ఎవరు న్నారు? అయిన వాళ్ళెవరూ లేరు కదా? చేసేవాళ్ళెవరు? "

ఒక వారంలో చిన్నా చితుక సామాన్లు, గిన్నెలు కట్టుకుని, పెద్దవన్నీ ప్యాక్ చేసి కెంచయ్య ఇంట్లో పెట్టాడు. పశువుల్ని, పొలాన్ని చూసుకోమని కెంచయ్యకి చెప్పాడు ఇల్లు తాళం పెట్టి, వైదేహిని, పిల్లల్ని తీసుకుని బొంబాయి బయల్దేరాడు. రామకృష్ణ ప్రావిడెంట్ ఫండ్ డబ్బే కాకుండా తను నెలనెలా పంపే డబ్బులో కూడా కొంత దాచి కూడబెట్టి వుంచింది అత్తగారు. ఆవిడ కర్మలకి ఖర్చుకాగా మిగి లినది తన ముందుంచింది వైదేహి.

★ ★ ★

నరహరి సరుకులు తెచ్చిపడేస్తే వైదేహి వండిపెట్టేది. పిల్లల్ని చూసుకునేది. భవా నిని, విజయ్‌ని స్కూల్లో చేర్చారు. ఒకే ఇంట్లో వుంటే, గృహిణి తన బాధ్యతలని నిర్వహించేటప్పుడు గృహస్థుతో ఎంతో మాట్లాడవలసిన అవసరం వుంటుంది. అదీ కాక అతను ఆమెకి అపరిచితుడేమీ కాడు. కాని ఆమె ఎప్పుడూ అతనితో అంత స్వే చ్ఛగా మాట్లాడలేదు. అతను బాల్కనీలో పడుకునేవాడు. ఆమె లోపల పిల్లలతో పడు కునేది. ఒకసారి ఉన్నట్టుండి ఆమె అతనితో మాట్లాడటం పూర్తిగా ఆపేసింది. రెండు మూడు రోజులు అతనావిషయం అట్టే పట్టించుకోలేదు. ఒకరోజేదో అడిగితే ఆమె జవాబివ్వలేదు. ఏమాటా ఆడలేదు. ఎందుకు మాట్లాడటంలేదని గుచ్చిగుచ్చి అడి గితే కళ్ళల్లో నీళ్ళు నింపుకుంది. "తరువాత చెప్తానంది"

పిల్లలంతా పడుకున్నాక అతను లోపలకి వచ్చి సంగతేమిటని అడిగాడు.

"మీ అభిప్రాయం ఏమిటో దేవుడికే తెలి యాలి. మీకు, పిల్లలకి వంటచేసుకుని పడుండటం నాకేమీ కష్టం కాదుగాని, నా మర్యాద నాకుండాలి కదా? "

"ఏమయిందిప్పుడు? "

"ఈ బిల్డింగ్‌లో ఎన్ని సంసారాలున్నాయి! వాళ్ళంతా ఏమనుకుంటారు? నాలుగైదు రోజులక్రితం ఇద్దరాడవాళ్ళొచ్చారు. "మీ బావ నిన్ను పెళ్ళిచేసుకున్నారా? " అని అడి గారు. "ఇంకా లేదన్నాను" "ఇంకా ఎన్నాళ్ళు ఇలా వుంటారు? ఆయన బాల్కనీలో పడు కుంటున్నాడని అందరికీ తెలుసు. కొంత మంది "బాల్కనీలోంచి లోపలకి వెళ్ళిరా వడం ఎంతసేపు? " అని మాట్లాడుకుంటు న్నారు. ఎందుకిలా? చేసుకోదల్చుకుంటే పెళ్ళి చేసేసుకోండి, ఎన్నాళ్ళిలా వుంటారు? ' ' అని నాలుగూ అడిగేసి మరీ వెళ్ళారు.

"నేనిక పెళ్ళి చేసుకోదల్చుకోలేదన్న నా నిశ్చయం నీకు తెలీదా? "

వైదేహి మళ్ళీ మాట్లాడలేదు. ఒక నిమిషం ఆగి వెక్కివెక్కి ఏడవడం మొదలు




పెట్టింది. అతను ఓదార్చడానికి ప్రయత్నించాడు. తరువాత అంది "నన్ను ఊరికి పంపించెయ్యండి. పొలంలో రాగి పంట వుంది. మోదుగ ఆకులు కుట్టి విస్తళ్ళు చేసుకుంటే ఉప్పు, మిరపకాయల ఖర్చు వెళ్ళమారుతుంది"

"ఎందుకలా నిష్ఠూరంగా మాట్లాడతావు?'

"నిష్ఠూరం కాదు. కెంచయ్యతో మీరేమన్నారు? బొంబాయిలోనే పెళ్ళిచేసుకుంటాం అని ఒప్పుకున్నారట. పెళ్ళి కానప్పుడు ఎందుకిలా వుండటం? నాకు పెళ్ళే కావాలని తపన లేదు. ఇన్నేళ్ళు మర్యాదగా బతికాను. ఇంకో ఇరవైయేళ్ళు ఎవరిచేత వేలెత్తి చూపించుకోకుండా వుండేలా మర్యాదగా బతికేస్తాను. ఊరికి పంపించెయ్యండి"

అంతే, ఆమె ఇంకేమీ మాట్లాడలేదు. అతనే ఏవేవో ఓదార్పు మాటలు చెప్పాడు. కాని అతను పలికే ఓదార్పులో క్రియాత్మక సమాధానం గాని, అర్థంగాని లేదని అతని మనసుకే తెలుసు. బయటకొచ్చి బాల్కనీలో పడుకున్నాడు. రెండు రోజులు అదే ఆలోచించాడు. వైదేహిని వూరికి పంపించడమా? లేక ఎవరన్నా కుర్రాడిని చూసి పెళ్ళి చేయడమా? మరి పిల్లల సంగతి? ఇప్పటికే తను ఆమెమీద ఆధారపడి బతుకుతున్నాడు. ఇదొక రకం బంధం. ఈ బంధాన్ని నలుగురెదురుగా ఘోషించాలి అంతే. దానికి 'పెళ్ళి' అని పేరు. పెళ్ళి చేసుకుంటే ఈమెకీ పిల్లలు పుడతారు. తనకిక పిల్లలక్కరలేదు. ఆమెకి కావాలో అక్కర్లేదో తనకి తెలియదు. పిల్లలొద్దు అని ఏ ఆడదీ అనుకోదని లలిత చెప్తూ వుండేది. వైదేహి లలితకి చెల్లెలే కదా! పిల్లలు కావాలనుకునే మాట అలా వుంచి, భర్తవల్ల దైహికసుఖం కావాలని ఏ భార్యయినా అనుకుంటుంది కదా! దీనికి పరిహారం ఏమిటి?

ఆలోచించి ఆలోచించి ఒక సంగతిని కొత్తగా కనిపెట్టినట్టుగా ఫీలయ్యాడు. బంధనానికి పరిమితేమిటసలు? బంధంలో పడితే పూర్తిగా లాగేస్తుంది. ఎలక్ట్రిక్ షాక్ లాగ. లేదా స్పర్శ తగలనంత దూరంగా వుండిపోవాలి. దీనికి మధ్యమస్థితి అంటూ ఏమీలేదు. అప్పటికే వైదేహితో ఒక బంధం ఏర్పడిపోయింది. పెళ్ళి చేసుకోడం ఒకటే మార్గం.



బంధాలకి లోనవడం అంటే దానికి మధ్యే మార్గం అంటూ ఏమీలేదు. అనే ఆలోచన అతనిలో నిద్రాణంగా వుండి ఇన్నాళ్ళు అతనిలో ఒక తీర్మానాన్ని రూపొందించింది. ఇప్పుడది స్పష్టమైన నాలెడ్జిగా మారింది.

పిల్లల్ని దత్తత ఇవ్వడం అయింది. కాని తనింకా స్వతంత్రుడు కాలేదు. ఇదే ఇల్లు, ఇదే వూరు, ఇదే సిటీ బస్సు, ఇదే ఆఫీసు, భోజనం, ఫలహారం, వీటినుండి విడుదల పొందాలి. ఈ జీవుడు శరీరాన్నంటుకుని వున్నంతవరకు వీటినుండి ముక్తిలేదు. ఆత్మహత్య చేసుకుంటే! కాని అది పరిహారం కాదుకదా! ఆత్మహత్య పిరికితనపు పని మాత్రమే కాదు. పాపం కూడా. మరో రెండు రోజులు ఆలోచించాక తనకింకా బతుకంటే ఆకర్షణవుందని, అందుకే ఆత్మహత్య అంటే అయిష్టంగా వుందని అర్థమ

యింది. కట్టుబాట్లనేవి వుండకూడదు. అదెలా కుదురుతుంది? సన్యాసం ఒకటే అలాంటి జీవనాన్నందించగలదు.

అవును, అందుకే తన అంతరంగం తపి స్తోంది. మొదటి వివాహానికి ముందే ఇలాంటి జీవితాన్ని కోరుకున్నాడు తను. ఇలా బతకాలని ప్రయత్నించాడు. మధ్యలో ఇవన్నీ జరిగిపోయాయి. ఇప్పుడు పూర్తి సన్యాసం తీసుకోవాలి. ఇల్లు, ఆఫీసు, ఉద్యోగం. ఈ లంపటాలనుంచి విముక్తుడ వాలి. వారం రోజుల్లో మనసు పూర్తిగా ఒక నిర్ణయానికొచ్చింది. ఎవర్నీ అడగాల్సిన అవ సరంగాని ఎవరికీ చెప్పాల్సిన అవసరంగాని లేవు. "తనింక ఈ ఉద్యోగానికి రాలేడు. వీలైనంత త్వరలో మరొకర్ని ఏర్పాటు చేసు కోండి, తనకి రాజీనామాకి అనుమతి నివ్వండి" అని ఉత్తరం రాసిచ్చాడు.

ఇంట్లోని గిన్నెలు, పరుపులు, సామాన్లు పైప్‌లైన్ దగ్గర గుడిసెల్లో వాళ్ళకివ్వడానికి నిర్ణయించుకున్నాడు. తన నిశ్చయాన్ని ఎవ రికీ చెపాల్సిన అవసరంలేదు. కాని తన కింత ఉపకారం చేసి తన నిశ్చింతకి కారణ మైన శెనాయ్‌కి చెప్పాల్సిన అవసరం వుంది. ఒక సాయంత్రం ఫోన్ చేసి చెప్పాడు. దాని కతడు,

"బంధాలొద్దనుకోవడం బాగానే వుంది, కాని సన్యాసిగా మారిపోయే బదులు ఏద యినా పరోపకారంలో కాలం గడపడం ఇంకా పారమార్థికంగా వుంటుందేమో" అన్నాడు.

"తన పిల్లల మంచి చెడ్డలు తాను చూసు కోలేని మనిషి ఏం పరోపకారం చేయగలడు చెప్పండి. అయినా ఈ ప్రాపంచిక వ్యవహా రాలు వదులుకోవాలంటే మరోదారి పనికి రాదు" అన్నాడు నరహరి. ఇతడి సంగతి శెనాయ్‌కి బాగా తెలుసు. జీవితంలో ఎన్నో అనుభవాలు, కష్టాలు చూసిన మనిషి ఇతడు. తనింకేం చెప్పగలడు? "

"సరే, మీ ఇష్టం. అలాగే కానీయండి" అన్నాడు శెనాయ్.

★ ★ ★

హరిద్వార్‌లో ఒక గురువు దొరికాడు. తన బట్టల్ని విసర్జించి కాషాయవస్త్రాలు స్వీకరించాడు. గురువుగారు పదిహేను రోజుల్లో హృషీకేశ్‌కి వెళ్ళారు. ఇతను వారి ననుసరించాడు. హరిద్వార్, హృషీకేశ్ నిండా సాధువులు, సన్యాసులు, భక్తులు, భిక్షగాళ్ళు వున్నారు. వాళ్ళలో బంధముక్తు లైనవాళ్ళెందరు? బంధముక్తులు కావడానికి ప్రయత్నంచేస్తున్న వాళ్లెందరు? ఎవరు ఎవరో, దొంగవేషం వేసిన వాళ్ళెవరో, నిజ మైన సన్యాసులెవరో అతనికర్థంకాలేదు. తన గురువులో మాత్రం అతనికి విశ్వాసం వుంది. కొన్నాళ్ళయ్యాక ఆయన చెప్పారు. ఒకచోట స్థిరపడి తపస్సు ప్రారంభించే ముందు నువ్వు పైకి వెళ్ళి ఒకసారి సంచారం చేసుకునిరా.

"పైకి అంటే హిమాలయాలకి. హృషీకేశ్ హిమాలయ ఘట్టాలకు ఆరంభ బిందువు. చూడు, హృషిక అంటే ఇంద్రియం. ఇక్క డ్నుంచి పైకి వెళ్ళి సంచారం చేసుకురావడం అంటే అర్థం ఏమిటో తెలుసా నీకు? " అన్నారు గురువుగారు.

"కొంచెం అర్థమయింది. పూర్తిగా వివరిం చమని మనవి చేసుకుంటున్నాను"

"ఆ హిమం, ఆ చలి, ఆహారం దొరికితే దొరుకుతుంది లేకపోతే లేదు. కేవలం శ్వేత వర్ణ హిమదర్శనం. మరో రంగే వుండదు. ఉన్నా అతి తక్కువ. చర్మం, నాలుక, కన్ను, ముక్కు దేనికీ ఆహారం వుండదు. ఇలా మూడేళ్ళు తిరిగిరా. బయలు ప్రదేశాలలో మాత్రం దిగవద్దు"

"మధ్యలో ఏమన్నా అనుమానం వస్తే ఎలా తీర్చుకోవాలి? ఎవర్నైనా అడగవ చ్చునా? "




"ఎవ్వరినైనా అడగవచ్చు కాని వారు దారి తెలిసినవారై వుండాలి. మనకి దారి చూపించేవారు పైకి వెళ్ళి చూసివచ్చిన వారా లేక ధోకా ఇచ్చే బాపతు మనుషులా అని పరీక్షించకుండా ఎవరినీ ఏమీ అడగ వద్దు"

"మళ్ళీ మీ పాదదర్శనం ఎప్పుడు చేసు కోను? "

"ఇంకో మూడు సంవత్సరాలవరకు నువ్వు పైనే సంచరిస్తూ వుండాలి. ధ్యానం, మంత్రం, క్రమం, ఆసనం, ప్రాణాయామం అన్నీ బోధించాను నీకు. కొంత అలవాటు కూడా అయింది. మళ్ళీ హృషీకేశానికి తప్ప కరా. నేను కూడా మూడు సంవత్సరాలు ఇక్కడ వుండను. తరువాత ఇక్కడికొస్తాను. అప్పుడు వచ్చి నన్ను చూడు"

"ఈ మూడు సంవత్సరాలు తమరెక్కడ వుంటారు"

"ఇంకా నిశ్చయించుకోలేదు. నేనూ పైకే ఎక్కడికైనా వెళ్ళొచ్చు"

"అయితే నేను కూడా మీతోనే రావచ్చు కదా? "

"ఊహూ... నీ దారిని నీవే వెదికి తెలు సుకోవాలి. నాకు కొన్ని భాగాలు తెలుసు. తెలియనిదాన్ని వెదుకుతాను అని చెప్పి ఒక నిమిషమాగి, "ఇదొక్కటే కారణం కాదు. కూడా వుంటే నువ్వు నా సేవలు చేస్తుం టావు. అది నాకిష్టంలేదు. నీతో నాకొక బంధం పెరుగుతుంది. అది పనికిరానిది. ఒక విషయం గుర్తుంచుకో. దారిలో ఎందరో సాధువులు, భక్తులు, మహాత్ములు కనిపిస్తారు. వాళ్ళతో కూడా స్నేహం పెంచుకోకు. బంధనమవుతుంది. గురు వుపై మనం చూపించే భక్తికూడా బంధనం కాకుండా చూసుకోవాలి. సరే, నువ్వింక బయల్దేరు"

గురువుకి నమస్కరించి వెనక్కి తిరిగి చూడకుండా అతను పర్వతమార్గంలో అడు గులు వేసుకుంటూ వెళ్ళిపోయాడు.

★ ★ ★

ఎక్కడం అంత సులువేమీ కాదు. వంద అడుగులు వేసేసరికి అలసట వచ్చి కూర్చుని ఆయాసం తీర్చుకునే పరిస్థితి ఏర్ప డుతోంది. తమ ఇంటివద్ద 'గుట్ట' ఎక్కిన పుడు ఇలా అనిపించేది కాదు. లెక్కలేనన్ని సార్లు ఆ గుట్టనెక్కాడు. కాని దాని మట్టం బొత్తిగా తక్కువనే చెప్పాలి. ఏకాంతం కోసం ఎక్కడమనే ఉద్దేశం ముఖ్యమైనద యినా, అది ఎక్కేటప్పుడు బొంబాయి మహానగరాన్ని దాని సమగ్రరూపాన్ని పైనుండి చూసి, ఆ సమగ్రత ముందు తన ఒంటిరితనాన్ని భావించి, అనుభవించడం అనేది కూడా ముఖ్యాంశమే. అంటే తన ఒంటరితనాన్ని దర్శించాలంటే బొంబాయి నేపథ్య దృశ్యం అగత్యం. కాని ఇప్పుడు హృషీకేశ్ నుండి పైకి ఎక్కుతుంటే ఏ నేపథ్య దృశ్యాలూ లేవు. కొంచెం పైకెక్కేస రికే హృషికేశ్ స్నానఘట్టాలు, గీతాశ్రమం, స్వర్గాశ్రమం మొదలైనవన్నీ కనుమరుగ య్యాయి. ఇంకొంచెం ముందుకి వెళ్తే కొండ లకి కొండలే నేపథ్యం. ఇంకా కొంచెం పైకి వెళ్తే పర్వతానికి ఆకాశమే నేపథ్యం. ఆకాశం అంటే... ఎంత ఎత్తు ఎక్కినా ఇంకా ఎక్క వలసిన ఎత్తు మిగలటమే. అదీ ఆ అను భవం!

ఎటు వెళ్ళాలి, ఎక్కడకివెళ్ళాలన్న సంగతి గురువుగారు చెప్పలేదు. పైన మొత్తం ఉత్తర ఖండం వుంది. నరేంద్ర నగర మార్గం గుండా వెళ్తే యమునోత్రి, గంగోత్రి వున్నాయి. దేవ ప్రయాగ వైపు వెళ్తే కేదార, బదరీలున్నాయి. దారిలో అనేకరకాల ప్రయాగలు, ఎన్నో పుణ్యక్షేత్రాలు.

ఒక 'గఢ్‌వాలి' దొరికాడు. బాగా ప్రయా ణానుభవం వున్నట్టుంది. అతను ఉత్తరఖండ వివరాలన్నీ చెప్పి, ఉత్తరఖండం

అంటే పుణ్యభూమి. తపస్సు చేయడానికింత కన్న పవిత్రక్షేత్రం ఏముంటుంది? అని అతను చెప్తుండగానే కొత్త సన్యాసి 'నిస్సం గానందుడి'కి అతని గురువు చెప్పిన సంగతి గుర్తొచ్చింది. "తీర్థక్షేత్రం అని ఏ వూరి తోనూ బంధం పెంచుకోకు. అది అధమ విధానం. నువ్వు వెళ్తున్నది పర్వతాలపై జీవితానికి, ఊరిలోని జీవితానికి గల బేధం తెలుసుకోడానికి. శిఖరం పవిత్రం, బయలు భూమి అపవిత్రం అన్న బేధం మరువ రాదు. శిఖరం ఎక్కకుండా బయలుకీ శిఖ రానికి ఉన్న బేధం ఎలా తెలుస్తుంది?

అతను నరేంద్రనగర్‌వేపు అడుగుపె ట్టాడు. ఎన్నో కొండలు, గుట్టలు ఎక్కిది గాడు. దారిలోని పల్లెల్లో జనాలు అన్నం, రొట్టె పెడితే తిన్నాడు. సన్యాసి ఆహారాన్ని కాంక్షగా కోరుకోరాదు. భిక్ష అడిగి తినాలి. దొరికితే నిర్వికారంగా మూడు పిడికెళ్ళు తినాలి. దొరకనప్పుడు దుఃఖం లేకుండా ఊరుకోవాలి. కొండప్రాంతం? ఒకే పద్ధ తిగా ఎక్కేదారిలేదు. ఎక్కాలి, దిగాలి. ఎన్నోసార్లు ఎక్కవలసిన దానికంటే దిగవల సిన దెక్కువ వుంటుంది. దిగి మళ్ళీ ఎక్కాలి. మళ్ళీ ఎక్కాలంటే పడే కష్టం తల్చుకుంటే దిగడం శ్రమగా అనిపిస్తుంది. మళ్ళీ దిగాలికదా అనే నిజం తల్చుకుంటే ఎక్కడం దండగ అనిపిస్తుంది. కాని, ఎక్కి దిగడం, దిగి, ఎక్కడం అనే అనుభవం బాగా ఒంటికి అలవాటయిపోవాలి. అప్పుడే చివరి ఘట్టాన్ని చేరగలిగేది.

యమునోత్రిలో ఓ ఐదుగురు యాత్రికుల గుంపు కలిసింది. వాళ్ళే ఈ సన్యాసిని పిలిచి భోజనం పెట్టారు. తరువాత తెలి సింది. వాళ్ళు ఉత్తరకాశీ మార్గంగా గంగో త్రికి నడచి వెళ్తారట.

"మోటారు దొరకదా?" ఈ సన్యాసి అడి గాడు.

"జడకోట్ వరకు నడిస్తే అక్కడ్నుంచి చుట్టుకుని ఝూలచట్టాదాకా గాడీ దొరుకు తుంది"

"నేనూ మీతో రావచ్చా?"

"రండి, ప్రయాణంలో మీలాంటి సన్యాసు లకి భోజనం పెడితే, మాకూ పుణ్యమే"

అంతా బయల్దేరారు. సన్యాసి వాళ్ళతో ఎక్కువగా మాట్లాడేవాడు కాదు. తన మానాన తను ధ్యానం చేసుకోడం, నడచి నంతసేపు వాళ్ళతో నడవటం. ఏదయినా పల్లెలో ధర్మశాలలో విడిదిచేసి వంట చేసిన ప్పుడు ఇతనికి మొదట వడ్డించేవారు. ఇతను రోజుకి ఒక్కసారి మాత్రం భోజనం చేసి వాళ్ళతోపాటు నడిచేవాడు. వాళ్ళు బీహార్ వాళ్ళట. ఇరవై అయిదేళ్ళ యువ కుడు, ఏభై పైబడ్డ ఇద్దరు పురుషులు, సుమారు అదే వయసున్న స్త్రీలిద్దరు. వాళ్ళ ల్లోవాళ్ళు తమ కుటుంబ విషయాలు మాట్లాడుకుంటూ ఆకు- వక్క నములుతూ అడుగులు వేస్తున్నారు. మగవాళ్ళు, ఆడ వాళ్ళు కూడా అప్పుడప్పుడు తంబాకు నోట్లో వేసుకుంటున్నారు. సన్యాసి పొగాకును త్యజించినవాడు. అతనికి ఆ బంధనం లేది ప్పుడు. వారం రోజులు ప్రయాణం చేసి వారు గంగోత్రికి చేరారు. అక్కడ ఒక రోజు న్నాక ఆ గుంపు మళ్ళీ బయల్దేరింది. ఝూల్ చట్టాకి వచ్చి బస్సు పట్టుకుని 'టహర్'కి వెళ్ళి, అక్కడినుండి దేవప్రయాగకి నడచి మళ్ళీ కేదార్‌కి గుప్తకాశీకి బస్సులో వెళ్ళాలి. కేదార్‌నుండి 'చమేలీ'కి నడచి జోషిమఠం దగ్గర మోటార్ ఎక్కి బదరీకి వెళ్ళాలని వారి ప్రోగ్రాం.

"మీరూ వస్తారా మాతో?" అనడిగారు వాళ్లు.

"నేను సన్యాసిని. ఎలా రాగలను?"

"బస్సు కిరాయి మేము పెట్టుకుంటాం రండి"

"అలాగే" అని బయల్దేరాడు.




దారిలో ఒక పల్లెలో వంటచేశారు వాళ్లు. ఎప్పటిలాగే ఇతడికి వడ్డించారు. రోజూ కంటే ఆరోజు వంట ఘుమఘుమలాడి పోతూ మహరుచిగా వుంది. ఏమిటి కారణం? అని అతడే అడిగాడు. వాళ్ళు చెప్పారు. ఈ ఐదుగురు రెండు వేర్వేరు కుటుంబాలకి చెందిన జంటలు. బంధుత్వం వుంది. రెండు కుటుంబాలవాళ్లు వేర్వేరు డబ్బాల్లో మసాలాపొడి తెచ్చారు. ఇంతవరకు ఒకరి డబ్బాలోంది వాడారు. రోజూ ఒకే రకంగా వండుకుతిని విసుగ్గా అనిపించి ఆరోజు మరోడబ్బా తీసి దాంట్లోని పొడి వాడారట.

ఒకావిడ అంది: మా వూరివేపు వుండే ప్రత్యేకతే వేరు. నాలాగా మసాలాపొడి చేసేవాళ్ళింకొకరు లేరు"

మరోకావిడ, "అవును భాభీ, మసాలా చేయడంలో నీ జాన్‌కారీ గొప్పది. స్వాములు మెచ్చుకోవడమే దానికి సాక్ష్యం. నేనూ ఒప్పుకుంటున్నాను" అని వెన్ను తట్టింది.

"స్వాములు ఎన్నిచోట్లో భోజనం రుచి చూసివుంటారు. ఆయనే సరి అయిన జడ్జీ" అని కుర్రాడు కూడా ఆమోదించాడు.

సన్యాసి ఉలిక్కిపడ్డాడు. అతని దృష్టి అంతర్ముఖమైంది. ఎక్కి, దిగి చుట్టు తిరిగి వెళ్లే పర్వతప్రదేశంలో ఎక్కడ దారి తప్పుతామో తెలియదు. నేను, నా పరిస్థితి ఇంకా హృషికేశ్‌లోనే వున్నట్టున్నాం. లేకపోతే ఈ మసాలావాసన, ఈ వంటల రుచి తననెందుకింతగా ప్రలోభపరచాలి? వీళ్ళేమో నన్ను వెంటరమ్మని ఆహ్వానించారు. తను వారితో పెద్ద మాటలేమీ ఆడలేదు. తన దారిన తను నడుస్తున్నాడు. అయినా ఈ పన్నెండురోజుల్లో అప్పుడే వీళ్ళతో ఒకరకమైన సంబంధం పెరిగింది. ఇటువంటివి ప్రతి సన్యాసికి తొలిదశలో జరిగివుండొచ్చు అందుకే కాబోలు గురువుగారు చెప్పారు. ఏ ప్రదేశంమీద ఏ గురువుతోను బాంధవ్యం పెంచుకోకూడదని.

వెంటనే నిశ్చయించుకున్నాడు. తను ఇప్పుడే ఈ యాత్రికులని వదిలిపెట్టెయ్యాలి. తన దారి వేరు. తాను యాత్రికుడు కాడు. సన్యాసి కాదల్చుకుని బయలుదేరినవాడు.



ఆరోజునుంచి ఏ యాత్రికుల గుంపుని కలుసుకోలేదు. ఏ సన్యాసినీ జతచేసుకోలేదు. అసలేమనిషినీ తోడు చేసుకోలేదు. తనకి ఇష్టం వచ్చినచోట చిన్న డేరా వేసుకునేవాడు. లేదా గుడిసె. ఆరడుగుల పొడుగు, మూడడుగుల వెడల్పు వుండేలా అడవిలో దొరికే కర్రలు, ఆకులు చాలు. చెమ్మగా వున్న నేలమీద వెదురుచాప వేసుకుంటే చాలు. గుడిసెమీద ఒక కాషాయ జండా, వాకిలి పక్కనే ఒక భిక్షా పాత్ర. ఇష్టమైన వాళ్ళెవరయినా భిక్ష వేయొచ్చు లేకపోతే లేదు. కాషాయజండా ఇది సన్యాసి వాసం అని తెలుపడానికి మాత్రమే. గుడిసె లోపలే కూర్చుని ధ్యానం చేసుకుంటాడు. మనసు చెదిరి ఎటూపోకుండా ప్రాణాయామం చేస్తాడు.

కొద్దినెలల్లోనే ఎంతో సాధన చేయగలిగాడు. ఇప్పుడు స్థిరమైన మనసుతో కూర్చుని రెండు మూడు గంటలు ధ్యానం చేస్తున్నాడు. రెండు మూడు రోజులు తినడానికేమీ దొరక్కపోయినా నిరాహారంగా వుండగలడు. చలికాలంలో కూడా ఒకే కంబళితో గడపగలడు. ఒకేచోట ఎక్కువ కాలం వుండవద్దని గురువులు చెప్పారు. అందుకని ఎక్కడా ఒకనెలకంటె ఎక్కువ వుండలేదు. ఉధృతంగా కొట్టికురిసే వానలున్న కాలంలో మాత్రం రెండు నెలల పాటు ఒక ఊరిలో ధర్మశాలలో గడిపాడు.

యాత్రికులెవరూ లేని ఆ కాలంలో, ఊళ్లోని మూడు ఇళ్ళలో భిక్ష తీసుకునేవాడు.

ఇలా ఒక సంవత్సరం గడిచింది. ఇదివరకు అతను యాత్రికులు సంచరించే కాలిదారిలో నడిచేవాడు. అక్కడే ఎక్కడన్నా దారిలో కొండలమధ్య చెట్లకింద తన గుడిసె కట్టుకునేవాడు. జనసంచారం ఉండే దారి వదలి అడవిదారిని, నదులనీ దాటి పర్వతాలని ఎక్కిదిగి నడిచి వెళ్ళసాగాడు. అడవిలో దుంపలని, వేళ్లని వెతుక్కుని తినడం కూడా అలవాటైంది. మనిషి ముఖం అన్నది చూడకుండా నెలలకొద్దీ ఉండటం నేర్చుకున్నాడు. ఏకాంతవాసం అంటే ఇదేనా? జనసంచారం లేనిచోట, నిరంతరం హోరుతో ప్రవహించే నదుల దగ్గర, అడవుల మధ్య ఆకాశాన్నంటే పర్వతాలు చుట్టుముట్టినచోట తనపాటికి తానుండటమేకదా. కాకపోతే మరింకేమిటి? కాని అతనికి ఒక విషయం స్పష్టంగా తెలిసింది. ఒంటరితనం అంటే మరీ ఒక్కడే. ఉండే, ఉండగలిగే మనఃస్థితి కాదు. మానసికంగా, ఆధ్యాత్మికంగా దాని అర్థం వేరే. అది ఇంకా లోతైనది. తను ఆ అర్థంలో ఒంటరితనం సాధించాలంటే చాలా సాధన కావాలి. తనలో ఉండేది ఏకాంతం కావాలనే కోరిక మాత్రమే. కోరిక అంతులేనిదయ్యి ఇప్పుడు పట్టుదల పెరుగుతోంది. నిరంతర సాధన. సాధనంటే ఏమిటి? ఇంకా ఇంకా పైకి ఎక్కడం.

ఇన్నిరోజులు, ఈవిధంగా మనసుని, శరీరాన్ని 'ఎత్తు'కి చెందిన జీవితానికి అలవాటు చేసినా, ఇంతవరకు ఎప్పుడూ మంచు నిండి వుండే ఉన్నత శిఖరాలకింకా వెళ్ళలేదు. ఒక రోజుకి వెళ్ళివచ్చేసే యాత్రికుల సంగతి వేరు. వెళ్ళాక అక్కడే ఒక సంవత్సరమైనా సంచరించి తరువాత గురువుని దర్శించాల్సిన మనిషి తను. దానికిముందు పర్వత పంక్తుల మధ్యనున్న ఎత్తయిన స్థలంలో గడపటం అలవాటు చేసుకోవాలి. పైకి వెళ్తే ఆహారం దొరుకుతుందో లేదో. బహుశః అక్కడ దుంపలు, పచ్చికూరలు ఏమీ వుండవు. అందుకని ఉపవాసముండడం ఇక్కడే బాగా అలవాటు చేసుకోవాలి. అక్కడి జీవితం గురించిన పరిచయం ఉన్న వారిని అడిగి తెలుసుకోవాలి. ఇంతవరకు అతను ఉండినచోట చలికాలంలో కొన్నిసార్లు మంచు కురిసేది. అతని గుడిసెమీద తెల్లని మంచు కప్పు వేసినట్టుపడి చలి తగ్గిన తరువాత కరిగి నెత్తిమీద పడేది. దాన్ని తట్టుకోగలిగే రేకు ఏదన్నా కప్పుమీద వెయ్యాలి. కాని అది కుదరనిపని. ఒకవేళ పల్లెలో అలాంటి ఇళ్ళేమన్నా వున్నా అతడు ఉండడు.

ఈ పద్ధతిలో బ్రతికేటప్పుడు రెండు మూడుసార్లు అనారోగ్యం చేసింది. తనే కాళ్ళీడ్చుకుంటూ మైళ్లదూరం నడిచి ఏదన్నా ఒక పల్లెకి చేరేవాడు. అక్కడ వాళ్లు కషాయాలేవో తాగించి బాగుచేసేవారు. మళ్ళీ తిరిగే ఓపిక రాగానే తనకి ఆ ఇంటితో స్నేహం, బంధం ఏర్పడేలోగానే అక్కడి నుంచి వెళ్ళిపోయేవాడు. చిన్న చిన్న జ్వరాలొస్తే వేసుకోడానికి మూలికల గురించి పల్లెవారి దగ్గర తెలుసుకునివున్నాడు.

★ ★ ★

తల ఎత్తి చూసినా శిఖరం కనిపించనంత ఎత్తయిన పర్వతాలు. పక్షులకు కూడా దారి, తెన్ను తెలియని అరణ్యాలు. జలజల దుమికి సుడులు తిరిగే నదులు ప్రవహించే ప్రాంతంలో తనెక్కడున్నాడో అతనికే తెలియలేదు. ఒక పెద్దబండమీద నుంచుని చూస్తే ఎదురుగా తళతళమని మెరిసిపోతున్న హిమాచ్ఛాదిత పర్వత శిఖరం భాగం కనపడింది. నిజమైన ఎత్తు అంటే అదే. కాకపోతే ఆ ఎత్తు ప్రారంభమయ్యేది అక్కడే. 'తను అక్కడకి వెళ్ళాలి' అని నిర్ణయించుకున్నాడు. అదే దిక్కుకి




బయల్దేరాడు. తను నుంచున్న కొండదిగి లోయలోంచి మళ్ళీ ఎత్తుకి ఎక్కి ఆ హిమాచ్ఛాదిత పర్వతాన్ని ఎక్కసాగాడు.

సాయంకాలానికి దిగాడు. దిగినకొద్దీ ఇంకా ఇంకా దిగాల్సినలోతు కనిపిస్తూనే వుంది. తను చూసిన తెల్లటి ఎత్తయిన కొండ ఏమయిందో తెలీలేదు. ఏ దిక్కున వుందో అర్థం కాలేదు. అదృష్టంకొద్దీ ఒక పల్లె కనిపించింది. పల్లెకి చేరాలంటే మళ్ళీ పైకెక్కాలి. కొంచెం ఎక్కేటప్పటికి బండ రాళ్ళు నిండిన దారి వుంది. జనం బాగా తిరిగేదారి అయివుండొచ్చు, అనుకుని ఎక్కి నడిచాడు, నడిచి ఎక్కాడు. అది చిన్నపల్లేమీ కాదు. అరవై, డెబ్భై ఇళ్ళున్నాయి. దుకాణాల గట్టులూ కనిపించాయి. ఎవర్నో కనుక్కుంటే చెప్పారు, "ఇదే గౌరీకుండం" అని.

"అంటే ఏ ఊరు? "

"సన్యాసి మహరాజ్ గౌరీకుండం గురించి వినలేదా? కేదార్‌నాథ్ మోకాటి ప్రాంతంలో వున్న వూరిది. గౌరీమాత స్నానం చేసే ఉష్ణకుండం ఇదే"

"ఇక్కడ్నుంచి కేదారనాథ్ ఎంత దూరం? "

"ఎనిమిది మైళ్ళుంటుంది. అంత దూరమూ ఎక్కాలి. ఇప్పుడెందుకు వెళ్ళడం? మందిరపు తలుపులు మూసేసి అప్పుడే పదిహేను రోజులయింది. అంతా కిందకి వెళ్ళిపోయారు. పైన మంచు భయంకరంగా పడుతోంది"

"పైన ఇంకెవ్వరూ లేరా? "

"మనుషులెవరూ వుండలేరు. బారామాసీ మహరాజ్ మాత్రం వుంటారు"

"ఆయనెవరు? "

"బారామాసి అంటే పన్నెండు నెలలు కదా. ఏడాదిలో పన్నెండు నెలలూ అక్కడే నివసిస్తారాయన. కంబల్ లేదు, కపడా లేదు. ఒక్క లంగోటి మాత్రం కట్టుకుని తిరుగుతారు. సుమేరు పర్వతంమీదకి వెళ్ళి వస్తూంటారాయన. ఇంకెవరూ అలా వెళ్ళ లేరు."

"ఇప్పుడు కేదార్‌లోనే వుంటారా? లేక ఇంకెక్కడికైనా వెళ్ళివుంటారా? "

"పేరే బారామాసి. కిందకి దిగేప్రశ్న అసలు లేదు. ఇష్టమైతే పైకి వెళ్తారు. లేక పోతే అక్కడే పగలూ, రాత్రి కూర్చునివుంటారు. పగలు ఎండలో కూర్చుంటారు. రాత్రి మంటపంలో కూర్చుంటారు"

అతను రాత్రికి ఆ పల్లెలో వుండిపోయాడు. ఈ వివరాలన్నీ చెప్పిన గృహస్తే రాత్రి రొట్టె కూడా పుట్టించాడు. పైన మంచు భయంకరంగా కురుస్తోందని అతనే చెప్పాడు. ఇక్కడే ఇంట్లో ఎముకలు కొరికి వణికించేలాటి చలి వుంది. కాని సన్యాసికి అది అలవాటయిపోయింది. రాత్రి పడుకున్నాక ఒక ఆలోచన వచ్చింది. రేపు పొద్దున్నే ఇక్కడ్నుంచి బయల్దేరి పైకి వెళ్ళాలి. బారామసి మహరాజ్ దర్శనం లభిస్తే అదృష్టమే మరి. ఇలాంటి మునులు హిమాలయాల్లో అక్కడక్కడున్నారు. కాని వాళ్ళు దొరకడం, వాళ్ళ శిష్యరికం లేదా మార్గదర్శనం దొరకడం అంత సులువు కాదు. వెళ్ళి తన అదృష్టాన్ని పరీక్షించుకోవాలి.

పొద్దున్నే లేచి తన జోలిని, కంబళిని భుజానికి తగిలించుకుని ఎక్కసాగాడు. ఎక్కుతూ వూరి చివరకి చేరేసరికి కుడివేపున ఆకాశం ఎత్తున లేస్తున్నట్టుగా పొగ కనిపించింది. పరిశీలనగా చూశాడు. నిప్పేమీ లేదు. దగ్గర్లో వున్న మెట్లు దిగి చూశాడు. సాధారణమైన వెడల్పున్న ఒక కొలను. దానిలోకి ఒక పక్కనుంచి మరుగుతున్న నీళ్లు కురుస్తున్నాయి. చుట్టూ వాతావరణం చూస్తే గడ్డకట్టించే చలి. తెల్లటి మంచు. ఈ మధ్యలో ఉష్ణకుండం. నిన్న



వాళ్ళు చెప్పిన గౌరీమాత స్నానాలకుండం ఇదే కావచ్చు

అంతలో అక్కడకి ఎవరో స్నానానికి వచ్చారు. కుండం పక్కనే కూర్చుని చెంబుతో నీళ్లు ముంచుకుని ఒంటిమీద



పోసుకున్నాడు. సన్యాసి కూడా కిందికి దిగి చెయ్యిపెట్టి చూశాడు. నీళ్లు వేడిగా కాలుతున్నాయి. తనూ స్నానం చేద్దామా అనుకున్నాడు. కాని వేడినీళ్ళ మోహం వద్దనుకున్నానుకదా అన్న స్పృహ హెచ్చరించి మళ్ళీ

పైకి వచ్చేశాడు. కుడివేపు ఒకనది పెరుగులా చిక్కగా ప్రవహిస్తోంది. పూర్తిగా కదగని మంచుపైనుంచి చిక్కగా కిందకి దిగుతోంది. ఉష్ణకుండంనిండి బయటికి ధారగా ప్రవహించే చోటికి చేరే సన్నటి ప్రవాహం మాత్రం కరిగి తేటగా సాగిపోతోంది. అతను మంచునీళ్ళతోనే స్నానంచేసి మళ్ళీ ఎక్కడం ప్రారంభించాడు.

కొంచెం సేపటికే ఆయాసంగా అనిపించింది. ఇంత ఎత్తు ఏకబిగిన ఇంతకుముందెప్పుడూ ఎక్కలేదు. పదడుగులు వేసేసరికి ఒక నిమిషం ఆగి ఊపిరి తీసుకుని మళ్ళీ ముందుకి సాగిపోవాలి. మూడు గంటలసేపు ఎక్కాక ఒక పల్లె కనుపించింది. పేరు కనుక్కుందామంటే ఎవరూ కంటపడలేదు. కాని ఊరికిముందే 'రామ్ బడా' అనే పాత బోర్డొకటి కనిపించింది. మెట్లమీదికెక్కి చూశాడు. కొంతసేపటికే రెండువేపులా మంచు కనిపించింది. ప్రతిచోట తెల్లటి పిండిలాగా తను ఎక్కుతున్న కొండమీదంతా మంచుపడివుంది. ఇంకొద్దిసేపటికి

తను ఎక్కుతున్న మెట్లమీద కూడా మంచు కురవసాగింది. ఊపిరాడటం ఇంకొంచెం కష్టమైంది. ఇంత నిటారైన కొండని ఏకబిగిన అతనెప్పుడూ ఎక్కలేదు. ఈరోజు ఎలాగైనాసరే పైకి చేరాలనే తపన లోపల చాలా బలంగా వుంది. గౌరీకుండం దగ్గర వాళ్లు చెప్పిన బారామాసి సన్యాసినెలాగైనా చూసితీరాలి. ఆయన తనకో దారి చూపించగలడు. ఆయన తనకి మార్గదర్శకులైతే అది తన సౌభాగ్యం. నిజమైన ఏకాంతాన్ని, ఏకాగ్రతని సాధించిన వ్యక్తి ఆయనే అనే విశ్వాసం మనసులో గట్టిగా కలుగసాగింది. అలవాటు లేనివాళ్లు ఈ కాలంలో పైకి వెళ్తే వాళ్లు ఈ చలిలో బతకలేరు, బతకరు అని గౌరికుండంలో గృహస్థు చెప్పినా అతనిప్పుడు పైకి, పైపైకి ఎక్కి వెళ్తున్నాడు. తను మరణించినా బాధేమీ లేదన్న ఉదాసీనతే ధైర్యాన్ని చెదరనీయకుండా కాపాడుతోంది.

అలా ఏకబిగిన ఎక్కసాగిన కొద్దిసేపటికి ఎక్కడ చూసినా మంచు. దట్టమైన మంచు పానుపు. ఆకాశంలో ఎండ వుంది. దాని వెలుగుకి కళ్లు మిరుమిట్లయి, మబ్బు కమ్మేలాంటి కాంతితో తెల్లని మంచు ఒక్కటే కనుపిస్తోంది. తను పైకి ఎక్కవలసిన దారి కూడా స్పష్టంగా తెలియటంలేదు. అంచనా వేసుకుని పర్వతం యొక్క నడుమభాగం, తరువాత హృదయభాగం ఇల్లా చెక్కిన దారుల గుర్తులు చూసుకుని ఎక్కుతున్నాడు. కాలు పెడితే మంచు పరపరమని శబ్దం చేస్తోంది.

దీని ఎత్తుకి ఎక్కడా కొన అన్నది కనపడ్డంలేదు. ఊపిరి ఇంకా భారమైపోతోంది. నుంచుని ఎన్నిసార్లు శ్వాస తీసుకుని వదిలినా సరిపోవడంలేదు. ప్రాణవాయువునెవరో దోచుకుపోతున్నంత కష్టంగా వుంది. తన సంకల్ప శక్తినంతటినీ కూడగట్టుకుని గత రెండున్నర సంవత్సరాల సాధనని గుర్తు తెచ్చుకుని అతను చుట్టు తిరిగి ఎక్కే దారిలో ఎక్కుతూనే వున్నాడు.

కొద్దిసేపటికి ఎక్కడం పూర్తయినట్టే అనిపిస్తోంది. ఒకింత దూరం చక్కటిదారి. రెండువేపుల కొండల వరుసలు. ఈ తీరైన ప్రదేశంలో ఏది దారో, ఏది కాదో తేడానే

తెలియకుండా ఇబ్బంది పెట్టింది. అదంతా ఒక గట్టి అచ్చులా తయారయింది. ముందుకి నడిచేకొద్దీ స్పష్టంగా ఇది కనప డుతుంది. కొన్ని ఇళ్లు. వాటి చివర నిటా రుగా వున్న అడ్డంగా గీసిన త్రికోణాకారంలో వున్న ముంభాగంతో ఒక కట్టడం, దాని వెనుకభాగంలో ఒక శిఖరం, దాని వెనుక ఆకాశంలోకి చొచ్చుకొని లేచి, మబ్బుల్లోకి మాయమైన తెల్లని పర్వతశిఖరం. అన్ని కట్టడాలు మంచు ముసుగుభారాన్ని భరిం చలేక కూలి మోకరిస్తున్నట్టుగా కనిపించసా గింది. ఇదే కేదారం అని ఖాయం అయింది. ఔను, ఇక్కడే నేనుండాల్సింది. బారామాసి మహారాజ్‌ని చూడవల్సింది.

తెల్లని గాజులాంటి ఈ హిమవత్పర్వతం మీద అతను అంచనా వేసిన దూరం తప్పు యింది. అది కాస్త కూస్త దూరం కాదు. నడిచి, నడిచి చేరాల్సిన దూరం. ముందుకి ఎంత దూరం నడిచినా దొరకదు. దగ్గరకొచ్చినట్టే అనిపిస్తుంది.

చిట్టచివరకెలాగో చేరాడు. ముందు ఒక వంతెనలాంటిది కనపడింది. దానిపైన నడచివెళ్ళాలి. కింద ఎక్కడో నది ప్రవహిస్తూ వుండివుంటుంది. వేసవిలో నదిగా ప్రవ హించే నీరు ఇప్పుడు గడ్డకట్టి నిలిచిపోయిం దని స్పష్టంగా తెలుస్తోంది. ముందు ఊళ్ళోకి నడిచాడు. ఊపిరి చాలా బరువుగా ఆడుతోంది. ఇంక ఊపిరి శ్వాసకోశాల్లో వుండలేనంటూ మాటిమాటికీ బయటకొచ్చేస్తోంది. ఎందుకింత అలసటగా అనిపిస్తోంది? నీరసం కేవలం అలసటవల్లనా? లేక తన అంత్యదశ సమీపిస్తోందా? ఇక్కడకి ఎలాగో రాగలిగాను. ఇక ఆ మునిని వెదకటం ఎలాగా? ఆయన దొరుకుతారో లేదో. దేవాలయం దగ్గరకి వెళ్ళి చూడాలేమో అనుకుని ముందుకి అడుగులు వేయ సాగాడు. ముక్కు శోణాలను వెడల్పుచేసి, నోటిని బాగా తెరచి ఊపిరి తీసుకుంటూ కొలిమితిత్తి శబ్దం చేస్తున్నట్టుగా రొప్పు కుంటూ ముందుకి సాగిపోయాడు.

ఓ! సంభ్రమం కలగడం ప్రారంభమ యింది.

దేవస్థానం ముంభాగంలో ఒక సన్యాసి మహారాజ్ కూర్చున్నారు. ఆయన శరీరం పూర్తి నగ్నంగా వుంది. ఒక లంగోటి కూడా లేదు. జటాజుటాలమీద మంచు ముత్యాల పూసల్లా పడివున్నాయి. కూర్చున్న భంగిమ చూస్తే ధ్యానంలో వున్నట్టుగా కనపడ్డం లేదు. కాని తనవంక చూడటంలేదు కూడా.

ఆయన ధ్యాసని తనవేపు మళ్ళించాలి. లేకపోతే తను ఇకముందుకి ఒక్క అడుగు కూడా వెయ్యలేడు. ఊపిరికోసం తెరచిన నోటితో మహారాజ్ అని గట్టిగా అరిచాడు.

తనలోని శక్తి అంతమైపోయింది. అలాగే కూలబడిపోయాడు.

★ ★ ★

స్పృహ వచ్చేసరికి ఒక చిన్న రాతి కట్టడంలో నులకమంచంమీద పడుకున్నాడు. ఒంటిమీద మూడు రజాయిల భారం వుంది. దగ్గర్లో ఒక రాతిబొగ్గుల కుంపటి వెలుగుతోంది. దానిమీద ఒక ఇత్తడిపాత్రలో ఏడెనిమిది బంగాళదుంపలు ఉడుకుతున్నాయి. దాని పక్కనే కూర్చున్న ఓ సన్యాసి. ఇతను కళ్లు విప్పార్చి చూశాడు. 'ఇంత' అని చెప్పడానికి వీలుకాని వయసు. ఏభై, అరవైయేళ్ళపైనే వుంటుందని చెప్పొచ్చు. ఒంటిమీద ఒక్క వస్త్రం కూడా లేదు. ఒక లంగోటి మాత్రం కట్టుకుని వున్నారు. అప్పుడే అభ్యంగన స్నానం చేసి వచ్చి ఒళ్లు తుడుచుకున్నట్టుగా వున్న మృదువైన, కాంతివంతమైన చర్మం.

ఆయనే పలుకరించారు. "ఈ శీతాకాలంలో ఎందుకు వచ్చావు? మందిరం తలుపులు మూసి పదిహేనురోజులపైనే అయింది"




"గౌరీకుండంలో చెప్పారా సంగతి. బారా మాసి మహారాజ్ అంటే మీరేనా? "

"జనం అలాగంటారు మరి"

అతను లేచి కూర్చున్నాడు. ఇంకా నీరసం గానే వుంది. రొప్పు వస్తోంది.

"దమ్ కష్టమవుతోందా? "

"ఊం... ఎందుకిలా అవుతోందో అర్థం కావటంలేదు. చచ్చిపోతానేమో అనిపిస్తోంది"

"ఒక్క పట్టులో పైకెక్కితే ఇలాగవుతుంది. అదీకాక అలవాటుపడేవరకు అందరికీ ఇంతే. నువ్వెప్పుడూ పైకి రాలేదా? "

"ఇదే మొదలు"

"ఎందుకొచ్చావు? "

"నా చరిత్రంతా చెబుతాను, మీరు వినాలి"

"ఇప్పుడు వెంటనే ఏమీ మాట్లాడవద్దు. కాస్తంత ఏమైనా తింటే మంచిది. ఉడికించిన ఆలూ వున్నాయి. ఉప్పు తప్ప ఇక్కడింకే మసాల వుండదు. తినగలవా? "

"ఉప్పు కూడా లేకుండా తినడం అలవాటయింది"

ఆయనేమీ తీసుకోలేదు. ఎనిమిది దుంపలూ అతనే తిన్నాడు. కొద్దిగా శక్తి చేకూరినట్టయింది. తరువాత కూర్చుని తన కథలోని ముఖ్య అంశాలను చెప్పి, హృషీకేశ్‌నుంచి ఇక్కడకి వచ్చేవరకు అయిన తన అనుభవాలను వివరించాడు. ఆయనడిగారు "నీ ఉద్దేశం ఏమిటి? మూడు సంవత్సరాలు అయ్యాక, ఈ శీతాకాలం ముగిసాక నీ గురువుని చూడటం. ఇంకా ఐదు నెలలు ఈ హిమవత్పర్వతాల మధ్యనుంటావా? చలిలేని చోటు చూసుకుని కిందెక్కడన్నా వుండు"

"తమని చూసి, తమతోబాటు వుండాలని నా కోరిక"

"అలాగ అప్పుడప్పుడు గురువులని మార్చవద్దు"

"నేనిక్కడుంటే మీకేమన్నా అభ్యంతరమా? "

"ఈ విశాల జగత్తులో ఎవరెక్కడున్నా ఆక్షేపణ తెలిపే అధికారం ఎవరికీలేదు. ఉండితీరాలనిపిస్తే ఉండు. ఈ వాతావరణానికి ఎంత మటుకు సర్దుకోగలవో నీకే తెలుసు. ఈ చిన్న ఇంటిని నాకోసమని ఎవరో కట్టించి ఇచ్చారు. ఆ ఎదురుగా వున్న గది చూడు. అరమూట ఆలూ, ఆరేడు మూటల బొగ్గులు, కిరసనాయిలు డబ్బా అన్నీ వున్నాయి. ఒద్దు ఒద్దన్నా ఎండాకాలంలో జనం తెచ్చిపెడతారు. రోజుకొక పచ్చి ఆలూ చాలు నాకు. బొగ్గులు, రజాయి, ఉప్పు, ఈ ఇల్లు, నాకేదీ అవసరం లేదు. నీకు కావాలంటే ఇవన్నీ వాడుకో, ఇక్కడే వుండు. నేను బయట గడిపేస్తాను"

"రాత్రుళ్ళు? "

"నిద్రవస్తే ఎక్కడో అక్కడ పడుకుంటాను. మంచుమీదో, మందిరపు అరుగు మీదో! ఎక్కడో అక్కడ. నువ్వొచ్చావు కదా అని ఈ ఇంటి తలుపు తీసి మంచంవేసి పడుకోబెట్టాను. రోజుకొక్కసారి మాత్రం లోపలికొచ్చి ఒక్క దుంప తీసుకుని వెళ్ళిపోతాను. నీకొక విషయం ఇప్పుడే చెబుతాను. నేనిక్కడే వుంటాను. ఇష్టమైనప్పుడు పైకి వెళ్ళి కొన్నాళ్ళుండి వస్తాను. ఇక్కడున్నా నేను నీతో మాట్లాడను. మందిరం తలుపులు మూసేశాక మళ్ళీ శీతాకాలం గడిచి కిందనుంచి అర్చకులు వచ్చి తలుపులు తీసే వరకు నేను ఎవరితోనూ మాట్లాడను. మాట్లాడకుండా నీ కష్టసుఖాలు విచారించడం ఎలా? మరొకమాట చెబుతున్నాను విను. ఉండాలనిపించితే వుండు. వెళ్ళిపోదామనిపిస్తే వెళ్ళిపో. మధ్యలో వెళ్ళిపో



వాలనిపించినా, దిగి వెళ్ళిపో. నాకు చెప్పాల్సిన అవసరం కూడా లేదు. దారిలో వాడుకోడానికి ఏ సామాను, ఏ వస్తువు కావాలన్నా పట్టికెళ్ళు. ఇక్కడున్న ఏ వస్తువూ నాదికాదు"

"నేనుండటంవల్ల మీకు ఏవిధమైన ఇబ్బందీ లేదా? "

"సంవత్సరంలో నాలుగైదు నెలలు యాత్రికులు వస్తూనే వుంటారు. మనుషులుంటే నాకేవిధమైన ఇబ్బందీలేదు. ఊరికే మాట్లాడించకుండా వుంటేసరి. అలా ఎవరూ అంతగా మాట్లాడించరు కూడా.

"నువ్వు కావాలంటే వుండు. ఎక్కడ కావాలన్నా తిరుగు. నేను దగ్గరే వున్నా, ఎదురుగానే వున్నా దేనికీ మాట్లాడించకు. నువ్వు ఇక్కడున్నావా లేవా అనేది నాకిక సంబంధంలేదు. నీ ఉనికితో నాకు ప్రమేయం లేదు. నా ఉనికితో నీకూ ప్రమేయం ఉండకూడదు"

"ఒంటరితనం నాకు అలవాటే. దానిలో పూర్తి ఏకాగ్రతని సాధించాలని, కావాలనే నేను సన్యాసం తీసుకున్నాను"

"అయితే బయటకిరా. స్థలాల పరిచయం చేస్తాను. లేచి నడవగలవా? "

"ఇప్పుడు కొంచెం నయమే. ఆయాసం ఘటుకు ఇంకా వస్తూనే వుంది"

"మూడు నాలుగు రోజుల్లో సర్దుకుంటుంది"

అతను ఆయస్తోపాటు బయటకొచ్చాడు. ఆయనే అన్నారు, "అలవాటు లేనివాళ్ళు ఉట్టి కంబళితో రాకూడదు. ఒక రజాయి తీసి కప్పుకో. చూడు, ఆ గదిలో ఒక జత రబ్బరు బూట్లున్నాయి. వాడుకో. నీ కాళ్ళు అప్పుడే పగిలి రక్తాలొస్తున్నాయి"

ఆయన మాత్రం కేవలం కౌపీనధారియై నడిచాడు. అంతలో హిమపాతం మొదలయింది. తెల్లటి కాగితపు తుంపులని ఆకాశంలోంచి బుట్టలతో దిమ్మరిస్తున్నట్టుగా కనిపిస్తోంది. ఎక్కడ చూసినా తెలుపు. కొండలని కప్పివేసింది మంచు. కాళ్ళకింద పరచుకుంది మంచు. ఆకాశంనుంచి కురుస్తున్న, దుంకుతున్న మంచు తునకలతో ఆకాశం ఎక్కడుందో కనపడటమే లేదు. అంతా అచ్చంగా తెల్లని మంచు. పైన చూసినా మంచే, కింద చూసినా మంచే. తెలుపు... తెలుపు... తెలుపు... ఎట్నుంచీ సూర్యుడి వేడి, ఎండ జాడలేదు గనుక ఆ తెలుపు రిఫ్లెక్షన్ కళ్లల్లో చురుక్కుమనిపించడంలేదు. మందంగా ఆహ్లాదకరంగానే వుంది.

ఇద్దరూ మందిరం యొక్క వెనుక భాగాన వున్న బయలు... మంచు మైదానంలోకి వచ్చారు. ఆయన కొంచెం ఎడమ పక్కకి తిరిగి చూపించారు. "అక్కడ కొంచెం పల్లంగా వుంది చూడు. అదే మందాకినీ నది. ఇప్పుడు గడ్డకట్టిపోయింది. అడుగునేమన్నా కాస్త కరగి ప్రవహిస్తోందేమో తెలియదు. ఇంకో పదిహేను రోజుల్లో ఆ కాస్త పల్లం కూడా మంచుతో నిండిపోయి పైనున్న దిబ్బతో సమానమట్టానికి వచ్చేస్తుంది"

అతని మనసులో ఒక ప్రశ్న పుట్టింది. అడిగాడు. "నీరు ప్రవహించనప్పుడు కూడా దానిని నది అనొచ్చా? "

"లేదు... అది కేవలం అలవాటుకొద్దీ పిలిచే సంకేతం. ప్రవహిస్తేనే నది. గడ్డకడితే కాదు" అని కుడివేపు తిరిగి చూపించారు. "ఇదే సుమేరు పర్వతం. దీని హృదయస్థానంలో కేదార మందిరం ఉంది. మందిరం దాటి ఇంకా పైకి ఎక్కితేనే సుమేరు పర్వతాన్ని చేరగలిగేది"

"తమరు దాన్ని కూడా దాటి వెళ్లారని గౌరీ కుండంలో చెప్పారు"

"జనం గోరంత వుంటే కొండంత చేసి





చెప్తారు"

"నేను ఎక్కడానికి ప్రయత్నించనా? "

"పర్వతాలెక్కేవాళ్ళు ప్రాణవాయువు, రబ్బరు కవచాలు, తొడుగులు... ఇంకా ఏవేవో క్షేమంగా వుంచే సాధనాలు కూడా తెచ్చుకుంటారు. లేకపోతే చచ్చిపోతారు. అవన్నీ లేకుండా నువ్వెక్కలేవు. ఇక్కడే ఎంత వేగంగా రొప్పు వస్తోందో చూడు. సాధ్యం కానిదాన్ని ప్రయత్నించాలని చూస్తే ప్రాణాపాయం కలుగుతుంది. తెలిసి కూడా ప్రాణాపాయం కొని తెచ్చుకుంటే ఆత్మహత్యాపాపం వస్తుంది. నీ రజాయిమీదంతా మంచు అతుక్కుపోయింది. ఇక్కడ దుల పద్దు. ఇంటికి వెళ్ళి దులుపుకోవచ్చు పద"

ఆయన తల, గడ్డం, గుండెలమీద, జుట్టు మీద మంచు తునకలు గుంపుగా పడి వున్నాయి. భుజం, వీపు మీదపడ్డవి మాత్రం శరీరోష్ణానికి కరగి ఎక్కువసేపు నిలవకుండా కిందకి పడిపోతున్నాయి. ఇద్దరూ నడచి ఇంటికి వచ్చారు. తలుపుతీసి లోపలకి వెళ్తే అక్కడ వెచ్చగా వుంది. బొగ్గులకుంపటి ఇంకా ఆరిపోలేదు. "నువ్వు మంచంమీద కూర్చో. మరో రజాయి కప్పుకో" అన్నారాయన. ఆయన నేలమీదే కూర్చున్నారు. అతను మొహమాటంకొద్దీ నుంచునే వున్నాడు. ఆయన "కావి ధరించి ఇంకా రెండున్నర సంవత్సరాలే అయిందంటున్నావు. లోతుకెళ్ళేకొద్దీ అర్థమవుతుంది. పైన, కింద అనే తేడాలు అసత్యం అని. నేల చల్లదనం నీ శరీరానికింకా పడదు. అందుకే మంచం. నాకు శీతోష్ణాల వ్యత్యాసమూ లేదు. ఆసనం యొక్క అగత్యమూ లేదు"

అతనికొక ప్రశ్న గుర్తొచ్చింది. అది గత రెండున్నరేళ్ళుగా తలలో దొలుస్తూనే వుంది. కాని ఆ సందేహాన్ని తీర్చడానికి సరి అయిన వాళ్ళు దొరక్క, తనలోనే ఆలోచిస్తూ ఉంచుకున్నాడు. ఇప్పుడడిగాడు. "మహారాజ్, తపస్సు చేయడానికొచ్చేవాళ్ళు గడ్డకట్టించే ఈ చలిలోకే ఎందుకొచ్చి చేస్తారు? "

"గడ్డకట్టడానికే" అని క్లుప్తంగా జవాబు చెప్పి, "సరే, నువ్వడగాల్సినవన్నీ అయినట్టేగా? "

వెంటనే ఇంకే ప్రశ్న అతనికి తోచలేదు. వసతి, ఆహారం, మంచం, రజాయిలు అన్నీ ఆయనే అమర్చారు. ఇంక అవేమీ అడిగే పనేలేదు. ఆయన గురించే అడగాలి, "మహారాజ్ మీరిక్కడ ఏ ధ్యేయంతో వుంటున్నారు? "

"ఏమీలేదు... ఊరికే నా మానాన నేనున్నానంతే"

తన గురించేదన్నా చెప్పడం ఆయనకిష్టం లేదని అర్థమయింది. "నేను బయటకి వెళ్తానిక. ఇంక మాట్లాడవద్దు" అనేసారాయన.

తన మాటల్లోని శక్తినంతా ఆయన లాగేసుకున్నట్టు అనిపించిందతనికి. ఊరికే కూర్చుండిపోయాడలా. ఆయన లేచి బయటకి వెళ్ళిపోయారు. పూర్తిగా సంజెవేళ కాకపోయినా మసకచీకట్లు కమ్మాయి. ఎక్కడ చూసినా, ఇంటి కప్పుమీద, గడ్డకట్టిన మంచు ఆకాశంలోంచి రాలిపడుతూ టపటపమని శబ్దంచేస్తోంది. ఇంటినుంచి మూడు బారల దూరం నడిచి వెళ్ళిన తరువాత ఆయన తన కౌపీనాన్ని తీసి పారేసారు. ఆ తరువాత కౌపీన ధారణకి అనువుగా వాడుకునే మొలతాడు వంటి పేలికని కూడా పీకి పారేసారు. భయంకర చలిలో, తీవ్ర హిమపాతంలో ఏ పక్కకి వెళ్ళారో, ఎక్కడెక్కడ తిరిగి వుంటారో ఇతనికి తెలియదు.

★ ★ ★

రెండు రోజులపాటు ఏమీచేయలేదు. రోజుకి నాలుగు చొప్పున బంగాళదుంపల్ని ఉడికించుకు తిని, చలిగాలి లోపలకి చొరబడకుండా తలుపు బిగించుకుని, మూడు

రజాయిలూ కప్పుకుని పడుకునేవాడు. పగలు, రాత్రి ఒకటే నిద్ర. నాలుగవరోజు కాస్త ారుకుగా అనిపించింది. దమ్ము నిల బడి ఊపిరి సరిగ్గా ఆడసాగింది. చేతిలోకి దండం తీసుకుని బయటకి నడిచాడు. హిమపాతం లేదు. పీఠభూముల్లో సూర్యో దయమయిన మూడు గంటల తరువాత అక్కడ సూర్యదర్శనమయ్యేది. ఎండలో ఎంతమాత్రం వేడి వుండేది కాదు. కాని, పర్వత శ్రేణులన్నీ వెలుగుతున్న వెండి కొండలా మెరిసిపోయేవి.

కాళ్ళకి రబ్బరు బూట్లు వేసుకుని, రజాయి కప్పుకుని, తలుపు దగ్గరగా మూసి అతను బయటకి వెళ్ళాడు. గత మూడు రోజులుగా మంచు చాలా మట్టమే పెరి గింది. మందాకినీ నదీ ప్రాంతం అని చెప్ప డానికి వీలుగా వున్న ప్రదేశం చాలావరకు మూసుకుపోయింది. ఇళ్ళమీద పెంకులా కట్టిన తెలుపు మందంగా మెరుస్తోంది. అడుగు వేస్తే పల్చటి గాజు పెంకులు ముక్కలైనట్టుగా కరకరమని, పళక్‌పళక్ మని శబ్దం వస్తోంది.

రెండుమూడు గంటలసేపు తిరిగాక మందిరపు వెనుకభాగానికి వెళ్ళాడు. సుమేరు పర్వత పాదభాగాన్ని చేరాడు. ఎక్కాలనిపించింది. దండాన్ని ఊతంగా చేసుకుని నూరు అడుగులు ఎక్కాడు. అక్క డికే చాలా ఆయాసంగా అనిపించింది. ఊపిరాడటం కష్టమయిపోయింది. దానితో ఇక దిగిపోయాడు. ఇంటికి తిరిగి వచ్చేస్తూ ఎడమపక్కకి తిరిగి చూసాడు. బారామాసి మహారాజ్ మంచు కప్పబడ్డ ఒక బండ మీద సూర్యాభిముఖంగా కూర్చున్నారు. ఆయన శరీరం పూర్తిగా నగ్నంగా వుంది. సరళమైన ఆసనంలో ధ్యానం చేస్తున్నారో, సూర్యుని దర్శిస్తున్నారో అర్థంకాలేదు. కళ్ళు మూసుకున్నారో, తెరచుకుని వున్నారో కనప డ్డంలేదు. ఆయన ముందుకి వెళ్ళి చూస్తే తెలుస్తుందిగాని, అలా వెళ్ళి ఆయన దృష్టిలో పడటంగాని, ఆయన ధ్యానాన్ని భంగం చేయడానికిగాని భయంవేసింది. ఒక గంటపైనే అలా నుంచున్నాడు. ఆయన శరీరం కాస్తంత కూడా కదలలేదు. ఊపిరాడేటప్పుడు శరీరంలో కలిగే సూక్ష్మ ప్రకంపనం కూడా కనపడటంలేదు. ధ్యానంలో వుండి వుంటారని భావించి ఇంటికి మరలాడు.

తను ఇక్కడికొచ్చి నాలుగు రోజుల యింది. ఇప్పటికి గాలి వాతావరణం తనకి అలవాటయింది. అన్ని సౌకర్యాలు అమ రాయి. అడవిలో గుడిసె వేసుకుని ఉండ టంకన్న ఈ ఇల్లు ఎంతో సౌకర్యంగా వుంది. చలి ఒకటే భరించడం కష్టం. ఆహారం కూడా ఉత్తమమైనదే. తనూ ధ్యానం చేసుకోడం మొదలుపెట్టాలి. తన సలు ఇక్కడికొచ్చింది ఎందుకట? అని ఆలోచించి తలుపు మూసి మంచంమీద కూర్చుని వీపుకి రజాయి కప్పుకుని మన సుని అదుపు చేసుకున్నాడు. రెండు గంట లసేపు పెనుగులాడినా ఏకాగ్రత కుదర లేదు. అంతటా నిశ్శబ్దం. మృతనిశ్శబ్దం. ప్రచోదన అన్నది లేనట్టుగా చెవి దమ్మెలు నిష్క్రియగా ఉండిపోయాయి. ఇదివరకు గుడిసెలు కట్టుకుని ధ్యానం చేస్తూ వుండిన అడవుల్లో నీటిగలగల, పక్షుల జిలిబిలి, ఆకుల రెపరెపలు, ఏమీలేకపోతే భ్రమరాల ఝుం...ఝుంలో ఏదో ఒక శబ్దం... వీటి నేపథ్యంలో ఏకాగ్రత కుదిరేది. ఒకసారి మనసు ఏకాగ్రమైతే తరువాత అదే స్థితిలో నిలవడం కష్టమయ్యేదికాదు. తరచు రైల్లో ప్రయాణం చేసి, రైల్లోనే నిద్రపోయే అలవా టున్న వాడికి ఇంట్లో ప్రశాంతంగా వుంటే నిద్రపట్టనట్టుగా వుంది తన పరిస్థితి.

అర్థమయింది. తన లోపలి నిశ్శబ్దానికి బయటి శబ్దాలు సహాయపడాలి. ఆ స్థాయిలో తన అంతరంగం స్వతంత్రంగా





వ్యవహరించలేదు. తను ఇక్కడకి రావడమే మంచిదయింది. అంతరంగం స్వతంత్రమవ గలిగే సాధనకి శబ్దం కరడుగట్టిన, మౌనం నెలకొన్న ఈ స్థలమే సరి. ఈ ఆలోచన లోనే మనసు లీనమైపోయింది. ధ్యానం దూరంగానే వుండిపోయింది.

కొంచెంసేపటికి బయట కరకర శబ్దం వినిపించింది. ఎవరో నడుస్తున్న శబ్దం. ఇటువేపే వస్తున్నారు. తలుపు తెరచు కుంది. బారామాసీ మహారాజ్ లోపలకి వచ్చారు. లోపల ఇతను కూర్చున్న విష యంతో తమకే సంబంధంలేనట్టుగా, లోపలి గదిలోకి వెళ్ళి ఒక పచ్చి ఆలుగడ్డ తీసుకుని, ఎలా వచ్చారో అలాగే తలుపు మూసేసి బయటకి వెళ్ళిపోయారు. పూర్తి నగ్నంగానే వున్నారు. అయినా కొంచెం కూడా సంకోచపడలేదు.

ఆయనెటు వెళ్ళారో చూడాలని కుతూ హలం కలిగింది. తలుపు తీసుకుని బయ టకి వచ్చి చూశాడు. మందిరం వెనుకభా గాన ఒక అరుగుమీద మంచుమీద కూర్చుని బంగాళ దుంప తింటున్నారు. కొద్దిసేపట్లో లేచి నుంచుని ముందుకి నడి చారు. చేతిలో దండం వుంది. శరీరం నగ్నంగానే వుంది. ముందుకి నడచి సుమేరు పర్వతాన్ని ఎక్కడం ప్రారంభిం చారు. అతను అలా చూస్తూ నుంచుండిపో యాడు.

ఆయన నిదానంగా ఎక్కడం కనుపిం చింది. మధ్యలో ఎక్కడా ఆగలేదు. ఆయా సపడ్డట్టు, అలసినట్టు కనపడలేదు. తన మానాన తను తిన్నగా ఎక్కి వెళ్ళిపో యారు. అటుఇటు తిరిగి చూడలేదు. అతను చూస్తుండగానే సుమారు నూరడు గులు ఎక్కారు. రెండువందల అడుగుల పైన కూడా ఎక్కారు. ఆయన జటాజూ టాలు తెల్లగా కనుపిస్తున్నాయి. శరీరపు గోధుమవర్ణం మంచు వెలుగుపడి తెల్లగానే మెరుస్తోంది. కొంతసేపటికి ఆయన శరీరం కనపడలేదు. ఇంకా ఎక్కుతూ వుండి వుండొచ్చు సుమేరు పర్వతాన్ని కూడా దాటి ముందుకి కూడా వెళ్ళొచ్చు ఇక్కడకి మళ్ళీ ఎప్పుడొస్తారో ఏమో. ఎన్నో రోజులు తను ఇక్కడుండనని చెప్పిన సంగతి గుర్తొ చ్చింది. ఈ నిశ్శబ్దంలో తను ఒక్కడే... ఒక చిన్న వాగు ప్రవహించే శబ్దంవున్నా బాగుం డును కదా అనుకున్నాడు. కాని ఎత్తైన కొండలమీద ప్రతీది గడ్డకట్టేస్తుంది. శబ్దం, ఇంద్రియాలు, మాట, మనసు అన్నీ జడమై పోయి అచలమైపోతాయి. తన శబ్దం, మాటలు కరడుగట్టిపోయాయి. మనసు మాత్రం సంచరిస్తూనే వుంది. దాన్ని అదు పులో పెట్టడమే కష్టంగా వుంది.

ఆయన నిర్వస్త్రంగా ఎందుకున్నారు? అనే ప్రశ్న తలలోపుట్టింది. తను ఇక్కడకి వచ్చి నప్పుడు ఆయన నిర్వస్త్రంగానే వున్నారు. తనకి సేవలుచేసి, తనతో మాటలాడినంత సేపు కౌపీన ధారిగానే వున్నారు. కాని తనింకేమీ మాట్లాడనని చెప్పి ఇంటినుండి బయటకి వెళ్ళిపోయిన తక్షణం దాన్ని లాగి పారేసి వెళ్ళిపోయారు. తానిక్కడే వున్న సంగతి ఆయనకి తెలుసు. అయినా నగ్నం గానే లోపలికొచ్చి బంగాళదుంపలు తీసు కుని బయటకి వెళ్ళారు. కొంచెం కూడా లజ్జాభావం లేదు. మందిరం తలుపులు తీసి ఇక్కడకి యాత్రికులు రావడం మొద లుపెట్టాక ఆయన మళ్ళీ కౌపీనం ధరించ వచ్చు నేనూ ఒక సన్యాసిని, సాధనలో వున్న వాడిని అని తెలుసుకుని, ఇక తానేమీ మాట్లాడబోవటంలేదని తెలిపిన తరువాత కౌపీనాన్ని తీసి పారేశారు. కట్టుకుని వుండి వుంటే మౌనంగా వున్నా నాతో మాట్లాడుతు న్నట్లుగా అనిపించేది. నా ఉనికిని గమనిం చినట్టయ్యేది. ఆయనే చెప్పారుగా ఏకాంతా నికి, ఏకాగ్రతకి ఎటువంటి భంగం వాటిల్ల కూడదని. నిజమైన ఏకాంతాన్ని సాధించిన



వ్యక్తి ఆయన. ఏకాంతం యొక్క పరమావధి సాధించి వుండచ్చు లేదా ఇంకా చేరుకోకపోయీ వుండవచ్చు. అయినా వారి ఏకాంత సాధన భూమ్మీద నివసించే జనసామాన్యానికి అవసరంలేనిది కావచ్చు. అలాగే ఆయన ఉన్నత స్థితికూడా వారు కోరుకోనిదే. పీఠభూమిని చూసి గర్వించే కొండకాదాయన. సమున్నత స్థితికి చేరి, భూమి ధ్యాసేలేని మహోన్నత శిఖరం ఆయన.

హైస్కూల్లో వుండగా ఒకసారి పిల్లలందరినీ శ్రావణ బెళగొళ ట్రిప్‌కి తీసికెళ్ళారు. కొండమీద ఎత్తుగా నిలబడ్డ గోమటేశ్వరుడి నగ్న దేహాన్ని చూసిన కుర్రాళ్ళు వాళ్ళల్లో వాళ్ళు తుంటరి, పోకిరీ మాటలాడుకున్నారు. వాళ్ల మాటల్లో తనూ చేరాడు. కాని ఇప్పుడు అర్థమైంది. గోమటేశ్వరునివంటి సిద్ధులు మాత్రమే జగమంతా చూస్తున్నా నగ్నంగా నిలబడగలరని. అదింకెవరికీ సాధ్యపడనిదనీను. బారామసీ మహారాజ్ కూడా అటువంటివారే. కాని ప్రజలెదురుగా కౌపీనం ఎందుకు ధరిస్తారు? ఆయన జైన సంప్రదాయం వారు కాదనా? లేక సామాన్య జనులని ఇబ్బందికరమైన సంకోచానికి గురిచెయ్యకూడదనా? మొత్తానికి తమకోసం మాత్రం కాదు.

ప్రజలకోసం వస్త్రాలు ధరిస్తే, ప్రజలు లేనప్పుడు నగ్నంగా ఎందుకుండకూడదు? ఈ ప్రశ్న తలెత్తగానే తనూ పూర్తి నగ్నంగా అయిపోవాలనే కోరిక పుట్టింది. మంచం దిగి, కప్పుకున్న రజాయి తీసిపారేసాడు. కట్టుకున్న కావితుండు కూడా విప్పేసి నగ్నంగా నుంచున్నాడు. బయటకి అలా వెళ్ళాలనిపించింది. చలిగా వుందని బెదరకుండా తలుపు తీసుకుని బయటకి వెళ్ళాడు. తెల్లని పర్వత శిఖరాలు, తెల్లగా హిమరాశితో మెరిసే భూమి, ఎదురుగా మందిరం, ఎడమపక్కగా మంచు ముసుగు ధరించి మౌనంగా నుంచున్న కొన్ని ఖాళీగా వున్న ఇళ్ళు. వీటన్నింటి ఎదురుగా అలా నగ్నంగా నుంచోడానికి అతనికి సిగ్గేసింది. వెంటనే ఇంట్లోకి వచ్చి విప్పిపారేసిన తుండుని చుట్టుకున్నాడు.

★ ★ ★

ఆ జడమౌనంలో మనసుకి ఏకాగ్రత కుదరనేలేదు. మళ్ళీ ఒకరోజు హిమపాతం మొదలయింది. ముందు హిమపాత శబ్దం నిదానంగా వినపడేది. తరువాత తొలకరి జల్లులు కురిసినట్టు దడదడమని మంచురాళ్ళు కురవసాగాయి. అతను ఏదో ప్రమాదంనుండి ఒదిగి కూర్చున్నట్టు నివసిస్తున్నాడక్కడ. ఇంటి కప్పుమీద ఆపకుండా రాళ్ళు రువ్వుతున్నట్టుగా శబ్దం. ఆ దెబ్బలకి ఇల్లు ఉంటుందా. పడిపోతుందా అన్న అనుమానం వచ్చింది. లోపలి భాగంలో అంతా గట్టి చెక్కపలకలతో కప్పు పరచి, పైన అంతే పకడ్బందీగా జింక్ షీట్ వేసిన కప్పుభాగం ఇలాంటి మంచు గడ్డల దాడిని తట్టుకోడానికి వీలుగానే కట్టారు. ఆ జింక్ షీట్ మీద అడుగుమందాన కట్టిన మంచు చప్టామీద పడే ఆ గడ్డలచప్పుడు చెవులు బద్దలకొట్టేలా వినవస్తోంది.

అతను బయటకి వెళ్ళలేదు. బయట తలపెట్టడం అంటే ప్రాణాపాయాన్ని కొనితెచ్చుకోడమే. తలుపు వేసి ఒంటినిండా రజాయి కప్పుకుని మంచంమీద పడుకుంటున్నాడు. ధ్యానం చేయాలనే ప్రయత్నం ఇంతవరకు విఫలమవుతూనే వుంది. ఇప్పుడు బయట శబ్దమవుతోంది కదా! ఇప్పుడైనా ప్రయత్నిద్దామని లేచి పద్మాసనం వేసుకూర్చున్నాడు. ఒంటిమీద రజాయి తీసేసాడు. బయట శబ్దం నేపథ్యంగా చేసుకుని దాన్నే గమనిస్తూ, చిత్తాన్ని ఏకాగ్రం చేయడానికి యత్నించాడు. మొదట విఫలమైనా తరువాత ఏకాగ్రత సాధ్యమయింది. ఆరోజు మూడు నాలుగు గంటలు ధ్యానం చేసాడు. ధ్యానం అయ్యాక, 'నేనీస్థాయికింకా





చేరుకోలేకపోయాను. నేనింత 'ఎత్తు' రాకుం డానే వుండాల్సింది. ఇప్పుడెలాగో వచ్చాను గనుక నా గడువుకాలం పూర్తిచేసుకుని కిందకి దిగి హృషీకేశానికి వెళ్ళిపోవాలి' అని అనిపించిందతనికి.

'నేనిక్కడికొచ్చి ఎన్ని రోజులయింది' అను కున్నాడు. లెక్కదొరకలేదు. అతను లెక్కపె ట్టుకోనూలేదు. ఇక్కడ సద్దులేదు. ఏ వ్యత్యాసమూ లేదు. ఎన్నో రోజులు రాత్రి, పగలు అన్నవ్యత్యాసం కూడా తెలియదు. వెన్నెలకి, ఎండకి అంతరం తెలియదు. వచ్చి చాలా రోజులయిందేమో అనిపిం చింది. నెలలు గడచిపోయినా పోయుం టుంది. ఖచ్చిత పరచుకోడానికి ఏ లెక్కా లేదు. పక్క గదిలో మొత్తం ఎన్ని బంగాళ దుంపలు ఖర్చయ్యాయో చూద్దామని వెళ్ళాడు. రోజుకి ఐదు లేక ఆరు ఉడికించు కుంటున్నాడు సరే. అసలు మొత్తం ఎన్నుం డేవో తెలిస్తే ఇప్పుడున్న లెక్కచూసి ఇంత ఖర్చయింది, ఇన్ని రోజులయి వుంటుంది అని గుణించుకోవచ్చు. కాని మొదట ఉన్న వెన్నో తెలియదు. ఆరు మూటల నిండా వుండేవి. తను ఏ మూట దొరికితే ఆ మూటలోంచి తీసేవాడు. కాబట్టి ఆవిధంగా లెక్కించడం అసాధ్యం.

ఈసారి మొదలయిన హిమపాతం చాలా రోజులవరకు ఆగనేలేదు. ఆగిన తరువాత తలుపు తీసుకుని బయటకి వెళ్ళి చూసాడు. మొదట చూసిన గుర్తులేవీ దొరకనంతగా కొత్తగా శుద్ధశ్వేత భూభాగం ఒకటి ఆవిర్భ వించినట్టుగా మంచు రాశి గుట్టలు గుట్ట లుగా పడివుంది. మందిరం చుట్టు ఎనిమి దడుగుల ఎత్తున రాశి నిండిపోయింది. నదీస్థలం ఎప్పుడో నిండిపోయింది. పర్వ తంతో సమానంగా పోటీ పడుతున్నట్టు తనూ ఒక కొండల వరుసగా మారిపో యింది. మందిరం వెనుక భాగం, సుమేరు పర్వతపు చరియ కలిసిపోయాయి. ఇంకో సారి హిమపాతం మొదలైతే సుమేరు పర్వతం విస్తరించి మందిరాన్ని పూర్తిగా మింగేస్తుంది.

చేతిలో దండం పట్టుకుని, కాలికి బూట్లు కట్టుకుని, ఒంటికి కంబళి, రజాయి చుట్టు కుని అతను ఎంతోసేపు అక్కడే తిరిగాడు. మంచు ఇప్పుడు తన బూటు గుర్తులు కూడా దొరకనంతగా గట్టిగా అయిపో యింది.

మళ్ళీ నిశ్శబ్దం మొదలయింది. ధ్యానం చేయడానికి ఏకాగ్రత కుదరలేదు. బయట తిరగడం కంటికి కనిపించినంత మేర చుట్టూ చూడటం మధ్యాహ్నవేళల్లో అతడి పని. మూడు వైపులా తెల్లటి కొండలు. ఎక్కడ చూసినా తెలుపు... తెలుపు... ఒక టేరంగు... చూసి చూసి విసుగు, అసహ్యం వచ్చేసింది. అపురూపంగా ఆకాశం తేటప డితే, అది మిట్టమధ్యాహ్నం అయితే, సూర్య కిరణాలు హిమరాశిమీద ప్రతిఫలిస్తే ఒక్కో సారి వేరేరంగు లేమన్నా కనిపిస్తాయి. కాని ఎప్పుడూ మబ్బు మూసుకుని వున్న ఆకా శంలో అలాంటి ఎరుపు, నీలం, ఆరెంజ్, ఆకుపచ్చ కిరణాలు పుట్టడం చాలా అపు రూపం. తెలుపు అన్ని రంగుల సమ్మిశ్రిత మూను. కాని ఈ సమ్మిశ్రితాన్ని అనుభవిం చడం ఎన్నాళ్ళు? అది ఛిన్నాభిన్నమైతే కను పించే భిన్నభిన్న వర్ణాలని చూడాలని మనసు తపించిపోతోంది. ఆఖరికి తను ఉడికించుకుతినే బంగాళదుంపలు కూడా చిదిపితే తెలుపే. రాజుకున్న నిప్పులు మాత్రం లేత ఎరుపు. కాని ఎప్పుడూ అదే చూస్తూ కూర్చోడం ఎలా?

హిమపాతం ఎన్నిరోజులుంది అనేదాన్ని ఈసారి అతను లెక్కపెట్టుకున్నాడు. మబ్బు లెంత మూసుకుపోయినా పగటికీ రాత్రికి తేడా తెలిసేది. ఒకటి, రెండు, మూడు అని లెక్కపెట్టుకున్నాడు. ఈ మార్పులేని ఆవర ణలో మామూలు అంకెలూ, అంశాలు కూడా జ్ఞాపకశక్తిలేక జారిపోయే ప్రమాదం

వుంది. అందుకని రోజుకొక ఆలూ చొప్పున ప్రత్యేకంగా వుంచసాగాడు.

కొన్ని రోజులు గడిచాయి. ఒకరోజు రజాయి కప్పుకుని మంచంమీద కూర్చు న్నాడు. హిమపాతం ఎడతెరిపి లేకుండా పడుతూనే వుండటంతో ఎప్పుడు ఆగుతోందో, ఎప్పుడు వస్తోందో తేడానే తెలి యకుండా వుంది. ఉన్నట్టుండి ఎవరో తలుపు తోసుకుని వచ్చారు. తిరిగి చూసాడు. బారామాసి సన్యాసి అదే నగ్న రూపంతో లోపలకొచ్చి పక్క గదిలోకి వెళ్ళారు. లోపల కొంతసేపు ఏవేవో సర్దు తున్న చప్పుడయింది. ఒక గోనె సంచిలో కొన్ని వస్తువులేవో కట్టుకుని ఇతని ఉనికినే గమనించనట్టుగా బయటకి వెళ్ళిపోయారు. ఆయన వెళ్ళిన కొద్దిసేపటికి ఇతను బయట కొచ్చి చూసాడు. హిమపాతం ఆగింది. మందిరం వెనుకభాగంలో సుమేరు పర్వ తాన్ని ఎక్కుతున్నారు. వదులుగా కట్టిన గోనెసంచి జోలి మూటలాగ ఆయన ఎడమ భుజంపై రెండు వైపులకీ వేలాడుతోంది. కుడిచేతిలో దండం. అతను అలా చూస్తూ నుంచుండిపోయాడు. కొద్దిసేపటికి ఆయన కనుమరుగయ్యారు. ఆయన నేరుగా ఎక్కడం లేదు. మంచుబండలు, ఎత్తు పల్లాలు, హిమవత్పర్వతంలో కూడా వున్నాయి. ఎక్కడానికి అనువైన చోటు చూసుకుని ఎక్కుతున్నారని అర్థమయిందత నికి. అలాగే ఎంతోసేపు చూస్తూ నుంచుం డిపోయాడు. మళ్ళీ హిమపాతం మొదల యింది. గబగబ లోపలికొచ్చి తలుపు మూసేసుకున్నాడు.

ఆయన ఇంతవరకు ఎక్కడున్నారో ఇప్పు డెందుకొచ్చారో తెలియలేదు. బహుశ ఇక్కడే ఎక్కడో వుండివుండొచ్చు. ఏదీ ఖచ్చి తంగా తెలియదు. ఇన్నాళ్ళ తరువాత మనిషి అనబడే ప్రాణిని చూసిన తృప్తిదా రికి అంతరంగంలో అదొకరకమైన బాధ కలిగింది. అతి మంద్రమైన వాద్యతంత్రిని మీటి పలికించి వెళ్ళిపోయినట్లయింది. తన యోగ్యత ఇంతేనా? లేక సాధన చాలదా? అన్న ప్రశ్న మనసులో పుట్టింది. రెండవదే నిజం కావచ్చు కాని మొదటిది తన వ్యక్తి త్వాన్ని తూచే ప్రశ్న. దాన్ని నిర్ణయించే శక్తి, జ్ఞానం తనకి లేవు. ఎంతోసేపు అలా కూర్చున్నాక ఆకలివేసింది. ఆరోజింకా ఆహారం తినలేదు. బంగాళదుంపలు ఉడి కించుకోదలచి పొయ్యిలో బొగ్గులు వేసి బయటనుండి ఒక మంచుగడ్డని తెచ్చి కర గడానికి పాత్రలో వేసి మంటమీద పెట్టాడు. లోపలకి వెళ్ళిచూస్తే తను హిమ పాతం మొదలైన నాటినుంచీ లెక్కకోసం తీసి పెట్టుకున్న బంగాళదుంపలు అక్కడ లేవు. అవేకాక మిగతా మూటల్లో దుంపలు కూడా కొన్ని తీయబడ్డాయి. ఆయన ఆహారం తీసికెళ్ళడానికే వచ్చారన్నమాట. పెద్ద ఎక్కువ ఏమీ తీసికెళ్ళివుండరు. మహా అయితే ఏభై దుంపలు తీసికెళ్ళి వుండొచ్చు. కాని తను లెక్కకోసం విడిగా పెట్టుకున్న దుంపలెందుకు తీసికెళ్ళినట్టు? పొరబాటున తీసికెళ్ళారా అనుకుందామంటే, ఆయనకి తెలియకుండా ఏముంటుంది? ఇక్కడు న్నంత కాలమూ దేనినీ, రోజుల్ని కూడా లెక్క పెట్టకూడదన్నది ఆయన సూచన కావచ్చు.

మొత్తానికి ఆరు దుంపలు తీసుకుని వచ్చి గిన్నెలో వేసి ఉడికేవరకు చలికాచుకుంటూ కూర్చున్నాడు. తగినంత ఉడికాక ఒక్కొ క్కటే తీసి తొక్క వలిచి తినసాగాడు. దాని తెల్లదనం చూసి వెలపరం వచ్చింది. బయ టనుంచి ఇంకో మంచుగడ్డ తెచ్చుకుని గిన్నెలో వేసి కరగించి నీళ్ళు చేసుకుని కడు పునిండా తాగాడు.

మళ్ళీ వారం రోజులవరకు హిమపాతం ఆగనేలేదు. అతను రోజులు లెక్క పెట్టడం మానేసాడు. బయట మంచు రాళ్ళు పడే




శబ్దం వస్తున్నా ధ్యానానికి ఏకాగ్రత కుదరటంలేదు. బంగాళదుంపలు ఉడికించుకు తినడం, రజాయి కప్పుకుని పడుకోడం లేక పోతే బయట చూరుకిందకి నుంచుని అంతులేని శ్వేతవర్ణాన్ని చూడడం. చూసి చూసి విసుగొచ్చింది. విసుగు అసహ్యంగా మారింది. ముందు ఇక్కడనుంచి వెళ్ళిపోవాలి. ఎక్కడికైనా క్రింద వూళ్ళకో, పచ్చదనం నిండిన అడవుల్లోకో వెళ్ళిపోవాలి. మనుషులుండే పల్లెలో ఒకటి రెండు రోజులయినా వుండాలి. ఎలాంటిదయినాసరే, నీళ్ళు అనేవి దొరికితే ముందు స్నానం చేయాలి. ఇక్కడికొచ్చినప్పటినుంచి నీళ్ళు లేవు, స్నానమూ లేదు. కిందకి వెళ్ళిపోతే ధ్యానమన్నా సాగుతుందేమో. ఇక్కడదీ లేదు. ఈ రకమైన ఆలోచనలు రాగానే వెళ్ళిపోవాలన్న నిశ్చయం మరింత బలపడింది. ఈ చలికాలం పూర్తయి, మందిరం తలుపులు తీసాక, మహారాజ్ మౌన నియమం విసర్జించాక వెళ్ళిపోదాంలే అనుకున్నాడు. కాని ఈ చలికాలం ముగిసేదెప్పటికి. చలి ఎంతకీ తగ్గనే తగ్గని ఎత్తుఇది. అంతవరకు వుండగలడా తను? పిచ్చిపట్టినా పడుతుంది. ఆధ్యాత్మిక పరాకాష్టకి చేరినవాళ్ళు పిచ్చివాళ్ళలాగే వుంటారుట. కాని ఇది మనసుకుదురు లేక వచ్చే పిచ్చి!

మళ్ళీ రెండు మూడు రోజులు వేచి చూసాడు. ఈసారి హిమపాతం ఆగగానే బయల్దేరి వెళ్ళిపోవాలని నిర్ణయించుకున్నాడు. ఎక్కడా ఆగే సూచనే కనపడలేదు. ఒకరోజు బంగాళదుంపలు రాత్రి పడుకునేందుకు ముందే ఉడకడానికి పొయ్యిమీద పడేసాడు. పొద్దున్నే లేచి వాటిని తిని బూట్లని నిప్పులదగ్గర వెచ్చచేసుకుని కాళ్లకి కట్టుకున్నాడు. రెండు రజాయిలు కప్పుకుని చేతిలో దండం ఊతగా తీసుకుని బయల్దేరాడు. ఇవి మహారాజ్ వస్తువులు. ఆయనకి తెలుపకుండా తీసికెళ్లడం ఎలా? అన్న ఆలోచన వచ్చింది. అయినా ఇవేమీ ఆయన పట్టించుకోరు.

దిగేదారి ఫలానా అని అంచనా వేసుకుని నాలుగు మైళ్ళు కింద పల్లెవరకూ దిగేసరికి ఒళ్ళు హూనమైపోయింది. 'రామబాడ' అనే పాతబోర్డు కనిపిస్తున్న ఆ పదిహేను ఇళ్ళ ఊరిలో ఒక్క మానవప్రాణి కూడా కనపడలేదు. పైనంత ఎక్కువగా కాకపోయినా ఇక్కడి ఇళ్లమీద కూడా మంచు కురిసి నిండివుంది. అయితే, ఇక్కడ ప్రస్తుతం హిమపాతం లేదు. ఉండి, ఉండి ఎప్పుడన్నా కొంచెం కొంచెం పడుతూ వుండివుండొచ్చు. అయినా జనం లేని ఈ ఊళ్ళో వుండటం మంచిది కాదని ఇంకా కిందకి సాగిపోయాడు. రెండు గంటలసేపు అలా దిగగా రాతి మెట్లమీద మంచు కరగుతూండడం కనిపించింది. మంచు కరిగి చిన్న చిన్న ముక్కలుగా మారి, అవి కూడా కరిగి నీరు ఒకచోట చేరి ప్రవహించి దారిలో రాళ్ళు జారుడుగా తయారయ్యాయి. చాలా జాగ్రత్తగా కర్ర ఊనుతూ నిదానంగా అడుగులు వేస్తూ గౌరీకుండం చేరేవేళకి సాయంకాలమయింది. అంటే ఎనిమిది మైళ్ళు దిగాడు.

ఊరు చేరేలోగానే కనపడే ఉష్ణకుండంలోని వేడివేడి నీళ్ళ ఆవిరి చుట్టుపక్కల ఆవరించి వుంది. తనకి తెలియకుండానే ఎడమపక్కకి తిరిగి కుండంవేపు దిగాడు. స్నానం చెయ్యాలనిపించింది. పైకి వెళ్ళే ముందు ఇక్కడ ఒళ్ళు తడుపుకున్నాడంతే. మళ్ళీ ఇంతవరకు స్నానమన్నమాటే లేదు. కట్టుకున్న తుండు పంచె ఉతకనేలేదు. ఇప్పుడు నీళ్ళల్లో దిగి స్నానం చేయబోతే వేడి ఒంటికి హితవుగా అనిపించలేదు. అంతా కాలుతున్నట్టనిపించింది. అదే సమయానికెవరో వచ్చారు. చూస్తే నిష్టాగరిష్టుడిలా కనిపిస్తున్న ఆయన కుండం పక్కనే కూర్చుని ఒక చిన్న డబ్బాతో నీళ్ళు ముంచి ఒంటిమీద పోసుకోసాగాడు. ఆయన

స్నానం అయ్యాక ఆయననడిగి డబ్బా తీసుకుని తనకి తృప్తి కలిగేవరకు నీళ్ళు పోసుకుని ఒళ్ళంతా శుభ్రంగా రుద్దుకుని స్నానం చేసాడు. దగ్గర్లో వున్న మంటపానికి వెళ్ళి ఒళ్ళు ఆరేవరకు నుంచుని, తరువాత రజాయి కప్పుకున్నాడు. ఆయన ఇతడి గురించి విచారించాడు. ఈ హిమపాత సమయంలో పైనుంచి వచ్చానని చెప్పిన ఇతడి మాట విని ఆశ్చర్యపోయాడు. భోజనాన్కి ఆహ్వానించి, ఇంటికి తీసుకువెళ్ళి సాత్వికాహారం వండించి వడ్డించాడు.

రాత్రి వారింట్లోనే పడుకున్నాడు. పొద్దున్నే లేచి అడిగాడు. "ఇక్కడినుంచి కిందకి ఏవూరు? "

"అదే వూరు మీరు పైకి వచ్చేటప్పుడు చూసి వుంటారు కదా!"

"నేను ఎక్కడెక్కడో కొండలు, గుట్టలు చుట్టుకుని ఈ ఊరికొచ్చాను. నాకు కిందికి వెళ్ళేదారి తెలీదు"

"మీరు ఎక్కడకి వెళ్ళాలి? "

"చలికాలం ముగిసేలోపున హృషీకేశ్ చేరాలి"

"చలికాలం ముగియడానికింకా మూడున్నర నెలల సమయం వుంది"

"అంటే, పైన మందిరం తలుపులు మూసి ఎన్నాళ్ళయింది? "

"మూడున్నర నెలలు"

అంటే తను పైన సుమారు మూడు నెలలున్నాడన్న మాట. అదే మూడు యుగాలయినట్టుంది. కింద గడచినంత సులువుగా పైన గడవదు. కాలనియమం ఉండకూడని చోటకి కాలాన్ని తీసికెళ్తే ఇంకేం జరుగుతుంది? అనుకుని మనసులోనే చిన్నగా నవ్వుకున్నాడు.

"సరే, ఇక్కడ్నుంచి హృషికేశానికెలా వెళ్ళాలి? "

"కిందకి దిగితే ఐదారు మైళ్ళదూరంలో రాంపూర్ అనే పల్లె వుంది. అక్కడ్నుంచి ముందుకి ఘాట్. అదయ్యాక గుప్తకాశి. దాని తరువాత రుద్రప్రయాగ ముప్పైమైళ్ళ దూరం. రుద్రప్రయాగనుంచి హృషికేశ్‌కి బస్సుందిట. కాని అక్కడకూడా ఒక్కోసారి విపరీతంగా మంచు పడుతుంది. అందువల్ల దారి మూసుకుపోతే బస్సులు నడవవుట"

"రుద్రప్రయాగకి హృషికేశ్ ఎన్ని మైళ్ళు? "

"అది చరియప్రాంతం. పర్వత సీమలో ఉండే మాకు అంత నిక్కచ్చిగా తెలియవు. మోటార్ గాడి వుంటుందని విన్నాం అంతే"

అతనికి ఇంకెక్కడకీ వెళ్ళడానికి గాని, ఉండటానికి గాని మనసు పుట్టలేదు. పొద్దున్నే లేవగానే బయల్దేరాడు. మరోసారి ఉష్ణకుండానికి వెళ్ళి స్నానం చేయాలనిపించింది. దగ్గరగా వెళ్ళి రజాయి తీసిపెట్టి కుండంనుంచి వచ్చే వేడి ఆవిరి దగ్గర కూర్చుంటే ఒంటికి హాయిగా అనిపించింది. స్నానం సంగతి కూడా మరచి పావుగంట పైగానే అలా కూర్చుండిపోయాడు. అతనికో విషయం గుర్తొచ్చింది. ఇక్కడ్నుంచి పైకి వెళ్ళే రోజున తను ఈ వేడినీళ్ళు వదిలి పక్కన నదిలో చన్నీళ్ళు స్నానం చేసి వెళ్ళాడు. నిన్న ఈ నీళ్ళని చూడగానే కరువుగా డబ్బాతో ముంచి ముంచి పోసుకున్నాడు. ఇప్పుడు ఇంతసేపు కూర్చుని ఈ వేడినీళ్ళ ఆవిరివల్ల సుఖాన్ని అనుభవిస్తున్నాడు. మూడు నెలలు ఆ మంచు శిలల మధ్య కూర్చుని సాధించినదేమిటి? ఈ ప్రశ్న పుట్టిన వెంటనే అంతా గుర్తొచ్చింది. పైకి వెళ్ళడానికి ముందు చలి, ఉష్ణం, శీతం, గాలి మొదలైన వాటి సహ్యాభావం సాధించ గలిగాను. పైన గడ్డకట్టే స్థితిలో ఏమీ చెయ్యలేదు. చెయ్యలేకనూ పోయాడు. ధ్యానం కూడా సాధ్యపడలేదు. రోజూ




పుష్కలంగా బంగాళదుంపల భోజనం. మంచం, వెచ్చని రజాయి కప్పుకుని కాలం గడచిపోయింది. అలా వున్నా ఎక్కడలేని అసంతృప్తి. అక్కడినుండి ఇక్కడకి దిగిన వెంటనే ఏమీ ఆలోచించకుండా ఈ వేడినీళ్ళ సుఖానికి వశమైపోయాడు. హృషీకేశ స్థాయినుంచి పైకి వెళ్ళిరా అన్నారు గురువులు. మరి తను ఉన్నతస్థాయికి వెళ్ళాడో, కిందకి మళ్ళీ పడ్డాడో?

వెంటనే లేచి వెళ్ళి పక్కనే ప్రవహిస్తున్న నదిలోకి దిగి ఒకసారి మునిగి స్నానం చేశాడు. పైన గడ్డకట్టిన మందాకినీ నదే ఇక్కడ చిక్కగా పెరుగులా పారుతోంది. ఆ నదిలో గులకరాళ్ళల్లా ప్రవహిస్తున్నాయి మంచుగడ్డలు. చర్మాన్ని కొయ్యబారేలా చేసి కాళ్ళు, చేతులకి స్వాధీనం తప్పిస్తున్నాయి. పైకి వచ్చి తడి ఒంటిమీద రజాయి కప్పుకుని కాళ్ళకి బూటు తొడుక్కుని దిగడం మొదలుపెట్టాడు.



ఎం తమాత్రం ఆత్రపడకుండా మధ్యమధ్యలో మజిలీలు చేసుకుంటూ నడిచి వెళ్ళిన పదిహేను రోజుల్లో హృషికేశ్ చేరిపోయాడు. గీతాశ్రమం లోపలి ఆవరణలో కాకతాళీయంగా అద్దంలో తన రూపం చూసుకున్నప్పుడు తననితానే గుర్తుపట్టలేకపోయాడు. ముఖం ఒళ్ళు అంతా బొగ్గులా నల్లబడిపోయింది. ముఖంమీద పగుళ్ళు గాయాల్లాగా తయారై మానినవి కొన్ని మళ్ళీ కొత్తగా పగిలినవి కొన్ని ఒంటి చర్మం నల్లబడిందని ఈమధ్య గుర్తించాడు. కాని ముఖం ఇంతగా మారిపోయి వుంటుందని ఊహించలేదు. బొంబాయిని వదిలేసాక అద్దంలో ముఖం చూసుకోనేలేదు. జడలు, గడ్డం పెరిగి వుంటుందని తప్ప ఈ మార్పులు ఊహించలేదు. ఇదంతా మంచు, చలి యొక్క ప్రభావం కావచ్చు. బారామసి మహరాజ్ శరీరం ఎంత కాంతిగా, మృదువుగా, శుభ్రంగా వుండేది అని గుర్తొచ్చింది. మళ్ళీ ఆయన్ని తలచుకోవడమే చికాగ్గా అనిపించి మనసుని మరోవేపు మరల్చి అద్దం దగ్గర్నుంచి దూరంగా వెళ్ళి నుంచున్నాడు.

ఆరోజు గురువుల కోసం వెతకడం ప్రారంభించాడు. నది రెండు వేపులున్న కొండల్లో, గుట్టల్లో, తోటల్లో, అడవుల్లో, కొండచరియల్లో పర్ణశాలలు వేసుకుని బతుకుతున్న అనేక సన్యాసుల నివాసాల్లో వెతికి చూసాడు. ఆయన దొరకలేదు. చలికాలం సమాప్తం అవ్వాలంటే ఇంకా రెండున్నర నెలల సమయం వుంది. అంటే తనకి చెప్పిన మూడు సంవత్సరాల వ్యవధి ముగియాలంటే సుమారు మూడు నెలల కాలం వుంది. ఆయన కూడా పర్యటనకి వెళ్ళి వుంటారు. అంతవరకు ఇక్కడేవుండి ఆయనకోసం ఎదురుచూడడమే గురి అని నిర్ణయించుకున్నాడు. రోజూ స్నానఘట్టం దగ్గర ఎండలో వూరికే కూర్చునేవాడు. యాత్రికులు, స్నానానికి వచ్చినవారు అతని ముందు చిల్లర డబ్బులు వేసి వెళ్ళేవారు. దానితో గోధుమపిండి తెచ్చుకుని రొట్టెలు చేసుకొని రోజుకొకసారి తినేవాడు. ఊళ్ళో ధర్మశాల అరుగుమీద ఒక రజాయి పరచుకుని, మరొక రజాయి కప్పుకుని రాత్రులు గడిపేవాడు. ఇప్పుడు ధ్యానం చెయ్యాలనే కోరికేలేదు. ఎంత ప్రయత్నించినా ఏకాగ్రత కుదరదు. అక్కడికొచ్చే రకరకాల యాత్రి

కుల్ని చూడటం, వాళ్ళ మాటల్ని వింటూ వుండటం దీనితో కాలక్షేపం అయిపోయేది. గురువుగారు రాగానే ఈసారి ఏకాగ్రతకోసం కొత్తమార్గం ఏదన్నా తెలుసుకుని మొదలు పెట్టాలి. ఊరికే వ్యర్థప్రయత్నం చేయడం ఎందుకులే అని ఊరుకున్నాడు.

మూడు నెలల తరువాత గురువులు దొరి కారు. ఆయన కూడా పైకి వెళ్ళారట. ఫలానా చోటికి అన్న సంగతి చెప్పలేదు. ఇతడి అనుభవాలని అడిగారు. బారామాసి మహారాజ్‌ని చూశావా? వారే నా గురువులు. నీలకంఠ పర్వతంమీద నాకు దర్శనం ఇచ్చారు"

"ఎన్నాళ్ళక్రితం? "

"నాలుగు నెలలయింది"

"మీతో మాట్లాడారా? "

"లేదు, నేను ధ్యానంలో వున్నానప్పుడు. కళ్ళు తెరచేవేళకి ఎదురుగా దర్శనమిచ్చారు. వినయంగా ముందుకి వంగాను. ఒక ఆలుగడ్డ నా ముందుంచి వెళ్ళిపోయారు"

"మీరు పలుకరించలేదా? వెంటపడ లేదా? "

"అలా చెయ్యకూడదు. మాట్లాడవలసిన అవసరం వుంటే ఆయనే ఆడతారు"

ఇతడు తన అనుభవాన్ని వివరించాడు. ఆయన వెంటనే ఏమీ చెప్పలేదు. ఆయన సలహాప్రకారం ఇతను నదీతీరాన ఒక గుడిసె కట్టాడు. అందులో మూడు గదులు. 'బయటగది నీకు' అన్నారాయన. ఆహారానికి ఇబ్బందిలేదు. ఎవరో ధనికులయిన యాత్రికులు గురువులముందు నూరు రూపాయల దక్షిణ ఉంచారు. అంతటికీ గోధుమ పిండి తీసుకున్నారు. బోలెడుం దది. గురువుగారు రోజుకి పన్నెండు గంటలు ధ్యానం చేసేవారు. ఇతను వారి సేవచేస్తూ వుండేవాడు.

ఒకరోజు ఆయనే అడిగారు "ఈత వచ్చా? " అని.

"ఊఁ" అన్నాడు.

"నీకు సాధన నేర్పుతాను రా" అని లక్ష్మ ణఝూలా దగ్గరికి తీసుకెళ్లారు. హిమాలయాల దగ్గర్నుంచి గర్జిస్తూ ప్రవహించేనది ఇక్కడికొచ్చేసరికి నిశ్శబ్దమైపోతుంది. శబ్దం తక్కువగా ఉన్నంత మాత్రాన వడి తక్కువేమీ వుండదు. రెండుమైళ్ళ అవతల గీతాశ్రమం స్నానఘట్టాల దగ్గర అడ్డబండలకి తగిలి చిన్న సవ్వడితో ప్రవహిస్తుంది. గురువుగారు, "ఇక్కడచూడు, రోజూ పొద్దున్నే ఇక్కడకిరా. నది మధ్యలోకి ఈదుకుని వచ్చి అక్కడ్నుంచి ప్రవాహానికి ఎదురీదు. ఏమీ భయపడక్కర్లేదు. ఎదురు ఈదడం కష్టమే. కాని మెల్లమెల్లగా పైకి వెళ్ళే ప్రగతి సాధించాలి కదా! రోజుకి ఇంతే ప్రగతి అనే మితి ఏమీలేదు. మొత్తం మీద ఆరోజు కారోజు అతిక్రమించాలి. మరోమాట. పైకి వెళ్తావుకదా! ఒడ్డుకి రావాలనుకుంటే అక్కడకి దగ్గర్లోవున్న ఒడ్డుకి వచ్చిపైకి ఎక్కు. అంతేగాని ప్రవాహంలో దిగువకి వద్దామనుకున్నావనుకో. నీ మొదటిస్థానం కన్న ఒక్క అంగుళం దిగువకి జారినా ఒకవేళ ప్రవాహం కిందకి తోసేసినా ఆ దూరమంతా మళ్ళీ ఈదుకునే పైకి రావాలి. ఒడ్డుమీద నడిచావనుకో. ప్రవాహానికి ఎదురీదినట్టవదు"

"ఎన్నిరోజులిలా చెయ్యాలి? "

"ఒక సంవత్సరంపాటు నేనిక్కడే వుంటాను. నువ్వు ఎంతమటుకు ప్రగతి సాధించావన్న సంగతి నాకు తెలుస్తుంది. నువ్వు కేవలం సాధన చేస్తూ ఉండు. ఎప్పుడు ఏం చెయ్యాలో నేనే చెప్తాను"

రోజూ ప్రయత్నం చేసేవాడు. మూడు నాలుగు రోజులు కేవలం ప్రయత్నం ఒక్కటే జరిగింది. ప్రవాహం ఒకటే లాగేస్తుంటే దాని వేగాన్ని, ఆకర్షణని తట్టుకుంటూ ఉన్నచోట నిలబడటమే పెద్ద సాధ




నమయింది. అదేమీ తక్కువదికాదు. ఆ తరువాత రోజురోజుకి కాస్త కాస్త చొప్పున ప్రగతి కనిపించసాగింది. ఒక నెలలో సుమారు ఇరవై బారలు పైదిక్కుగా వెళ్ళే టంత అభివృద్ధి కనపడింది. కేవలం ఈదడం ఒకటేకాదు. ప్రవాహ మూలాన్ని కూడా చేరుతాను అనే దృఢ నిశ్చయం కావాలి. అంటే ధ్యానం కూడా చేస్తూ వుండాలి.

ఆరోజునుంచి ఈతతోబాటు ధ్యానంకూడా ప్రారంభించాడు. రోజు రోజుకి ఈదడంలో అభివృద్ధి కనిపిస్తోంది. ఈ నదీ ప్రవాహపు మూలం అంటే ఏమిటి? ఇది పుట్టిన దొక చోటకాదు. తను చూసిన గంగోత్రి ఒక్కటే దీనిమూలంకాదు. ఇక్కడ్నుంచి ఈదు కుంటూ ఆ ఎత్తుని దైహికంగా చేరడం అనేది పిచ్చిమాట. కొన్ని చోట్ల నది ఎన్నో అడుగుల ఎత్తునుంచి కిందకి దుముకు తుంది. దాన్ని ఈది పైకి చేరడం ఎలా? అని ఆలోచిస్తుంటే తోచింది. 'యతుల మాటనెప్పుడూ అక్షరాలా సూటిగా అర్థంచే సుకోకూడదు' అని.



పైనుంచి కిందకి తోస్తోందో, కిందనుంచి లాగుతోంధో అర్థం కానటువంటి విచిత్ర మైన ఒత్తిడి, తోపిడి. పైపైన శాంతతలం. ఇదొక జటిల ప్రశ్నలా కనపడింది. పైనుంచి క్రిందకి తొయ్యడానికే నీళ్ళు వస్తు న్నాయా? కిందనుంచి లాగుడు లేకపోతే పైనుంచి దుమికిన నీరు అక్కడే నిలచే దేమో. పైనుంచి నీరు తోయడం, కింద నుంచి లాగడం రెండూఒకటేనేమో. ఇదంతా ఎందుకు అసలు? కాని ప్రవాహం సత్యం. దీనినెదురుకోడం సాధ్యంకాదు. చేతులు, కాళ్ళు సోలిపోయేలా పెనుగులాడు తున్నా కిందకి తోసేస్తోంది.

పైగా ఆరోజు నీళ్ళు ఎక్కువ చల్లగా వున్నాయి. పైన ఎండ ఎక్కువైతే మంచు కరగి ప్రవహిస్తుంది. అప్పుడు కింద నీటి చల్లదనం మరింత ఎక్కువగా వుంటుంది. కొరికేస్తున్న ఆ చల్లదనంలోనే చేతులతో తోస్తున్నాడు. ముఖం, మెడ కూడా చల్లగా అయిపోతున్నాయి. ఆ భాగాన్ని ఎలా వెచ్చ చేసుకునే వాడో పాత జ్ఞాపకం వచ్చింది. తంబాకు వేసుకునే రోజుల్లో మెడ నరాలే కాదు, ముఖం, చెవులు నుదురు కూడా వేడె క్కేది. పొగాకెందుకు, ఉట్టి తాంబూలమే చాలు. అప్పుడు తోటివాళ్ళు చలికాలంలో వెచ్చదనం కోసం తంబాకు తినేవారు. తనూ అలవాటు చేసుకున్నాక అది నిజమే నని తెలిసింది.

తంబాకు కొందరికి నచ్చుతుంది, కొంద రికి నచ్చదు. లలితెప్పుడూ దాన్ని ఆక్షేపించ లేదు. అలా చూడబోతే ఆమె తన ఏ అల వాటునీ ఎప్పుడూ విమర్శించలేదు. అల వాటు లేని వాళ్ళకి తంబాకు వాసనవల్ల కడుపులో తిప్పుతుందట. శోభనంనాడు తను నోట్లో తంబాకు వేసుకున్నాడు. లలి తకి కడుపులో తిప్పడం మొదలైంది. ఆ సంగతి తనకేం తెలుసు? ఆమె కూడా చెప్పలేదు. శోభనం గదిలో తనతో మాట్లా డకపోవటం బిడియంకొద్దీ కాదన్నమాట. ఆమె స్వభావమే అంత. చివరకి తట్టుకోలేక వాంతి చేసేసుకుంది. బయటకి వెళ్ళకూడ దట. తెల్లవారేవరకు శోభనం గదిలోంచి బయటకి రాకూడదని శాస్త్రంట. అక్కడే వున్న పాత్రలోకే వాంతి చేసేసింది. ఎందు కిలా అని ఎంత ఒత్తిడి చేసినా చెప్పలేదు. వారం రోజులు అలాగే అవస్థపడింది. బొంబాయికి వెళ్ళాక మళ్ళీ అడిగితే అప్పుడు నోరు విప్పింది. 'నేను దీన్ని వదల్లేను' అన్నాడు తను. 'మీరేం వదలద్దులెండి, కొన్నాళ్ళు గడిస్తే నాకే అలవాటవుతుంది' అంది.

వైదేహి అలాకాదు. తనకీ ఈ వాసన పడేది కాదు. బొంబాయిలో పెళ్ళిచేసుకు

న్నాక తను బాల్కనీలో పడుకోడం మానేసి లోపలకొచ్చి పడుకున్న మొదటిరోజే అంది. "ఈ వాసన నాకు నచ్చదు. కడుపులో తిప్పు తుంది. బాత్‌రూంకి వెళ్ళి ఉమ్మేసి, నోరు కడుక్కుని రండి" అని తను వెళ్ళి ఆమె చెప్పిన ప్రకారమే చేసి వచ్చాడు. అయినా ఆమె ఏదో ఒకరకంగా ఆక్షేపణ వ్యక్తంచే స్తూనే వుంది. అక్క చెల్లెళ్ల స్వభావంలో బోలెడంత తేడా వుంది. లలితది మాతృవా త్సల్యం లాంటిది. భర్తని కౌగలించుకున్నా అందులో మాతృవాత్సల్యపు వెచ్చదనం నిండివుంటుంది. అదే వైదేహి కౌగలింతలో కోరికతో వేగిపోయే ప్రియురాలి కౌగిలికుండే రగుల్పు, వేడి వుంటుంది. ఇద్దరి ప్రేమ ఒక్కలాంటిదే కాని దాని తీవ్రత, స్వరూప స్వభావాలు వేరువేరు. లలిత తనని ఆమె ఒళ్ళో పడుకోబెట్టుకుని దగ్గరకి లాక్కునేది. వైదేహి తనే తన ఒళ్ళో పడుకుని నడుము చుట్టూ చేతులు వేసి బిగించి దగ్గరకు లాక్కునేది. లలితతో సంసారం మొదలుపె ట్టినప్పుడు ఇంట్లో ఇద్దరే. తమతో ఉండ మని ఎంత బతిమాలినా వినకుండా రామ కృష్ణ దాదర్లో తన రూమ్‌లోనే వుండేవాడు. వైదేహితో దాంపత్యం మొదలయ్యాక భవా నికి ఆరేళ్లు, విజయ్‌కి నాలుగు, గణేశ్‌కి రెండు. పెద్దపిల్లలిద్దరికీ జ్ఞానం వచ్చింది. ఆదివారం తను పగలు ఇంట్లో వున్నా కూడా ఆమె దగ్గర కూడా కూర్చునేదికాదు. రాత్రి మాత్రం పిల్లలు పడుకోగానే తనకి తాంబూలం ఇచ్చి ఒళ్లో వాలిపోయేది. తాంబూలం ఇచ్చేది గాని పొగాకుకి నిర్బం ధమే. ఆమెతో వున్నప్పుడు పొగాకుకి దూరమే.

ఒక్కోసారి ఆమె ఒళ్ళు ఎంత వేడెక్కిపో యేదో! ఏమిటి ఒంట్లో బాగోలేదా? ఏమి టిది? జ్వరమా? ... కంగారుతో చెమటలు పట్టేవి తనకి.

'ఏమిటి? జ్వరమా? అదేం లేదే!' అని కొంటెగా నవ్వేది. కాని ఆ వేడి ఎంత ఎక్కువో.

ఏదో తగిలినట్టయింది. ఇంతసేపు సరిగ్గా కళ్ళు విప్పి చుట్టూ చూడనే లేదు. ఆలోచ నలో పడి తను ఎక్కడికొచ్చాడో తెలీదు. ఇప్పుడు చూసుకుంటే ఒక బండకి అడ్డంగా వచ్చాడు. నీళ్ళు కూడా అంత చల్లగా లేవు. కొద్దిగా వెచ్చగానే వున్నాయి. బాగా కళ్ళు తెరచి చూసాడు. ఎక్కడున్నాడో అర్థంకాని పరిస్థితి. నదికి రెండువైపులా ఎత్తైన గట్టు. దట్టంగా పెరిగినపచ్చటి అడవి కనపడ లేదు. చుట్టూ బయలు. సూర్యుడు బాగా వాలివున్నాడు. అది తూర్పో, పడమరో తెలి యలేదు. 'నేనిప్పుడు ఎక్కడున్నాను' అనే సంశయం కలిగిం[illegible] నది ఒడ్డున వున్న ఒక రైతు గేదెని కడుగుతున్నాడు. ఈదు కుంటూ అతని దగ్గరకి వెళ్ళి అడిగాడు.

"ఇది ఏ వూరు?"

"సంకపాడా"

"అంటే, ఇది ఎక్కడుంది?"

ఆ ప్రశ్న రైతుకి అర్థంకాలేదు. అతడు మళ్ళీ అడిగాడు. "ఇక్కడనుంచి హృషీకేశ్ ఎన్ని మైళ్ళదూరం?"

"అదింకా పైకి వుంది బాబూ"

"ఎంత దూరం?"

"చాలా దూరం. మా వూరి పక్కనున్న దిబ్బ ఎక్కి చూస్తే, ఆకాశంలో మబ్బులు లేనప్పుడు హృషీకేశ్ మసకగా కనిపిస్తుంది"

అంతరంగంలో ఏదో కలవరం, ఏదో కన్ ఫ్యూషన్ కలిగాయి... పిడుగుపాటు తగిలి నట్టు అలా కొయ్యబారి నుంచుండిపో యాడు. కొంచెం సేపయ్యాక రైతే అడి గాడు.

"ఎక్కడ్నుంచి వచ్చారు స్వామీ?"

"పైనుంచి"

"ఎక్కడకి వెళ్తారు?"





"ఎక్కడకీ లేదు, ఇప్పుడెంత సమయం? "

"సూర్యుడు ములగడానికి మూడు ఘడియలుంది"

అతను మళ్ళీ ఊరికే నుంచున్నాడు. రైతు మళ్ళీ అన్నాడు. "ఈదుతూ వచ్చారేమో. ప్రవాహం అంటేనే అది. లాక్కునొచ్చేస్తుంది. ఈదుకుని పైకి వెళ్ళడం శక్యం కానిపని. ఒడ్డుకి రండి నడుచుకుని వెళ్ళొచ్చు" అన్నాడు. అంతలో సన్యాసి పరిస్థితి చూసి, "ఒడ్డున నడుచుకు వెళ్ళడానికి కప్‌డా లేదు కదా! మా పల్లెకి రండి. సాములవారి భోజనానికి మా గుడిసెలో రొట్టి సమర్పించుకుంటాను. కొత్త బట్టలు సమర్పించుకుంటాను. పొద్దున్నే వెళ్ళరు గాని"

అవును, కాదు అనే సంకల్పశక్తి అతనిలో లేకుండా పోయింది. "బయటకి అడుగుపెట్టండి స్వామీ" అని రైతు ఇంకోసారి పిలవడంతో అతడు నీటిలోంచి పైకి వచ్చాడు. అది పదిహేను. పద్దెనిమిది ఇళ్ళున్న చిన్న పల్లె. ఊరిబయట భైరల్‌జీ మందిరం. అతడక్కడే ఆగిపోయాడు. రైతు ఇంటిదగ్గర్నుంచి ఒక కొత్త తుండుపంచె తెచ్చాడు. అది కావిరంగు కాకుండా తెల్లపంచె అయినా అదే కట్టుకుని, ఒంటిమీద వున్న కావి బట్టని పిండి ఆరేసాడు. వేసవికాలం కావడంతో ఉక్కకి చెమటలు కారసాగాయి. అయినా అందులోనూ ఒక హాయి కనపడింది.

★ ★ ★

పర్వతపాదంనుండి కిందకి తోసివేయబడి బయలు సీమని చేరాడు. ప్రవాహానికి ఎదురీది మళ్ళీ హృషికేశ్ చేరడం అసాధ్యం. ఎన్నేళ్ళు ప్రయత్నించినా తనవల్ల జరిగేపని కాదు. ఒడ్డున నడచి వెళ్ళడం అర్థంలేని పని. గురువు దానిని ఎన్నటికీ ఒప్పుకోరు. ఇంకేమి చేయాలో తోచలేదు. మర్నాడు అతను అదే రైతుని అడిగాడు. "చౌధురీ, ఈ ఊళ్ళోనే మరో పది పదిహేను రోజులుండాలని వుంది. ఉండనా? "

"భైరల్‌జీ మందిరం వున్నదే మీలాంటి సాధుమహారాజ్‌ల నివాసంకోసం. సన్యాసులొస్తే మా ఊళ్ళోవాళ్ళు రొట్టి లేదు అని అనరు"

అతను అక్కడే నివాసం ఏర్పరచుకున్నాడు. రోజూ భిక్షకి వెళ్ళనక్కర్లేకుండానే ఏదో ఒక ఇంటినుంచి రొట్టె దాల్ తెచ్చి అర్పించేవారు. సన్యాసి ఎప్పుడూ ఒంటి పొద్దు భోజనమే. ఆ ఉక్కపోత వాతావరణంలో కప్పుకోడానికేమీ అక్కరలేదు. రైతు ఎలాగూ ఒక తుండు పంచె ఇచ్చాడు. కట్టుకుని నదిలో స్నానంచేసి వచ్చి గట్టు మీద నుంచుంటే ఒంటివేడికి, ఎండకి పది నిమిషాల్లో ఆరిపోయేది.

ఉద్దేశ రహితంగానే అతనా ఊరిలో ఉన్నాడు. మొదట ఏడెనిమిది రోజులు ఎవరన్నా మందిరానికే భోజనం తెచ్చి అర్పించేవారు. తరువాత ఎవరూ వచ్చేవారు కాదు. ఇతనే మధ్యాహ్నంవేళ ఏదో ఒక ఇంటి ముందు నుంచుని "సాధూకో భోజన్ ఖిలావో మాతాజీ, భగవాన్ తుమ్హారా భలా కరే" అని అడిగేవాడు. ఆ ఇల్లాలు రొట్టి, పాలు అర్పించేది. నదీ తీరంలో తిని అక్కడే ఒక చెట్టుకింద నీడలో పగలు గడిపేవాడు. ఆ దారిలో ఎవరన్నా మాట్లాడిస్తే కాసేపు పొద్దుపోయేది. వాళ్ళ ఊరు, పేరు వివరాలు చెప్పి, ఇతని గురించి అడిగేవారు. "సాధువులకి ఊరేమిటి? చిరునామా ఏమిటి? " అనేవాడు. 'ఎన్నాళ్ళు ఈ ఊరిలో ఉండటం? ఏం చెయ్యడం ఇక్కడ? ' అనే ప్రశ్న సదా వేధించేది. కాని ఎక్కడికెళ్ళాలో తెలియదు. ఊరు వదిలి నది ఒడ్డు దాటితే అవతల నడవడానికి కాళ్ళలో శక్తే లేనట్టుగా అనిపించేది.

ఒకరోజు భిక్ష తీసుకుని నది ఒడ్డున చెట్టు దగ్గరకి వెళ్తున్నాడు. అదే స్థలానికి



మరొక సన్యాసి వచ్చాడు. నది పైభాగం నుంచి కిందివైపుకి ఒడ్డున నడుచుకుంటూ వచ్చిన ఆ యువకుడి వయసు పాతిక ఉంటుంది. జటాజూటాలున్నాయి. కావి రంగు పంచెకట్టుకుని, కావి జుబ్బా తొడుక్కున్నాడు. చేతిలో దండం, ఎడమ భుజానికి ఒక ఎర్రటి జోలె. ఇతనే ఆ సన్యాసిని అడిగాడు. "భోజనం స్వీకరిస్తారా స్వామీ? "

"జై గంగాజీ!" అంటూ అతను కూర్చున్నాడు. రొట్టి, కూర ఇద్దరూ తిన్నారు. పరస్పరం పరిచయం చేసుకున్నారు. చిన్న సన్యాసి చెప్పాడు. "గంగానందుడు అని నామకరణం జరిగింది నాకు. గంగోత్రి నుండి బయల్దేరి సముద్రంవరకు ప్రవాహపు ఎడమ ఒడ్డుపైనే నడుస్తూ సాగిపోవడం నా ధ్యేయం. అక్కడినుండి మళ్ళీ ప్రవాహపు కుడితీరాన నడుచుకుంటూ మళ్ళీ గంగోత్రిని ముట్టాలి. ఇది గురువుల ఆజ్ఞ"

"ఎన్ని రోజుల్లో"

"ఇంత అనే నిర్బంధం ఏమీలేదు. ఆరోగ్యం బాగోకపోతే తప్ప చలి, వాన, ఎండా ఇలా వేటికీ చలించకూడదని నియమం. తమ ఆశ్రమనామం? "

తన పేరేం చెప్పాలో అతడికి తెలియదు. గురువులు 'నిస్సంగానంద' అనే పేరు పెట్టారు. తనేమో ఆయన్నే వదిలి కూర్చున్నాడు. సాధన కూడా లేకుండాపోయింది. ఆ పేరు చెప్పడం అనుచితం అనిపించింది. 'నరహరి' అని చెప్పాడు.

"అది గతించిన నామం. ఇప్పటి పేరు చెప్పండి"

ఈ ప్రశ్నకి అతడు జవాబు చెప్పలేదు. గంగానందుడే అడిగాడు. "మీ ముఖం చూస్తే సన్యాసి అని తెలుస్తోంది. సోదరుడు సోదరుడిని గుర్తించినట్టు మీ ఆశ్రమం మరో సన్యాసికి చూడగానే తెలిసిపోతుంది. పేరు చెప్పండి"

ఎక్కువ చర్చించకుండా చెప్పాడతడు. "నిస్సంగానందుడు"

"మీ పేరే మన అందరి ముఖ్యధ్యేయం" అని గంగానందుడు విశ్రమించడానికై మౌనంగా చెట్టుకింద ఒరిగాడు. నిస్సంగానందుడు మౌనం వహించాడు. అతని మనసులో ఒక ఆలోచన వచ్చింది. ఈ సన్యాసితోబాటు తను కూడా నది పొడవునా నడిచి వెళ్ళేది. సముద్రంలో కలిసేచోట నదిని దాటి మరొక తీరానికి చేరి మళ్ళీ ఇక్కడిదాకా రావడం. మనసు పుడితే మళ్ళీ గంగోత్రికి వెళ్ళటం. కాని తను చేయాలనుకునే ఈ పనిలో ఏ ధ్యేయమూ లేదు. గంగానందుడికైతే గురువు మార్గదర్శనం, సూచన వుంది. తను చూస్తే గురువు సూచనని సరిగ్గా పాటించకుండా కిందకి జారినవాడు లేదా తోసివేయబడ్డవాడు. నేనిలా బయల్దేరి వెళ్ళి ప్రయోజనం ఏమిటి? అన్న సందేహం కూడా వచ్చింది.

కాని అలా నడుచుకువెళ్ళడంలో ఒక ఆకర్షణ పుట్టింది. దానికితోడు గంగానందుడి సహవాసం దొరుకుతుందనే ఆశ ఒకటి.

తను కూడా రావచ్చా అని అడిగితే, గంగానందుడు అభ్యంతరం ఏమీ లేదన్నాడు. వెంటనే నిస్సంగానందుడు లేచి నుంచున్నాడు. ఇద్దరూ బయల్దేరారు. నది ప్రవహిస్తూనే వుంది. వీళ్ల ఒడ్డున నది దిగువకి ప్రవహించే దిక్కుగా నడుస్తున్నారు. మొదటిరోజు వాళ్ళిద్దరూ ఎక్కువగా మాట్లాడుకోలేదు. తరువాత కొద్దికొద్దిగా మాట్లాడుకునేవారు. పూర్వాశ్రమం గురించి మాట్లాడరాదని గంగానందుడికి గురువుగారి ఆజ్ఞ. నిస్సంగానందుడికి అలాంటి ఆజ్ఞలేమీ లేకపోయినా అతడికే మాట్లాడడం ఇష్టం లేదు. అందువల్ల ఇద్దరూ సన్యాససాధన, దైవం, జగత్తు, ఇలాంటి విషయాలే మాట్లా

డుకునేవారు. తాత్విక వేదాంతంలో ఇతడు తనకన్న ఎక్కువ తెలిసినవాడని అర్థమయింది గంగానందుడికి. దాంతో నిస్సంగానందుడిపై గౌరవం కలిగింది. అతడిని గురుభావంతో చూడసాగాడు. ఏ దారి తోచకుండా కొట్టుమిట్టాడుతున్నప్పుడు ఈవిధంగా తనకొకదారి చూపించడానికి గంగానందుడిని ఇతడు పద దర్శకుడిగా భావించాడు. ఇద్దరూ నడుస్తూ నడుస్తూ దార్లో కనపడే పల్లెలో భిక్ష తీసుకుని తింటూ నడిచేవారు. రాత్రుళ్లు ఊరిబయట మందిరాల్లోనో, నదీతీరాన చెట్లకిందో, బండలమీదనో పడుకునేవారు. వేసవి ఎండ రోజురోజుకీ ఉధృతమవుతోంది. చివరికి ఉదయం తొమ్మిది తరువాత, సాయంత్రం ఐదులోపల నడవడమే అసాధ్యమయిపోతోంది. ఆ సమయంలో విశ్రాంతి తీసుకుని తెల్లవారుజామున, ఉషోదయవేళ, సాయంకాలపు చల్లటివేళ ఆ నడవవలసిన దూరాన్ని అవజేసేవారు. ఎన్నో పల్లెలు, పట్టణాలు, ఎన్నో రకాల జనులు కనపడేవారు. నిస్సంగానందుడికి వేరే బట్టల్లేవు. గంగానందుడి. జోలెలో మరో జత ఎక్కువగా వుంది. దానిని నిస్సంగానందునికిచ్చాడు. ఇద్దరూ ఒకేరకం బట్టలే వేసుకుని యూనిఫాంలో వున్న బైరాగుల్లా నడిచేవారు.

వాళ్ళిద్దరూ త్రివేణి సంగమానికి వచ్చేసరికి తొలకరి జల్లులు పడ్డాయి. నిస్సంగానందునికి త్రివేణి సంగమంలో మరో రెండురోజులుండాలని కోరికగా వుంది. కాని ముందుకి సాగిపోకుండా ఒక్కరోజు కూడా ఉండకూడదని గంగానందుడికి ఆజ్ఞ వుంది. అందుకని ఇద్దరూ బయల్దేరారు. ఈసారి తొలకరి కాస్త జోరుగానే వుంది. ఉత్తర హిందూస్థానంలో వర్షాకాలం మొదలైందంటే అవి వేసవికాలపు తుది ఛండాలపు రోజులు. వర్షంలో తడవడం హాయిగా వుండటంవల్ల వాళ్ళిద్దరూ వానని లెక్కచెయ్యకుండా సాగిపోయారు. దారిలో నిస్సంగానందుడికి జ్వరం వచ్చింది. ఆ తరువాత కనిపించిన పల్లెలో ఇద్దరూ విడిది చేశారు. మర్నాడు సంధ్యాసమయం అయినా జ్వరం తగ్గలేదు. ఆరోజు గంగానందుడి నియమ ప్రకారం ఒకటి రెండు మైళ్ళయినా ముందుకి వెళ్ళాల్సివుంది. "నేను వెనుకగా వచ్చి మిమ్మల్ని కలుసుకుంటాను. మీరు మెల్లగా నడవండి" అని నిస్సంగానందుడే చెప్పాడు. ఇద్దరూ మొదట ఒంటరితనం కోసం బయల్దేరినవాళ్ళే. ఈ జంట ప్రయాణం యాదృచ్ఛికంగా జరిగింది. అయినా గంగానందుడు అదోరకమైన వేదనతో రోజుకి కేవలం రెండు మైళ్లు నడుస్తాను. మీరు త్వరగా నయం చేసుకుని వచ్చి కలవండి అని చెప్పి, ఇద్దరు పల్లెవారికి ఇతడి బాధ్యత అప్పజెప్పి ముందుకి నడిచాడు.

పల్లెజనులేమో చాలా జాగ్రత్తగా తమకి తెలిసిన ఔషధ, పథ్యాలు చేయించారు. కాని జ్వరం తగ్గింది ఎనిమిదవరోజుకే. మళ్ళీ ఎనిమిదిరోజులు విశ్రాంతి కావలసివచ్చింది. వర్షాకాలంలో ఒడ్డుదాటి మైళ్ళకొద్దీ విస్తరించిన ప్రవాహతీరాన ముందుకు నడవడం కష్టంగా వుంది. ప్రతిచోట బురద, ముళ్లు. నదిఒడ్డున బయల్దేరిన అతను మరోదారి లేక తూర్పువైపుకి తిరక్క తప్పలేదు. ఒక పల్లెలో విచారిస్తే చెప్పారు. "వర్షాకాలం అంతే. మీరెక్కడకి వెళ్ళాలో చెప్పండి" అని.

"ఇలాగే, నది వెంట పొడవుగా, సముద్రంవరకు వెళ్ళాలి"

"ఎందుకు? " అని ఒక కుర్రవాడడిగాడు.

"సాధు మహరాజ్‌ని అలా అడగకూడదు. ఊరుకో" అని ఆ కుర్రవాడిని గదమాయించాడొక వృద్ధుడు.

కాని ఆ కుర్రవాడి ప్రశ్న నిస్సంగానందుడి అంతరంగాన్ని ప్రవేశించి వేధించసాగింది.

ఎందుకు? నేనెందుకు వెళ్తున్నాను. గంగా నందుడున్నంత వరకు ఈ ప్రశ్నతో పనిలేక పోయింది. ఎక్కడికైనా వెళ్ళాలి. ఏమయినా చెయ్యాలి...

తోడుగా మరొక సన్యాసి దొరికాడు. నేను వెంట ఇంతవరకు వచ్చాను. ఇంక ఎంత త్వరగా నడిచినా ఆయన దొరికే అవకాశంలేదు. నేనొక్కడినే సముద్రంవరకు వెళ్ళి, మళ్ళీ గంగ్రోతిని చేరి చేయాల్సినదేముంది? ఉద్దేశరహిత సంచారం చేసి మళ్ళీ జబ్బుపడినా పడవచ్చు దీన్నిక్కడితో వదిలెయ్యడమే గురి అనిపించింది. అప్పుడా వృద్ధుడిని అడిగాడు. "మా వంటి సన్యాసులు వుండటానికి ఇక్కడ తగిన చోటేమయినా వుందా బాబూ!"

"బనారస్‌కి వెళ్ళండి మహారాజ్. సన్యాసులకి, సరి అయిన ఊరే అదికదా!"

"ఎన్ని మైళ్లుంటుంది? "

"ముప్పైమైళ్ళు ఇక్కడ్నుంచి తూర్పుకి మూడు మైళ్ల నడచివెళ్తే బస్సు దారి వుంది'

ఆ ఊళ్ళో భిక్ష స్వీకరించి ఆరోజే అతను బనారస్‌కి బయల్దేరాడు.

కాశీని అతను అంతకుముందు చూశాడు. పదిహేనేళ్లక్రితం... అక్కడ గంగానదిని, స్నానఘట్టాలని చూసి అలౌకికాకర్షణకి గురి అయ్యాడు. మురికి ఓడుతో వుండి, పీక్కుతిని పీడించే భిక్షుకులని తప్పిస్తే ఆ నగరాన్ని మళ్ళీ చూడాలన్న ఆశ చాలా రోజులవరకు ఉండేది.

రోజుకి కొద్దికొద్దిగా నడిచి ఐదురోజుల్లో కాశీ చేరాడు. దశాశ్వమేధ ఘట్టానికి వెళ్ళి చూస్తే గంగ పిచ్చిపిచ్చిగా నిండి ఉరుకుతోంది. ఎదురుగా రెండు మైళ్ళ దూరంవరకు ప్రవాహపాత్ర విస్తరించింది. వర్షాకాలపు ఈ ప్రవాహంలో బయలు సీమనుండి వచ్చిన చెత్త-చెదారం, చచ్చిన శవాలు, పశువులు, బళ్ళు, నాగళ్లు, చెట్టుచేమలు, కొమ్మలు రెమ్మలు- ఏవేవో పైనుంచి కొట్టుకునొస్తాయి. ప్రవాహాన్ని అదుపులో పెట్టే శక్తి ఎవరికి వుంటుంది? ప్రవాహంలో చిక్కి తట్టుకునే శక్తి అంతకంటే వుండదు. కొండలమీద గడ్డకట్టిన- ప్రవాహమే లేని నది జ్ఞాపకం వచ్చింది.

ఎంతోసేపు అలా నదిని చూస్తూ నుంచుండిపోయాక కడుపు ఖాళీగా వుందన్న జ్ఞానం కలిగింది. ఈ నగరంలో తనలాంటి సన్యాసికి ఒకటే మార్గం. స్నానఘట్టం దగ్గరో, ఏదయినా మందిరంముందో ఒక భిక్షాపాత్ర పెట్టుకుని కూర్చోడం. మొదట్లో ఆ పనిని అతడు హీనంగా భావించి తిరస్కరించేవాడు. కాని ఇప్పటి స్థితివేరు. ఇల్లు-వాకిలి, నౌకరీ అన్నీ త్యజించి వచ్చినవాడు తను. ఇన్నిరోజులు భిక్ష అడుక్కోవడం అలవాటయిపోయింది. తనలాంటివాళ్లు వందలకొద్దీ ఉన్నారిక్కడ.

అందువల్ల ఇలా అడుక్కోకుండా ఇంకేమి చెయ్యడం? అని ఆలోచించి విశ్వనాథుడి మందిరంవేపు మళ్ళీ గల్లీలో ఒకచోటు చూసుకుని తుండుపరచి నెమ్మదిగా కూర్చున్నాడు. కొద్దిసేపటికి డబ్బులు పడ్డాయి.

అంతలో మరో సన్యాసి అక్కడకి వచ్చి ఆ డబ్బులమీద చెయ్యి వేశాడు. అతడూ జటాజూటాలు పెంచిన కాషాయ వస్త్రధారియే. ముఖం కోపంతో మండిపడుతోంది. అతను డబ్బులు తీసి నడుములో దోపుకున్నాడు. "ఈ చోటు నాది. వచ్చి ఆక్రమించుకు కూర్చున్నంత మాత్రాన ఈ డబ్బులు నీవి కావు. లేచిపోరా ఇక్కడ్నుంచి"

'ఆప్' అనకపోతే పోయె, 'తుమ్' అని కూడా అనకుండా 'తూ' అని ఎంత హీనంగా మాట్లాడుతున్నాడు. సందర్భం తెలియక ప్రశ్నార్థకంగా చూశాడు. ఇతని చూపుకి అతడు, "మర్యాదగా లేవకపోతే ఒక్కతన్ను తంతాను వెళ్ళి గంగాజీ





మధ్యలో పడతావు" అని హుంకరించాడు. అదే వరుసలో కూర్చున్న మిగతా సన్యాసులు గుంపుగా చేరారు. ఇది అతడి చోటే నని సాక్ష్యం పలికారు. "సరే, నేను మరో చోట కూర్చుంటాలెండి" అనేసి లేచి వరుసలో చివర కూర్చున్నాడు. అయినా వాళ్ళు వదిలిపెట్టలేదు. "ఇది మొత్తం మాచోటు, బయటివాళ్ళని చేరనివ్వం" అనేశారు. "కూర్చుని అడుక్కునేచోట హక్కులేమిటి? " అని అతనడిగితే, "ఈ ఊరికి కొత్తవాడిలా వున్నాడు. ఇక్కడి పద్ధతులు తెలిసినట్టుగా లేవు. గంగాజీకి అప్పజెప్తే తెలుస్తుంది" అని బెదిరించారు. వీళ్ళతో తగువెందుకని అతనే అక్కడ్నుంచి వెళ్ళిపోయాడు.

హిమాలయాలెప్పుడూ ఒక్కలాగే వున్నాయి. కాశీ నగరమే బాగా పెరిగిపోయింది. హిమాలయాలు 'నిస్సంగం' కావాలనుకునేవారికి ఆశ్రయం ఇస్తాయి. కాని కాశీ 'సంగం' (సాంగత్యం) కోరుకునేవారి పరివార కేంద్రం. ఇక్కడ భక్తి వుంది. సంగమూ వుంది. ధ్యానం అనేది జడమైపోయి గడ్డకట్టిన మౌనంగాకాక, చెవులనాకర్షించే గందరగోళంలో దొరుకుతుంది. సమస్తపురాణాల, దేవుళ్ళ, దేవతల సంసార క్షేత్రం కాశీ. దేవుళ్లనీ, దేవతల్నీ ఖండించాలని వచ్చిన బుద్ధుడు కూడా ఈ క్షేత్రం దగ్గర దేవుడయ్యాడు.

నిస్సంగానందుడు కాశీకి బాగా అలవాటు పడ్డాడు. ఇంచుమించు ఆ ఊరివాడైపోయాడు. దశాశ్వమేధ ఘట్టంలో ఒకచోటు సంపాదించుకున్నాడు. రోజూ వచ్చే వేలాది యాత్రికులలో కొందరి పుణ్యసంపాదన తాలూకు లౌకిక ఫలం అతడి కమండలంలో పడేది. రాబడి బాగానే వుండేది. ఒక్కోనాడు కాస్త ఎక్కువగానూ వుండేది. అతడు ఏనాడూ భిక్ష పడిందా లేదా అనే ధ్యాసలో ఉండేవాడు కాడు. మనసంతా దేవునిమీద, పురాణాలమీద లగ్నమై వుండేది. లేచిన వెంటనే నదిలో స్నానం చేస్తాడు. మధ్యాహ్నంవరకు ఘట్టంలో కూర్చుంటాడు. పూరి, చపాతి, మిఠాయి, హల్వాలాంటి మృష్టాన్నాలకి కాశీలో కొదవ లేదు. పెద్ద ఖరీదు కూడా వుండదు. ఒక పూటకి తనకి కావలసినది తింటాడు. మధ్యాహ్నం విశ్రాంతి. సాయంకాలం భజన, కథ. రామాయణ, భారత శ్రవణంలో కాలం గడచిపోతుంది.

నిరాకార, నిస్సంగ, ఒంటితనపుతత్వం కంటే సంగం, సాకార దేవదేవతల పూజల వల్ల ఉపయోగాలని అన్ని హరికథల్లోనూ చెబుతారు. సాకారమైన దేవుడు, నిరాకారుడైన దేవుని ప్రత్యక్ష స్వరూపం. ఈ ప్రత్యక్ష రూపాన్ని పూజించి ఆ నిరాకార రూపాన్ని చేరాలని ఆ వ్యాఖ్యల సారాంశం. ఒకప్పుడు మంత్రతంత్రాలకు విరోధి అయిన నరహరి ఇప్పుడు పురాణదేవతల్ని ఒప్పుకుంటున్నాడు. వాటి అంతరార్థం గురించి ఆలోచిస్తున్నాడు.

సోనాపూర్ రస్తాలో ఒక ఆశ్రమంలో ఇతని వసతి. పైఅంతస్తులో ఒక మూల తన కంబళి, రజాయి పెట్టుకుంటాడు. పొద్దున్నే వాటిని చుట్టి అక్కడే గోడపక్కన పెట్టి నదీ ఘట్టానికి వెళ్తాడు. వాటినెవరూ ఎత్తుకుపోరు. ఎంతమందో సన్యాసులు అలాగే పెట్టి వెళ్ళిపోతుంటారు.

ఇతనితోపాటు మరో సన్యాసి అక్కడే వుంటాడు. సుమారు అతని వయసువాడే. ఇతను భిక్షమెత్తే చోటే అతనూ కూర్చుంటాడు. ఇతను పడుకునే స్థలంలోనే పడుకుంటాడు. ఇతనికొకసారి అనారోగ్యం చేసినప్పుడు సేవ చేసింది కూడా అతడే. అతడి పేరు బన్నీ మహరాజ్. జటాజూటాలు, కాషాయవస్త్రాలు, మెడలో జపసరాలతో అతడు నిస్సంగానందుడికంటే ఎక్కువ కళగా కనిపిస్తాడు. మనిషి నిండుగా వుంటాడు. ఆయనొక్కొక్కసారి తులసీరా

మాయణ పద్యాలు చెప్పడం ప్రారంభిస్తే నిస్సంగానందునికి ఇంకా ఇంకా వినాలనిపిస్తుంది. బన్సీ మహారాజ్ భంగు పీలుస్తారు. ఒక్కోరోజు విశ్వనాథుని ప్రసాదం అంటూ భంగ్ సేవిస్తారు. అందువల్ల ఏకాగ్రత పెరుగుతుందని ఆయన చెప్తారు. ఎంత స్నేహితుడైనా, ఆయనెంత బలవంతం చేసినా నిస్సంగానందుడు ఒక్కనాడు కూడా వాటిని ముట్టుకోలేదు. అలాగని తోటివారితో వాటిని సేవించకూడదనీ చెప్పలేదు.

ఒకరోజు వాళ్ళిద్దరూ తమ పూర్వాశ్రమాల గురించి మాట్లాడుకున్నారు. బన్సీ మహారాజ్ స్త్రీ ప్రేమలో దెబ్బతిన్నాడు. తాము కోరుకున్న స్త్రీని పొందలేకపోయి జీవితంలో విరక్తి పొంది వచ్చి సన్యాసిగా మారిపోయారు. సంసారి-దుఃఖి, సన్యాసి-సుఖి. నాకిలా కావడం మంచిదయిందని భంగు వెలిగిస్తారు. ఆయన సన్యాసాశ్రమం తీసుకుని పది పదిహేడేళ్ళయిందట.

★ ★ ★

నిస్సంగానందుడు ఇక్కడకొచ్చి మూడు చలికాలాలు, నాలుగు వేసవులు గడిచాయి. అతనదేమీ లెక్కలు పెట్టుకోలేదు. ఈసారి చలికాలం దగ్గరకొచ్చింది. ముందే కొత్త రజాయి కుట్టించాలని బన్సీ మహరాజు అన్నప్పుడు అతనికి ఉన్నట్టుండి తను ఇక్కడికొచ్చి ఎన్నేళ్లయిందో గుర్తొచ్చింది. మళ్ళీ చలికాలం వస్తోంది. చలికాలం వచ్చినప్పుడల్లా పైన హిమవత్పర్వతాల అనుభవం జ్ఞాపకం వస్తుంది. అక్కడున్నప్పుడు అసహనీయంగా అనిపించిన గడ్డకట్టిన జీవనం, అక్కడ్నుంచి పారిపోయి వచ్చేశాక మళ్ళీ ఆకర్షిస్తోంది. కాశీలో అన్నీ ఉన్నాయి. హిమాలయాలు లేవు. ఏకాంతం లేదు. ఒంటరితనం లేదు. అందుకే భక్తుల్ని ఎక్కువ ఆకర్షిస్తోంది. ఇక్కడకి వచ్చిన ఇన్ని రోజుల్లో తను సాధించినదేమిటి? కష్టపడకుండా, అసలు ప్రయత్నమే చేయకుండా పడే చిల్లరడబ్బులు. మధ్యాహ్నం భోజనం, భజన, పురాణాలు, రాత్రులు నిద్ర. తానెక్కువ మాట్లాడకపోయినా చాలామంది సాధు సన్యాసుల పరిచయం అయింది. తనకి ఇంగ్లీష్ వచ్చునని బన్సీ మహారాజ్ ద్వారా చాలామందికి తెలిసింది. అనేకమంది సాధువులు తమకి భిక్షవల్ల వచ్చిన సొమ్ములో మిగిల్చి తమ ఊరికి మనీఆర్డర్లు పంపిస్తారు. కేవలం మనిఆర్డర్లు పంపించడం కోసమే ఎంతోమంది ఇక్కడ 'సన్యాసి' ఉద్యోగం చేస్తున్నారు. ఫారం రాయించుకోడానికి తమ దగ్గరకి వస్తారు. మొత్తంమీద కాలక్షేపం అయిపోతుంది. కాలక్షేపమే తన గురి అయితే టైపిస్ట్‌గా కూడా కాలం గడిపి వుండొచ్చుగా! ఓవర్‌టైం చేస్తే సాయంకాలాలు కూడా గడచిపోయేవి.

ఒకరోజు విశ్వవిద్యాలయం దిశగా వెళ్ళాడు. ఇంగ్లీష్‌లో రెండు ఉపన్యాసాలు విన్నాడు. మతం-ధర్మం-నీతి ఈ విషయంలో ఆధునిక ధోరణి ఆకర్షణీయంగా కనపడింది. అక్కడ ఇలాంటి లెక్చర్స్ ఎప్పుడుంటాయో తెలుసుకుని తరుచు వెళ్ళడం ప్రారంభించాడు. కాని కొద్దిరోజులకి అందులోనూ ఆసక్తి తగ్గిపోయింది. సరే ఇవన్నీ విని ఏమి చేయాలి? ఏమి జరుగుతుంది? అనిపించింది. భజనలో ఆసక్తి లేదు. మధ్యాహ్నం భోజనం చేసి తన వసతికి వచ్చి పడుకునేవాడు. బాగా నిద్ర వచ్చేది. అదీ ఒక విధమైన కాలయాపనే. ఐదారురోజులు అలా జరిగింది. తరువాత ఒక ప్రశ్న పుట్టింది. 'ఇలా నిద్రపోయి సాధించేదేమిటి?' అని దానితో నిద్ర కూడా రావడం తగ్గిపోయింది. మధ్యాహ్నమే కాదు, రాత్రుళ్ళు కూడా నిద్రరాక పొర్లే పరిస్థితి వచ్చింది. ఆ ఊరినే వదిలేసి ఎక్కడికన్నా వెళ్ళిపోదామనిపించింది? కాని ఎక్కడకి వెళ్ళడం?




కాని తనేమీ ఉద్దేశం పెట్టుకుని రాలేదు. సంకపాడ'లో ఉద్దేశరహితంగా, ధ్యేయం లేకుండా ఆగిపోయాడు. అక్కడెవరో సన్యాసి దొరికాడు. అతనికి తోడుగా బయ ల్దేరాడు. జ్వరంవల్ల మధ్యలో తన దారి ఆగి పోయింది. సరే కాశీ వచ్చాడు. ఇక్కడ్నుంచి ఎట్టైనా పోవాలంటే మళ్ళీ అలాంటివాడే మరొకడు తోడు దొరకాలి. నిజమైన సన్యాసం స్వీకరించినవాడెవరూ ఇక్కడ మకాం పెట్టడు. అలాంటివాళ్ళంతా మూడు రోజులుండి వెళ్ళిపోతారు. నాకు దారి చూపి వెంట తీసికెళ్ళేవాడెవరు? వేలాది నకిలీ సాధువుల మధ్య అలాంటి అరుదైన సన్యాసులని వెతకడం ఎలా? దొరికినా వాళ్లు తనకి సహాయపడతారనే నమ్మకం ఏమిటి?

ఉన్నట్టుండి ఒక నిజం అర్థమైంది. హృషీ కేశ్ దగ్గర్నుంచి కిందకి జారాక తనలో సంకల్పశక్తి నశించింది. మొదట సఫలమో, విఫలమో ప్రయత్నమన్నా చేసేవాడు. తన ప్రయత్నం లేకనే గంగానందుడివల్ల ఇక్కడి కొచ్చిపడ్డాడు. ఇక్కడ యుగయుగాలుగా జరుగుతున్న జీవన విధానమే తన జీవి తాన్నీ నడిపిస్తోంది. పూర్వం రాజులు, మహారాజులు ధర్మశాలలో సన్యాసులకి నిత్యం భోజన సంతర్పణ చేసేవారట. ఇప్పుడు యాత్రికులు వేసే భిక్షవల్ల ఆ పని అదే జరిగిపోతోంది. ఇక తన ప్రయత్న మంటూ ఏముంది? నేను చేస్తున్నదేమిటి? మళ్ళీ హృషీకేశ్ వెళ్ళి అక్కడినుంచి పైకి ఎక్కడానికి ప్రయత్నించనా? పైకి ఎక్కాలనే ఆకర్షణ వుంది. కాని దానికి తను తగిన వాడు కాదని అంతరాత్మ నొక్కి చెప్పేది. మళ్ళీ ఇక్కడుండి చేసేదేమిటి? అని పగలు, రాత్రి వేధిస్తున్న ప్రశ్నతో నలిగిపోతున్నాడు తను.

★ ★ ★

ఒకరోజు బన్నీమహారాజ్ అడిగారు: "ఎందుకిలా అయిపోతున్నారు? రాత్రి నిద్ర పోకుండా పొర్లుతుంటారుకదా ఏమిటంత ఆలోచన? "

"జీవితం గురించిన ముఖ్య విషయం"

అదేమిటో బన్నీ మహరాజ్‌కి అర్థం కాలేదు. ఒక వారంవరకు ఆయన సర్దిచెప్ప డానికి ప్రయత్నించారు. నిస్సంగానందుడు తన ఆధ్యాత్మిక సమస్యని చెప్పుకునేవాడు. "పూర్తి ఒంటరితనం సాధించలేకపోయాను. ఆ కోరిక అలాగే వుండిపోయింది. దీనికి పరిహారం ఏమిటో, ఎలాగో బోధ పడటం లేదు" అన్నాడు. అది ఆ బన్ని మహాస్వా మిగారికెలా అర్థమైందో ఏమోగాని, ఒక చిరునవ్వు నవ్వి ఊరుకున్నారు.

ఇది జరిగిన రెండురోజుల తరువాత ఇద్దరూ ఒక సాయంకాలం విశ్వనాథుడి మందిరంవైపు బయల్దేరారు. అక్కడ్నుంచి బట్టలు, గాజులు, ఫ్యాన్సీ సామాన్లమ్మే ఒక సందులోకి తిరిగారు బన్నీ స్వామిగారు. ఇదేమిటి ఇటువైపు...? అనడిగితే పదండి కొంచెం పనుంది అంటూ చెయ్యి పట్టుకుని లాక్కెళ్ళారు. బనారస్ అంటే అన్నీ సందు గొందులే. స్థానికులకే ఎన్నో సందులు, సరిగ్గా దారి తెలియదు. నిస్సంగానందుడు మౌనంగా ఆయన వెంట వెళ్ళాడు. రెండు సందులు తిరిగాక హార్మోనియం, గజ్జెలచ ప్పుడు వినిపించే ఒక సందులోకి వచ్చారు. కిందంతా దుకాణాలు. ప్రతి ఇంటి పైఅంత స్థునుండి వాద్యధ్వనులు, పాయల్‌బాజే. రంగురంగుల గుమ్మం తెరలు. ఒక ఇంటి ముందు పెద్ద అక్షరాలతో బోర్డు: 'మీ ఇంట జరిగే వివాహాలకు, మరే ఇతర శుభకార్యా లకైనా శోభను చేకూర్చండి, ప్రసిద్ధ ప్రాచీన నాచ్‌వాలీలు ఇంటికొచ్చి నాట్యం చేస్తారు. పైకి వచ్చి విచారించండి.'

నిస్సంగానందుడికి అర్థమయిపోయింది. అతనడిగాడు, "ఇది వేశ్యావీధికదా? "

"ఊం, దాల్‌మండీ. ఎందుకలా భయప

పతున్నారు? ఈ పవిత్ర క్షేత్రంలో నిత్యసౌభాగ్యవతులకి, ముత్తైదువులకి పెద్ద తేడా లేదు. ఇక్కడన్నీ పవిత్రమే హరిశ్చంద్రుడి కాలంలో..." అని ఆయన చెప్పేలోగానే నిస్సంగానందుడు, "ఇక్కడ్నుంచి వెళ్ళిపోదాం



రండి" అని త్వరత్వరగా అడుగులు వేశాడు.

"ఈ వీధిలోకి వచ్చినవాళ్ళంతా లోపలకి వెళ్ళాలనేం లేదు. భయపడకండి. ఇటు రండి అని అతని చెయ్యి పట్టుకుని బన్సీమహారాజ్ పక్కసందులోకి తిప్పారు.

అక్కడ వాయిద్యాల సద్దులేదు. రంగురంగుల పరదాలు లేవు. ఇరవై అడుగులు ముందుకు వెళ్ళి అక్కడ మసక చీకటి వున్న ఒక ఇంటిలోకి అడుగుపెట్టారు మహరాజ్ గారు. బయటే నుంచుండిపోయిన నిస్సంగానందుని "లోపలకి రండి ఇక్కడొక సన్యాసి ఉన్నారు" అని పిలిచారు.

ఇద్దరూ మేడమెట్లు ఎక్కారు. లోపల నాలుగారు గదులున్నాయి. లోపలనుండి పలుచటి వెలుతురు బయటికి వస్తోంది.





అందులో ఒక గదిలోకి నిస్సంగానందుడితో బన్సీ మహారాజ్ గారు ప్రవేశించారు. చాలా పేదగృహం. కూర్చోడానికి చాపమాత్రం ఉంది. మట్టినేల. చాపమీద ఒక పాతకంబళి పరచివుంది. మహారాజ్ పిలిచారు "లల్లూ"

"వస్తున్నా" అంటూ ఒక స్త్రీ వచ్చింది.

చూడగానే ఆమె వేశ్య అని స్పష్టంగా అర్థమవుతోంది. రాగానే ఇద్దర్నీ చూసి, "చమేలీ' అని పిల్చింది. పక్కగదిలోంచి మరొక స్త్రీ వచ్చింది. "మీకెవరు కావాలో ఎంచుకోండి" అన్నాడు మహారాజ్.

నిస్సంగానందుడికి కోపం వచ్చింది. "మీరిక్కడకి ఎందుకు..."

అని చికాగ్గా అంటుంటే లల్లూ వచ్చి అతని కాళ్ళు పట్టుకుని "మీరేమీ మనసు కష్టపెట్టుకోకండి. మీ పాదదాసులం మేము. పెద్దవాళ్ళెవరూ ఇక్కడకి రారు. మీలాంటి సాధుమహారాజ్‌ల సేవచేసి పుణ్యం సంపాదిస్తాం. మీరు ఆశీర్వదించి ఇచ్చినదెంతో అంతే స్వీకరిస్తాం. వ్యాపారధోరణి, బేరాలు, తగువులు లేవు" అంది.

"డబ్బు సంగతి నాది" బన్సీ మహారాజ్ గారు శలవిచ్చారు.

నిస్సంగానందుడు తనకొచ్చిన కోపాన్ని శాంతింప చేసుకున్నాడు. అక్కడ్నుంచి లేచి బయల్దేరాడు. బన్సీ మహారాజ్‌గారు ఆపి కూర్చోబెట్టారు. ఆయనెంత బలవంతం





చేసినా ఇతడు లొంగలేదు. "ఊరికే ఎందుకు సమయం దండగ చేయడం? ఆయన ఒద్దంటున్నారుగా" అంది లల్లూ.

"అయితే నేనుంటానులే" అని చెప్పి బన్నీ ఆమెతో గదిలోకి వెళ్ళారు. రెండు నిమిషాలు ఉట్టినే నుంచున్న చమేలీ పెదవుల్ని వంకరగా తిప్పి ఒకసారి 'ప్చ్' అనేసి లోపలికి వెళ్ళిపోయింది.

నిస్సంగానందుడొక్కడే అక్కడ మిగిలాడు. అతనికి లేచి వెళ్ళిపోవాలనిపించలేదు. అక్కడ కూర్చోవాలనీ అనిపించలేదు. ఊరికే కూర్చున్నాడు. మనసు ఇలాంటి సంఘటన్నే నెమరువేసుకుంటోంది. తన పెళ్ళి కావడానికి మూడు నాలుగేళ్ళముందే బొంబాయిలో రామకృష్ణ ఇలాంటిచోటికే ఒకసారి తీసికెళ్ళాడు. ఫ్యాన్, కుర్చీ, టేబుల్, మంచం అన్నీ వున్న ఆ ఇంటిని చూస్తే కొంచెం కూడా అనుమానం రాలేదు. లోపలకి వెళ్ళి కూర్చున్నాక నలుగురైదుగురు అమ్మాయిలొచ్చారు. ఎన్నుకోమని రామకృష్ణ అన్నాడు. తనకి కాళ్ళు, చేతులు వణకడం మొదలయింది. అతడు మెల్లగా "మొదటిసారి అందరికి ఇలాగే వుంటుంది.

భయపడాల్సినదేంలేదు. మీకు నచ్చిన పిల్ల వేపు వేలు చూపించండి. మీరు డబ్బేమీ ఇవ్వద్దు. ఇవ్వాల్టికి మీరు నా గెస్ట్" అన్నాడు. తను ఒప్పుకోలేదు. ఇప్పుడు ఈయన చేసినట్టే రామకృష్ణ లోపలకి వెళ్ళాడు. మిగిలినవాళ్ళు బాల్కనీలో నుంచు న్నారు. తనకి అక్కడా ఆ ఇంటి గురించి తెలియలేదు. ఇక్కడా ఈ ఇంటి గురించీ పైకి వచ్చేవరకూ అర్థం కాలేదు. అప్పుడు రామకృష్ణమీద తిరస్కారభావం కలిగింది. కాని అతను అలా వెళ్ళే అలవాటు తనకి ఎప్పుడేనా ఉందని అంతకుముందే చెప్పాడు. అందుకని అప్పుడు అదేదో కొత్త సంగతి అని అనుకోలేదు. తనని అలా తీసి కెళ్ళడం మాత్రం తప్పు అనుకున్నాడు. కాని తనకి పొగాకు అలవాటు చేసింది అతనే కదా. అలాగే ఇది కూడా అలవాటు చేద్దా మనుకున్నాడేమో.

తరువాత అనిపించింది. పొగాకుకి లొంగిపోవడం తన తప్పు. వేశ్యలకి బలికా కుండా ఉండటం తన వివేకం. ఎవరిమీదా కోపం తెచ్చుకోకూడదు. తనని తను నిగ్ర హించుకోవాలి. రామకృష్ణమీద కోపం తగ్గిం దప్పుడు. అతనూ వేదాంతం చదివేవాడు. సిగరెట్టూ కాల్చేవాడు. ఒక్కోనాడు తాగే వాడు. అరుదుగా ఈ పనీ చేసేవాడు. అలాంటివాడితో తనకెలా కుదిరిందో అసలు? అదే ఆశ్చర్యం. అంతేకాదు. అతని చెల్లెల్ని కూడా పెళ్ళాడాడు. అతను మరణిం చాక ఆ కుటుంబ బాధ్యత కూడా మోశాడు తరువాత.

ఆ తరువాతిదంతా గుర్తురావడం మొద లైంది. అంతలో బన్సీ మహారాజ్, లల్లూ ఇద్దరూ మరో గదిలోంచి బయటకొచ్చారు. "స్వామివారికేమన్నా దయ కలిగిందా?" అని ఆమె కూర్చున్న ఇతని పాదాలని మరో సారి తాకింది. బనారస్ పద్ధతే అంత. అన్నింటికి నయం, వినయం, అతివినయం. కాని ఈమె పద్ధతి చూస్తుంటే అదోరకమైన సహజత్వం కనిపించింది. ఇతను లేచి బయటకొచ్చాడు. బన్సీ మహారాజ్ అనుస రించారు. ఇద్దరూ మెట్లుదిగి కిందకొచ్చారు. బన్సీగారు తన తప్పుని సమర్థించుకుంటున్న ట్టుగా...

"చాలా మంచి మనిషి. నేనొక్కడినే కాదు, ఎందరో సాధు సన్యాసులొస్తుం టారు. దేహధర్మాన్ని గెలిచినవారెవరు?"

"పోన్లెండి. నేనేమీ వ్యాఖ్యానించలేదుగా" అని మౌనం వహించాడు. తన సంసార జ్ఞాపకాలు వరుసగా రాసాగాయి. లలిత రావడం. భవాని, విజయుల పుట్టుక, తను ఒంటరివాడైపోవడం. అత్తగారు మరణించి, వైదేహిని పెళ్ళాడక తప్పని పరిస్థితి రావడం...

ఆరోజు రాత్రంతా పిల్లలవే జ్ఞాపకాలు. పోయినవాళ్ళెలాగూ పోయారు. బ్రతికున్న పిల్లలు కూడా తన పాలిటికి లేకుండాపో యారుకదా! పరిస్థితి అలా వచ్చింది. తను ఇంకేం చెయ్యగలిగేవాడు? అని తనని తను ఓదార్చుకోడానికి ప్రయత్నించాడు. కాని అదృశ్యంగా వున్న దోష స్పృహ యాతన పెడుతూనే వుంది. పిల్లల్ని దత్త తిచ్చే తన నిశ్చయంలో ఒంటరితనం కోరు కునే సుప్త ఆశయపు పాత్ర కూడా ఉంది. తరువాత తను ఒంటరివాడయ్యాడు. అప్పుడు సాధించినదేమిటి? ఈ ఉద్దేశర హిత, శక్తిహీన జీవితమా?



ఒక వారం తరువాత మధ్యాహ్నంపూట విపరీతమైన తలనొప్పి వచ్చింది. నది ఒడ్డున కూర్చుని దోసిళ్ళతో నీళ్ల తీసుకుని నెత్తికి తట్టుకుంటూ కూర్చున్నాడు. తల నొప్పి తగ్గిందో, లేక మనసు మరో విషయం మీదకి మళ్ళిందో, మొత్తంమీద కొంచెంసేపు అలాగే కూర్చున్నాడు. మనసు తేలికయ్యాక నీటిలో కనిపించే తన ప్రతిబిం

బంవేపు తన ధ్యాస మళ్ళింది. మధ్యాహ్నపు వేళ కావడంతో స్నానఘట్టం దగ్గరెవ్వరూ లేరు. నీళ్ళలో కనిపిస్తున్న తన రూపాన్నే చూసుకుంటూ కూర్చున్నాడు. ఏదో రహస్య మయమైన ఆకర్షణ కలిగింది. చెదిరి అస్త వ్యస్తంగా పడివున్న జటాజూటాలకన్న ముఖం, దేహం స్పష్టంగా కనిపిస్తోంది. అదే చూస్తూ ఎంతోసేపు కూర్చున్నాడు.

ఉన్నట్టుండి నదీతీరాన బట్టలుతుకుతూండిన తల్లి రూపం గుర్తొచ్చింది. తను దగ్గర్లోనే ఆటలాడేవాడు. అదే జ్ఞాపకం ఎదలో తుల్లోంచి తన్నుకొచ్చి మనసునిండా నిండి పోయింది. ఉన్నట్టుండి ఇవాళ ఎందుకిలా అవుతోంది? అని ఆశ్చర్యపోయాడు. జవాబు దొరకలేదు. అంతలో దగ్గర్లో ఎవరో బట్టలుతుకుతున్నట్టయింది. నీరు చెదిరి తన ప్రతిబింబం కలిసిపోయింది. తలతిప్పి చూశాడు. ఒక స్త్రీ కుడికాలు నీళ్ళలో పెట్టి, ఎడమకాలు మెట్టుమీద పెట్టి చీర గుంజుతోంది.

ఇక అక్కడ కూర్చోబుద్ధి కాలేదు. లేచి మెట్లెక్కి పైకి వచ్చాడు. ధర్మశాలకి వెళ్ళి పడుకోవాలనిపించింది. కాని సగం దూరం వెళ్ళేసరికి జ్ఞాపకం వచ్చింది- నదిలో బట్టలు తుకుతున్న స్త్రీనెక్కడో చూసినట్టు. ఎక్కడో స్పష్టంగా గుర్తు రాలేదు. ఎవరామె? అన్న కుతూహలాన్ని తట్టుకోలేక మళ్ళీ వెనక్కి తిరిగాడు. స్నానఘట్టం దగ్గర కొచ్చేసరికి ఆమె లేదు. వెళ్ళిపోయింది. ఎవరో, ఏమో. రోజూ తనున్నవేపు వచ్చి భిక్షవేసి వెళ్తూం టుందేమో అనుకుని ఊరుకుండిపోయాడు.

ఆరోజు రాత్రి లలిత గుర్తొచ్చింది. పెళ్ళయిన ఏడెనిమిది నెలలకి కాబోలు, ఆమె గర్భవతి. తనకిలాగే తలనొప్పి వచ్చింది. ఇంటికొచ్చి చెప్పగానే, 'వేడిచేసి వచ్చి ఉంటుంది, ఆగండి' అని చెప్పి నెయ్యి తీసుకొచ్చి, తన తల తొడమీద పెట్టుకుని నొప్పి తగ్గేవరకూ నేతితో నుదుటిమీద రుద్ది తల పట్టింది. తగ్గింది అని చెప్పేవరకు నుదుటి నరాలను రుద్దుతూనే వుంది. తగ్గాక, పోటు వస్తున్న తల నరంమీద తన కుడిచేతిని ఆనించి తనని దగ్గరగా లాక్కుని ఎంతో సేపు అలాగే కూర్చుండిపోయింది. కడుపులో వున్న బిడ్డకి అప్పుడు ఐదునెలలయి వుండొచ్చు.

మూడు, నాలుగురోజులు పగలు, రాత్రి లలితదే తలపు. ఆ జ్ఞాపకాలు వదలనే లేదు. ఎప్పుడూ లలిత ముఖమే మనసు ముందు నిలిచేది. నీళ్ళల్లో కనిపించే బింబంలా. ఆమెకి భర్త అంటే ఒకవిధమైన శిశువాత్సల్యం. దానితోపాటు దైవంమీద ఎటువంటి భక్తో, భర్తమీద కూడా అంతే. బిడ్డని లాలించినట్టు ఒళ్ళో పడుకోబెట్టుకుని దగ్గరకు లాక్కునేది. పండుగల్లో, పబ్బాల్లో పూజ కాగానే తన రెండు కాళ్లనీ తాకి నమస్కరించేది. అలా తన కాళ్ళు ముట్టుకుని నమస్కరించిన స్త్రీ ఆమె ఒక్కతే.

కాని మర్నాడు గుర్తొచ్చింది. బన్సీ మహారాజ్ తీసికెళ్ళిన ఇంట్లోని వేశ్య కూడా ఇతని కాళ్ళని వెచ్చగా తాకి మాట్లాడింది. ఆమె మాటల్లో ఒకరకమైన భక్తిభావం వున్నట్టు మనసుకి తోచింది.

అలా లలిత జ్ఞాపకాలు వేధిస్తూనే వున్నాయి. ఆ మధ్యాహ్నం భోంచేసి ధర్మసాల చావడిలో పడుకున్నాడు. బాగా నిద్రపోయాడు. మూడు గంటలకి లేచేవేళకి పూర్తిగా ఆ వేశ్య గురించిన ఆలోచన మనసునిండా నిండిపోయింది. ఆరోజు ఆమెనేదో పేరు పెట్టి పిలిచారాయన. సరిగ్గా గుర్తు రావట్లేదు. లలితే కావచ్చు తను చాపమీద కూర్చున్నాడు. ఆమె భక్తిగా కాళ్ళు ఒత్తి మాట్లాడుతోంది. ఆమె ముఖం స్పష్టంగా గుర్తులేదు. ఉన్నట్టుండి తోచింది. ఆరోజు నదిలో బట్టలుతికింది ఆమె కాదు కదా!

మూడురోజులయింది. వెళ్ళి ఆమెను



చూడాలనే కోరిక మరింత బలంగా కలిగింది. తను వేశ్యాగృహానికి వెళ్ళడమా అనే ఊహకే వెగటు కలిగింది. తనమీద తనకే కోపం వచ్చి ఒకసారి చెంపదెబ్బ వేసుకుందా మనిపించింది. ఆ ఆలోచనని మరవాలని మధ్యాహ్నం భోజనం తర్వాత భిక్షగాళ్ళ పంక్తిలోకి. వెళ్ళి కూర్చోడం మొదలుపెట్టాడు. ఒకరోజెలాగో గడచింది. మళ్ళీ రెండోరోజు అదే ఆలోచన. తాను వెళ్దామనుకున్నది ఆమెని చూడటానికి మాత్రం. ఆమెతో సంబంధం పెట్టుకోడానికి కాదు. మునుపెప్పుడూ పరాయి స్త్రీని కామదృష్టితో తలెత్తిచూడని తను, ఇప్పుడు ఈ వయసులో ఇన్నిరకాల అనుభవాలయ్యాక, మామూలు మనిషిలా వేశ్యాగృహాలకి వెళ్ళి కూర్చోవడం జరిగే పనికాదు అని అతడి మనసు అంది.

రెండోరోజు మధ్యాహ్నం మూడుగంటల వేళ ఒక్కడే దాల్‌మండీవేపు వెళ్ళాడు. ముందు సందులు ఏవిఏవో తెలియలేదు. చుట్టు తిప్పలు చాలా అయ్యాక ఆ ఇల్లు దొరికింది. మెట్లు ఎక్కి పైకి వెళ్ళేటప్పుడు చేతులు, కాళ్లు వణికాయి. నుదుట చెమటలు పట్టేశాయి. బయట ఎండ కూడా అంతే తీవ్రంగా వుంది. బన్నీ మహారాజుగారితో లోపలకి అడుగుపెట్టిన వాకిట్లోనే నుంచున్నాడు. అదే గదిలో వేసిన పాత కంబళిమీద తన జబ్బమీద తల ఆనించుకుని నిద్రపోతోంది. ఆమె ముఖం, మెడ చెమటతో చిత్తడిగా వున్నాయి. కాశీ ఉక్క చాలా చికాగ్గా వుంటుంది. బొంబాయిదీ అంతే. లలిత మధ్యాహ్నంవేళ ఇలాగే పడుకునేది. బొంబాయి వచ్చిన కొత్తల్లో లలితకి కూడా ఇలాగే చెమటలు పట్టేవి.

ఈమెకి మెలకువ రాలేదు. నిద్ర పాడుచేయకూడదు, అని తను వెనక్కి తిరిగాడు. కాని మేడమీద బాల్కనీలో తన అడుగులు చప్పుడయ్యాయి. ఆమెకి మెలకువచ్చింది. వెంటనే లేచి కూర్చుంది. కిందకి వెళ్తున్నదెవరో అతిథులని అర్థమయినట్టుంది. లేచి వచ్చి వినయంగా అడిగింది "స్వామీ ఈ దాసి ఇంటికొచ్చి అలాగే వాపస్ వెళ్ళిపోతున్నారుకదా? పిలవరాదా? "

అతను ఊరికే నుంచున్నాడు. ఆమెకి అతను ఎవరో గుర్తు తెలిసింది. "పైకి రండి" అని చెయ్యి పట్టుకుని తీసికెళ్ళింది. అతనికి మొహమాటంగా అనిపించడమే కాదు. కాళ్ళు చేతులు వణకడం మొదలైంది. ఆమే చెయ్యి పట్టుకుని కంబళిమీద కూర్చోబెట్టినా కంపించడం ఆగలేదు. "వచ్చి ఎంతసేపయింది? " అని ఆమె అడిగితే జవాబు కూడా చెప్పలేకపోయాడు.

"ఎవరన్నా చూస్తారని భయమా? ఏదీ భయపడకండి. లల్లూ ఇంట్లో ఎవరికీ నుక్సాన్ అవదు. మీరు నాకు దైవంతో సమానం... ఈ గదిలో వద్దు. ఆ గదిలోకి రండి. అక్కడికెవరూ రారు" అని ఆమే చెయ్యిపట్టి లేవదీసింది. మంత్రముగ్ధుడిలా అతను ఆమె ననుసరించాడు. పక్కనే వున్న మరో గదికి తీసికెళ్ళి చాపమీద వేసిన దుప్పటి దులిపి అతన్ని కూర్చోబెట్టింది. చేతికి ఒక విసనకర్ర తీసుకుని చెమటలు పట్టిన అతని వంటికి గాలి విసురుతూ అంది. "మహచెడ్డ ఉక్క ఇక్కడ. ఈ దాసి మీద దయతో ఎండలోనే వచ్చారా? "

అతను ఊరికే కూర్చున్నాడు. రెండు నిమిషాలు గాలి విసిరాక "మహరాజ్ మీ చెమట ఆరటంలేదు. కొంగుతో తుడుస్తానుండండి" అని తను కట్టుకున్న చీరకొంగుతో అతని వక్షస్థలాన్ని, ముఖాన్ని. ఒత్తి తుడిచింది. అతను మూగవాడిలా కూర్చున్నాడు. తరువాత ఇంకెలా మాట్లాడించాలో తోచక ఆమే, "అలసి పోయారనిపిస్తోంది. నా ఒళ్ళో పడుకోండి అని ఇంకా దగ్గరగా జరిగి తన తొడని ఒరిగేందుకు వీలుగా తలగడలా అన్చి దానిపైన అతని తలని,




వీపుని ఒరిగించి కూర్చోబెట్టుకుంది.

అతనికి అంతా ముందు నిర్ణయించుకున్నదేదో అదే ప్రకారం జరుగుతున్నట్టుగా చిత్రంగా తోచింది. లలితా ఇలాగే చేసేది. తన బిడ్డలా తనని ఇలాగే లాలించేది. ఈమె కూడా అలాగే చేస్తోంది. స్వయం ప్రేరణతో, "మహరాజ్ మీరేమీ మాట్లాడరేం? " అని అడిగింది.

అతనికి మాట్లాడ్డానికి ఒక వాక్యం దొరికింది. "నీ పేరేమిటి? "

"లల్లూ"

"ఓహ్! అదే పేరు..." అతను మెల్లగా అనుకున్నది ఆమెకీ వినపడింది.

"ఏ పేరు? "

ఆ మాటకి అతను జవాబు చెప్పకుండా అడిగాడు. "ఈమధ్య పదిహేనురోజుల క్రితం మధ్యాహ్నంవేళ బట్టలుతకడానికి గంగానదికి వచ్చావా? దశాశ్వమేధ ఘట్టానికి..."

"మధ్యాహ్నం వెళ్లను. రోజూ పొద్దున్నే నేను వెళ్ళేది"

"అయితే నువ్వు కాదు" అన్నమాట అతని నోటివెంట వచ్చింది.

"ఎవరు? " అని ఆమె అడగటం అతని చెవిన పడలేదు. అతను మౌనంగా ఊరుకున్నాడు. అందువల్ల ఆమెకి చిరాకేసినా ఆమెకిలాంటి ప్రవర్తనేమీ అపరిచితం కాదు. ఆమె దగ్గరకొచ్చే కొందరు సన్యాసులు ఒక్కొక్కరు ఒక్కొక్కరకంగా వుంటారు. ఆమె తన గుండెలపై అతడి ముఖాన్ని ఆన్చుకొని కుడిచేయి అతని చుట్టూవేసి, ఎడమచేత్తో పాదంమీద ఒత్తి అంది. 'స్వామీ మీలాంటి పుణ్యవంతులదాసిని నేను. మీకెలా కావాలో అలా వుండండి'

ఆమాట అతని చెవిలోకి వెళ్ళింది. కాని మనసంతా జ్ఞాపకాలతో నిండివుంది. ఆమె కూడా ఇలాగే తనని పసిపాపలా హత్తుకునేది. భక్తురాలిగా కాలిని తాకేది. ఆమెదెంత శాంతగుణమో! తన తల్లిలానే దయామయి. వాత్సల్యపూరిత స్వభావం. ఆమెకి వైదేహికి శారీరకంగా, స్వాభావికంగా వేగంలోను పూర్తిగా విరుద్ధమైన స్వభావాలు. లలితలో ఉద్వేగం వుండేది కాదు. అంతా శాంతమే. కాని వైదేహిలో వేడెక్కువ. నోరు విప్పి మాట్లాడకపోయినా కళ్ళల్లో కోరిక చిమ్మేది. ఆమెని కౌగిలించుకుంటే తన ఒళ్ళు కూడా వేడెక్కిపోయేది. లలిత ఒళ్ళో చేర్చుకుని లాలిస్తే, వైదేహి తనే ఒళ్ళో ఒరిగి రెచ్చగొట్టేది. లలిత తొడమీద విచలితుడవకుండా ఒకటి రెండు గంటలన్నా విశ్రాంతి తీసుకోవచ్చు. అదే వైదేహి స్పర్శ విద్యుత్ సదృశం. తాకితే చాలు తన ప్రకృతి కూడా వేడెక్కి చెలరేగిపోయేది. తరువాత తను ఒక్కొక్కసారి ఈ విషయంలో అసహ్యపడి, ఇలాంటి ఆకర్షణకి చిక్కుకోరాదని నిర్ణయించుకున్నాడు కూడా. కాని ఆమె సంపర్కంలో ఆకర్షణ తప్పదు. తను ఇంటినుంచి బయటికి వెళ్ళాక, ఆఫీసులో ఉన్నంతసేపు మనసుతో, జ్ఞానంతో సన్యాసి మనోప్రవృత్తిని అవలంబించినా ఇంటికి వచ్చి భోజనం చేసి, పిల్లలని పడుకోపెట్టి, పక్కమీద చేరేసరికి... ఆమె చేయి తగిలితే చాలు చంచలమైపోయేవాడు. ఇప్పుడు వారిద్దరి ఆలోచనలూ వచ్చి మనసు ఇద్దర్నీ పిలుస్తోంది. తను ఇద్దరిలో ఎవరినెక్కువ ప్రేమిస్తున్నాడు?

వెంటనే మనసు చెప్పింది. అన్నీ గడిచి ఇన్నేళ్లు అయి, జటాజూటధారి అయిన తను ఎవరినీ ప్రేమించడు. కాని అదే ప్రశ్న మళ్ళీ మళ్ళీ మనసుకొచ్చి వేధించసాగింది. ఇద్దరిలో ఎవరినెక్కువ ప్రేమించేవాడు? జవాబు చెప్పడం కష్టం. లలితనెక్కువ ప్రేమించేవాడన్నమాట నిజం. కాని లలిత కేవలం భార్యగానే కాక, తల్లిలా సేదదీర్చేది. వైదేహిపట్ల వున్న ప్రేమ కూడా

తక్కువేమీ కాదు. అయినా అందులో ఆమె లోపట్టి తనవేపు లాక్కునే ఆకర్షణశక్తి అంత టిది. ముప్ఫైఅయిదేళ్లు దాటాక కూడా తనలో యవ్వనం, స్త్రీని తృప్తిపరచే సామర్థ్యం పుష్కలంగా వున్నాయని తెలియ చెప్పిందే వైదేహి. ఇప్పుడనిపిస్తుంది. తను సంసారిగా వున్నప్పుడు నిజంగా సన్యాసి మనస్తత్వంతో బ్రతికాడనుకున్నది అబద్ధం. అందరిలాగే తనూ సంసారిగానే బతికాడన్ని విధాలా. కాని సన్యాసం పిచ్చి తన మన సుని వీడకుండా వెంటాడేదంతే.

ఇప్పుడు మనసునిండా వైదేహి ఆలోచ నలు నిండిపోయాయి. అదిమిపెట్టి ఆమె తన ముఖంమీద వేడి ఊపిరి విడుస్తున్న జ్ఞాపకం. ఇలాగే తనని బలంగా కౌగలించు కునేది. కూర్చుని ఉండిన తను ఆమె కౌగి లిలో ఎలా పడుకుండిపోయేవాడో తనకే తెలిసేది కాదు. చివరిలో ఆమె ఒకోసారి చిలిపిగా అడిగేది! "ఎవరు గెలిచారు?" అని.

ఉన్నట్టుండి స్పృహ కలిగింది. లల్లూ ఎడమ అరచేత్తో తన నడుముచుట్టూ ఆత్మీ యంగా నిమురుతోంది. తను ఆమెలో ఐక్య మైపోయాడు. ఎప్పుడు ఇదంతా జరిగిపో యిందో? వైదేహితో ఇలాగే అయ్యేది. ఎప్పుడు? అన్నది తెలిసేదేకాదు. ఇక మాటా మంతీ లేదు. అంతా మౌనంగానే... చెమటలు... వేడి... ఊపిరి... అంతే.

తరువాత లల్లూ అతని వక్షస్థలాన్ని, మెడని, ముఖాన్ని, వీపుని మరోసారి తన కొంగుతో తుడిచింది. ఈసారి మనసు ముడుచుకుపోయింది. పక్షవాతం వచ్చి శరీ రంలో శక్తినంతా పోగొట్టుకున్నవాడిలా అలా అచేతనంగా కూర్చుండిపోయాడు.

ఆమె "కొంచెంసేపు పడుకుని నిద్రపో తారా? ఒక దిండు తెచ్చిస్తాను" అంది.

"ఒద్దు, నేను వెళ్తాను" అన్నాడు.

"స్వామివారి మర్జీ. ఎప్పుడు కావాలను కున్నా తప్పక రండి. ఎవరికీ తెలియకూడ దనుకుంటే, ఇవాళ వచ్చిన సమయమే సరి. ఎవ్వరూ ఉండరు"

ఆ మాట తనకి వినపడనట్టుగా లేచి నుంచున్నాడు. ఆమె తన చీర చెంగు తీసి చూపించి అడిగింగి. ఇటు చూడండి, ఇదంతా ఎలా చిరిగిపోయిందో, స్వామివారే మన్నా ఇస్తే ఒక చీర కొనుక్కుంటాను"

అతను తన నడుములో దోపుకున్న చిక్కం తీసాడు. అందులో వున్న సొమ్మేదో అంతా ఆమె చేతిలో పెట్టాడు. చిల్లరతో సహా ఇచ్చేసాడు. ఆమె అతని పాదాలంటి నమస్కరించి పంపింది. పంపడానికి మెట్లు దిగి వచ్చింది. మెట్ల దగ్గిర, వీధివాకిట్లో సుమారు పదేళ్ళ కుర్రాడు ఆడుకుంటు న్నాడు. వాడి ముక్కు కారుతోంది. మోకా ళ్ళమీద స్పష్టంగా కనిపిస్తున్న దెబ్బలు, మచ్చలు... ఆ కుర్రాడు, "అమ్మా మధ్యాహ్నం కూడా నీకు గిరాకీలేనా? నాకు విసుగు బాబూ, నాతో ఎప్పుడూ మాట్లా డవు" అనేసాడు.

ఆ మాట విన్నవెంటనే ఆమెకి కోపం వచ్చింది. కుర్రాడి తలమీద ఠంగున ఒక మొట్టికాయి మొట్టింది. "గిరాకీల ఎదురుగా ఇలా మాట్లాడకూడదని ఎన్నిసార్లు చెప్పాలి?" అని వాడిని గదమాయించింది.

దెబ్బ గట్టిగానే పడ్డట్టుంది. ఏడవడం మొదలుపెట్టిన కుర్రవాడు గుక్క తిప్పుకోడా నికి నలభై, ఏభై క్షణాలు పట్టింది. "క్షమిం చండి మహారాజ్. పిల్లాడికి తెలియక మాట్లాడాడు. వాడలా అన్నాడని మీరు రాక మానేరు సుమా" అని చెప్పింది.

ఆగి కుర్రాడిని ఓదార్చాలనిపించినా, ఒక్క క్షణం కూడా ఆగకుండా చరచర నడచి గల్లీ దాటి తిన్నగా గంగ ఒడ్డుకి వచ్చాడు.

గడచిన పదిహేను రోజులుగా మొదల





యిన తన తల్లి అస్పష్టబింబం, లలిత స్పష్ట మైన జ్ఞాపకాలు, వైదేహి స్మృతులు, ఈ వేశ్యారూపం మనసులో నిండిపోడానికి దారి కల్పించాయి. లలిత మాతృగుణ వాత్స ల్యాల జ్ఞాపకంతో అక్కడకి వెళ్ళిన తను వైదేహి ప్రణయతాపం నిండిన కోరికలో చిక్కుకుపోయాడు. తనకి తెలియకుండానే ఈ వేశ్యసహవాసం పొంది దిగజారాడు. తను చూసిన, అనుభవించిన ఆమె నయవి నయాలు, మృదుత్వం, ఇవన్నీ ఆమె సహజ గుణాలు కావు. ఆమె తన పిల్లవాడిని కొట్టి నట్టుగా లలిత ఏనాడూ తన పిల్లల్ని కొట్ట లేదు, తిట్టలేదు, గట్టిగా గదమాయించలేదు. ఆమెది తల్లి పేగు సరే, కాని వైదేహి కన్న పిల్లలు కారు, స్వభావంవేరు. అయినా ఆమె కూడా పిల్లల్నేనాడూ కొట్టి, తిట్టి నొప్పించ లేదు. ఈమె స్వంత బిడ్డని ఎంత కఠినంగా తలమీద కొట్టింది. చిన్నపిల్లాడు! తల్లి సాహచర్యం దొరక్క బాధ కలిగి ఉంటుంది. అర్థంచేసుకోలేని చిన్నవయసు. ఆమె సహజ గుణం వేరు. తను ఊహించు కున్న గుణాలు వేరు. తప్పు తనదే.

తన అధఃపతనంలో ఇది చివరిమెట్టు. ఈరోజు మళ్ళీ గతం జ్ఞాపకం వస్తోంది. పెళ్ళికిముందు రామకృష్ణ వేశ్యాగృహానికి తీసికెళ్ళిన రోజు. ఆరోజు తను ఏ బలహీ నతకి, ఆకర్షణలకీ లోనుగాకుండా గెలిచి వచ్చాడు. తరువాత తనలోనే ఆ మోహం కలిగింది. పూర్తిగా పడి మునిగేవరకు ఆ మోహస్వరూపం తెలియలేదు. ప్రీతి, వాత్సల్యం, వినయం- ఇటువంటి రూపంతో తనని ఆ వలలోకి లాక్కుంది. తనకి అంత మాత్రం తెలియలేదా? మనసుని మాయ మోహాలు కమ్మితే ఆలోచనల అంతరార్థం తెలియదు.

ఇన్నాళ్ళు తను సాధించినదేమిటి? ఇన్నాళ్ళ సన్యాస జీవితంలో అంత పెద్ద మాటెందుకు? జటాధారి జీవితంలో 'గద్ద కట్టే' ఉన్నత స్థానానికి చేరుకోలేకపో యాడు. ప్రవాహంచే కిందకి నెట్టివేయబ డ్డాడు. ఇప్పుడు మళ్ళీ మరోవిధంగా దిగజా రిపోయాడు. ప్రగతి సాధించేసంగతలా ఉంచి అధోగతిని తప్పించుకుంటే చాలు. తనమీద తనకే అసహ్యం వేసింది. గంగాన దిలో మునిగి చావడమే తనకున్న దారి. కాని తను అలా చెయ్యలేడని తన అంత రంగం చెప్పింది. ఒళ్ళంతా చెమటతో చిత చితలాడుతోంది. నీళ్ళల్లోకి దిగి బాగా ఒళ్ళు తోముకుని స్నానం చేసాడు.



**ఆ** ఊరినొదిలిపెట్టి పోవాలనిపిస్తోంది. కాని ఎక్కడికి? వెళ్ళడానికొక దిక్కుకావాలి. ఒక వ్యాపకం కావాలి. ఇక్కడకీ దారి తప్పే వచ్చాడు. ఒక నిశ్చయం లేకుండానే వచ్చాడు. ఎటు వెళ్ళడానికీ దారి కనపడ్డం లేదు. వెళ్ళడానికొక ధ్యేయమూలేదు. ఈ ఊరిలో తన అధఃపతనానికి కారణమైన అడుగువేసాడు. కాబట్టి ఇక్కడ్నుండి వెళ్ళిపో వల్సిందే. ఇక్కడినుండి వెళ్ళిపోడానికి ఈ విషయం ఒక కారణం లేదా నెపం అయింది. కాని ఫలానా ఊరికి వెళ్ళడాని కొక భావాత్మక కారణం, ధ్యేయం కావాలి కదా! అలాంటి కారణం లేకుండా ఈ ఊరిని వదలడం ఎలా? వెళ్ళినా ఎక్కడికని వెళ్తాడు. విడిచినా ఇక్కడకంటే మరోరకంగా ఉండలేదు కదా!

కొద్దిరోజుల్లో 'భిక్ష' అంటే జుగుప్సకలిగింది. కాని కొత్త పనేమన్నా చేసే దారి మాత్రం కనపడలేదు. ఏదన్నా నౌకరీ చెయ్యచ్చు. ఎక్కడన్నా టైపిస్టుగా చేరవచ్చు. కాని అలా చేసి ఏం చెయ్యడం? అడుక్కుని ఒక్కపూట తినే బదులు, రెండుపూట్ల తినవచ్చు. అందువల్ల జరిగే ప్రత్యేక ఉపకారమేమీ లేదు. ఈ ఆలోచన వస్తే ఏం చెయ్యాడానికీ ఒక వ్యావృత్తి, దొరక్క అయోమయంగా వుంటుంది. ఈమధ్య మధ్యాహ్నం వరకు భిక్షకు కూర్చుంటాడు. ఆ తరువాత నగరంలోని 'సార్వజనిక గ్రంథాలయా'నికి వెళ్ళి వార్తాపత్రిక చదువుతాడు. ఒక్కోరోజు విశ్వవిద్యాలయానికి వెళ్ళి, అక్కడ ఆవరణలో తిరిగి వస్తాడు. ఈమధ్య నడిచేటపుడు దారిలో పిల్లలమీదకి దృష్టిపోతోంది. ఎవరన్నా ఎదిగిన ఆడపిల్లల్ని చూస్తే భవాని గుర్తొస్తుంది. ఇప్పుడు పదిహేనేళ్ళుండి ఉంటాయి. అన్నీ వాళ్ళమ్మ పోలికలే. అదే ఓరిమి కూడా వచ్చి వుండచ్చు. విజయుడికీ అదే స్వభావం. గణేశ్ అల్లరివాడు. రామలక్ష్మణుల స్వభావాలు ఎలాంటివో అప్పటికింకా సరిగ్గా తెలియలేదు. వాళ్ళెలా వున్నారో? తనే ఒకసారి ఆ వూరికి వెళ్ళి చూసుకుని వస్తే? ఈ సన్యాసి రూపంలో వెళ్తే ఎవరూ గుర్తుపట్టలేరు. ఊరికే ఒక్కసారి చూసి వచ్చేస్తే చాలు, అనే ఆలోచన వచ్చింది. అందువల్ల ఏంలాభం అనే ఆలోచన కూడా మరుక్షణంలో పుట్టింది. అక్కడికి ఆ ఆలోచనని తుంచేసి ఊరుకున్నాడు.

ఒకరోజు మధ్యాహ్నం రైల్వేస్టేషన్ వైపు వెళ్ళాడు. బొంబాయి ఎక్స్‌ప్రెస్ లేటుగా వచ్చింది. ప్రయాణికుల్లో ఒకరెవరో న్యూస్ పేపర్ కింద పడేసుకున్నారు. ఇతను పిలిచి ఇవ్వబోయాడు. అతడు పాత పేపరేలే అక్కర్లేదు అనేసి ముందుకి సాగిపోయాడు.





సరే ఆ పేపర్ చేతిలో పట్టుకుని థర్డ్‌క్లాస్ బుకింగ్ కౌంటర్ ఎదురుగా బెంచీమీద కూర్చుని చదవసాగాడు. పత్రిక చూడగానే శెనాయ్ జ్ఞాపకం వచ్చాడు. బొంబాయి వార్తలు చదివాడు. ఇప్పుడు అక్కడ జరుగుతున్న సంఘటనలకు, పబ్లిక్ రంగంలో 'ఉన్న వ్యక్తులకీ, తన మునుపటి పరిచయ జ్ఞానానికి ఎక్కడా లింకు తెలియడంలేదు. పాత జ్ఞాపకాలు మరలివస్తున్నాయి. ఒక రకమైన కుతూహలం కూడా కలగసాగింది. ఒక్కొక్కటిగా అన్ని పుటలు చదివి, పూర్తిచేశాక పత్రిక మడుస్తూండగా చివరి పేజీలో ఒక ప్రకటన కనపడింది. సహజమైన కుతూహలంతో అటు చూశాడు.

"అన్నపూర్ణా అనాథాశ్రమం, బోరిల్లి"

దిక్కులేని ఈ పిల్లల ఆశ్రమానికొక వార్డెన్ కావలెను. ఆశ్రమంలోనే ఉండి పిల్లలకి తల్లిదండ్రుల స్థానంలో ఉండి చూసుకోవాలి.

వివాహితులైతే నివాసానికి రెండు గదులున్న ప్రత్యేక భాగం ఇవ్వబడును. ఆశ్రమంలో మొత్తం ఏభైమంది పిల్లలున్నారు. దరఖాస్తుదారులు పట్టభద్రులై వుండాలి. సమాజసేవ మొదలైన వాటిలో అర్హత పత్రాలుంటే ప్రాధాన్యత ఉంటుంది. జీతంతోపాటు మిగతా ఎలవెన్స్‌లు కూడా వుంటాయి. ఈ బాధ్యత తీసుకున్నాక మీరే విధమైన పార్ట్‌టైమ్, ప్రైవేట్ పనులు చేయరాదు. ఈ ప్రకటన వచ్చిన పదిహేను రోజులలోగా మీ దరఖాస్తులను పంపించండి. హిమ్మత్ సింహ్‌జీ ఛారిటీ ట్రస్ట్, బొంబాయి.

అది చదివి పేపరు మడచి పక్కనపెట్టేసాడు. ఒకటి రెండు గంటల్లో ఒక ఆలోచన వచ్చింది. తనే వెళ్ళి ఆ పనిలో ఎందుకు చేరకూడదు? జీతం అక్కర్లేదు. నివాసమెలాగూ ఆశ్రమంలోనే. అక్కడే భోజనం చేసి పిల్లల బాధ్యత తీసుకుంటే సరి. ఈ మాత్రం ఊహకే మనసులో అదో

విధమైన సంబరం కలిగింది. ఇదే సరి. అంతమంది అనాథపిల్లలకి పెద్దదిక్కుగా జీవించడం, తండ్రిగా, తల్లిగా ఆప్యాయత చూపించడం ఇదే తనకి తగిన వాతావరణం, సార్థకమైన జీవనం. ఇందులో అర్థం, పరమార్థం, ధ్యేయం అన్నీ ఉన్నాయి.

సుమారు ఒక గంట సంభ్రమంలో ఉండిపోయాడు. మరోసారి ప్రకటనని క్షుణ్ణంగా చదివాక ఉత్సాహం చల్లారిపోయింది. తనేమీ గ్రాడ్యుయేట్ కాదు. వాళ్ళడిగిన డిగ్రీలు, డిప్లొమాలు లేవు. తననెవరు తీసుకుంటారు? అదీకాక మంచి జీతం, ఎలవెన్స్‌లు వుండే ఆ ఉద్యోగానికి అర్హులెందరో దరఖాస్తు పెడతారు. తనకి దొరకదేమో అని దిగులుపడ్డాడు.

ఒకరోజు ఉన్నట్టుండి ఒక ఆలోచన వచ్చింది. ఆ పని కాకపోయినా, అదే ఆశ్రమంలో మరేపని ఇచ్చినా చేస్తూ అక్కడుండిపోడం. మొత్తానికి ఏదోవిధంగా అనాథపిల్లల సేవ చేసుకోడం, ఈ ఉద్దేశరహిత, ధ్యేయహీన జీవితానికన్న ఉత్తమం- అనుకున్నాడు. ఈ ఆలోచన రాగానే స్వయంగా బొంబాయి వెళ్ళిపోడమే సరి అయిన పని అని నిర్ణయించుకున్నాడు. పది రోజుల పాటు ఉదయంనుండి, సాయంత్రం వరకు నది ఒడ్డున భిక్షకు కూర్చున్నాడు. బొంబాయి ప్రయాణానికి సరిపడ డబ్బు సమకూరింది. తన రజాయి, కంబళి, కాషాయవస్త్రాలు అన్నీ తీసుకుని ఒకరోజు ఎవరికీ చెప్పాపెట్టకుండా స్టేషన్‌కి వెళ్ళి టికెట్ కొనుక్కుని బొంబాయి ఎక్స్‌ప్రెస్‌లో కూర్చున్నాడు.

★ ★ ★

రైలు బొంబాయి వచ్చి ఆగే వేళకి మనసు కలవరంగా, ఆరాటంగా అయిపోయింది. ముందు ఎక్కడకి వెళ్ళాలి? పక్కచుట్ట ఎక్కడ పెట్టాలి అని ఆలోచించలేదతడు. ఆలోచిస్తూ ప్లాట్‌ఫారంమీద కొంతసేపు కూర్చున్నాడు. బొంబాయి అంతటికీ కలిపి శెనాయ్ ఒక్కడే తనకి స్నేహితుడు, తెలిసినవాడు. మిగతావాళ్ళు ఆఫీస్ సహోద్యోగులు. వాళ్ళతో అంత దగ్గరతనమూ లేదు. అందులో ఎంతమంది ఉద్యోగాలు మార్చారో ఏమో.

ప్లాట్‌ఫారం బయటకి వచ్చాడు. ఎలాగూ 'మాహిమ్' దగ్గరే ఉంది. హిమ్మత్‌సింహ్‌జీ ధర్మసంస్థకి వెళ్ళి స్వయంగా వివరాలు తెలుసుకోదల్చుకున్నాడు. రజాయి చుట్ట భుజం మీద పెట్టుకుని నడచివెళ్ళాడు. కొద్ది సేపటికి సంస్థ కనపడింది. అక్కడ ఒక గుమాస్తా ఉన్నాడు. "ఇలాంటి అపాయింట్‌మెంట్లన్నీ బాబుగారే చూసుకుంటారు. ఈ ఉద్యోగానికి మూడు వందల అప్లికేషన్స్ వచ్చాయి" అన్నాడతను.

"బాబుగారిల్లు ఎక్కడ? "

"క్యాడెల్ రోడ్" అని చిరునామా ఇచ్చాడు. ఆ 'బాబుగారి' వివరాలూ తెలిసాయి. ఆయన ప్రఖ్యాత పారిశ్రామికవేత్త. బొంబాయిలో రెండు టెక్స్‌టైల్ మిల్స్ ఉన్నాయి. వ్యాపారాల్లో వచ్చిన లాభంలో ఒక వంతు ధర్మకార్యాలకి ఉపయోగిస్తారు. వారి తల్లి అన్నపూర్ణాదేవి పేరిట ఈ అనాథాశ్రమం ఆరంభించారు. ఇంతకుముందు ఉండిన వార్డెన్‌ని దొంగలెక్కలు రాసి డబ్బు తిన్నందుకు తీసేసారు. బాబుగారు చాలా దయాధర్మం కలవారు. ఈ అనాథాశ్రమ శిశువులందరికీ భవిష్యత్తులో వారి మిల్లుల లోనే పని కూడా దొరికే అవకాశం ఇస్తారు. మంచి ఉద్యోగాలకి విడిగా వెళ్ళదలచిన వారు వెళ్ళవచ్చు

కాషాయవస్త్రాలు ధరించిన సాధు, సన్యాసులంటే వారికి భక్తి ఎక్కువ. అందువల్లే వాచ్‌మన్‌తో కబురు పెట్టగానే వెంటనే వచ్చారు. తన చరిత్రని ఐదునిమిషాల్లో

క్లుప్తంగా చెప్పి, "వార్డెన్ పని నాకిప్పించండి. పిల్లల సేవ చేసి జీవితంలో ఒక తృప్తి పొందుతాను"

ఐదు నిమిషాలు ఆలోచించాక బాబు గారు లోపలి జేబులో చెయ్యిపెట్టి పెద్దనోటొకటి తీసి ఈయన ముందుపెట్టి, "సాధూ మహారాజ్ ఈ దక్షిణ తీసుకోండి. మీ చరణ స్పర్శ చేస్తాను, ఆశీర్వదించండి. ఈ ఉద్యోగం మీకు దొరకదు"

"ఎందుకు సార్"

"ఐ వాంట్ ఎ క్వాలిఫైడ్ మ్యాన్. ఆర్‌యు ఎ గ్రాడ్యుయేట్? "

"ఇలాంటి పిల్లల తండ్రి కావడానికి నాకంటే ఎక్కువ అర్హత ఎవరికుంటుంది? గ్రాడ్యుయేట్ కాకపోయినా తగినంత చదువుకున్నాను"

"చూడండి వేలకొద్దీ రూపాయలతో నెల నెలా ఖర్చులు జరిగే వ్యవహారం. ఇంతకు ముందు పనిచేసిన వాళ్ళు చాలా డబ్బు తిన్నారు. అందుకని 'జామీను' పెట్టకపోతే ఈ పనిలో పెట్టుకోకూడదని నిశ్చయించుకున్నాను. మూడువందల అప్లికేషన్లొచ్చాయట. నేనింకా చూడలేదు"

"ఆ ఉద్యోగం కాకపోతే పోనీండి. ఏదో ఒక పని ఇప్పించండి. జీతం వద్దు. ఒక్కపూట తిండితిని ఉంటాను"

"జీతం లేకుండా పని చేసేవాళ్ళల్లో నాకు నమ్మకం లేదు. మీరు వెళ్ళవచ్చు. నమస్కారం" అని చేతులు జోడించి ఆ దక్షిణ అక్కడే విడిచి లోపలికి వెళ్ళిపోయారాయన.

ఇంకేమీ మాట్లాడ్డానికి మిగల్లేదు. ఆ నోటుని అక్కడే వదిలేసి అతనూ లేచి దిగి వచ్చాడు. వాకిలి బయట పెట్టిన రజాయి నెత్తుకుని బయటకి వచ్చేసరికి మనసు శూన్యమైపోయింది. కాశీకి వాపస్ వెళ్ళిపోదామా అనిపించింది. కాని అక్కడకి వెళ్ళి ఏమి చేయడం అనే ప్రశ్నపుట్టి శూన్యత మరింత దుర్భరమయింది. అలా అడుగులు వేసుకుంటూ శివాజి పార్కుకి వచ్చి ఒక గంట వరకు మబ్బు కమ్మినవాడిలా కూర్చున్నాడు. శెనాయ్‌నయినా చూద్దామా అనిపించింది. ఆయనున్నాడా లేడా? అన్న అనుమానం రాకపోలేదు. లేచి దాదర్ వచ్చి లోకల్ ట్రైయిన్ ఎక్కాడు.

శెనాయ్ బొంబాయిలోనే అదే పత్రికలోనే ఉన్నాడు. ఇప్పుడతనికి ప్రమోషన్ వచ్చింది. మంచి పొజిషన్‌లో ఉన్నాడు. ఛీఫ్ అసిస్టెంట్ ఎడిటర్. జీతం బాగా పెరిగింది. అతనికి ప్రత్యేకంగా గది, ఫోన్ ఉన్నాయి. కాషాయ గుడ్డలు కట్టుకుని, గడ్డాలు, జడలు పెంచుకొచ్చిన ఈ సన్యాసి మూటముల్లెతో పత్రికాఫీసులో అడుగుపెడితే ఎవరు రానిస్తారు? 'నరహరిరావ్' అని ఒక కాగితం మీద రాసి పంపించాక లోపలనుండి పిలుపు వచ్చింది. ఈ వేషంలో గుర్తించడానికి శెనాయ్‌కొక నిమిషం పట్టింది. గుర్తించగానే "ఏమిటి? హిమాలయాలనుండే తిన్నగా వస్తున్నారా? " అనడిగాడు.

"లేదు, నాలుగు సంవత్సరాలు కాశీలో ఉన్నాను."

"కొంచెంసేపు కూర్చోండి. అర్జెంట్ పని కొంచెం ఉంది. అది కాగానే ఇంటికి వెళ్ళిపోదాం" అని టేబుల్ మీదున్న కాగితాలు తీసి ఒకసారి తిరగేసి పెన్నుతో ఎర్రగుర్తులు పెట్టసాగాడు.

శెనాయ్ ఇల్లు ఫోర్ట్‌లో ఉంది. ఆఫీసు నుంచి మూడు ఫర్లాంగులుందంతే. సాయంత్రం నాలుగ్గంటలకి ఇల్లు చేరారు. భార్య, ఇద్దరు పిల్లలు. పుట్టిందే ఇద్దరు ఆడపిల్లలు. ఎదిగారు. నరహరి స్నానం చేసి వచ్చాడు. ఒక్కపూట భోజనం తప్ప ఇంకేమీ వద్దన్నాడు. శ్రీమతి శెనాయ్ కుక్కర్ పెట్టింది. ఆరుగంటలకల్లా నరహరి




భోజనం అయింది. శెనాయ్ కూడా తోడుగా కూర్చుని భోంచేసాడు. తరువాత నరహరి తన అనుభవాలన్నీ చెప్పుకొచ్చి, ఇప్పుడు బొంబాయి వచ్చిన కారణం, హిమ్మత్ సింహ్‌జీ ఇచ్చిన జవాబు అన్నీ వివరించాడు.

"ఎలాగూ వచ్చారు. నాలుగు రోజులుండండి, ఆలోచిద్దాం" అని చెప్పి, మళ్ళీ ఆఫీస్‌కి వెళ్ళాడు. వెళ్ళి అరగంటయ్యాక వచ్చాడు.

రెండురోజులయ్యాక "ఈ కాషాయవస్త్రాలు తీసేసి నీట్‌గా షేవ్ చేయించుకోడానికి సిద్ధమేనా? " అనడిగాడు శెనాయ్.

"తియ్యమంటే తీస్తాను. వీటిమీద నాకేమీ మోహం లేదు"

"ఎందుకిలా అంటున్నానంటే, అంతబాగా టైపింగ్ వచ్చు మీకు. ఎనిమిదేళ్ళుగా అలవాటు తప్పి వుంటుందంతే. మా ఇంట్లో మిషన్‌మీద ప్రాక్టీస్ చేసుకోండి. మా ఆఫీసులోనే పని ఇప్పిస్తాను. చాలినంత జీతం దొరుకుతుంది. హాయిగా ఉండిపోండి"

"అలాగే. కేవలం కడుపునింపుకోడానికి సంపాదనైతే ఇక్కడ ఉద్యోగం చేసి తినడానికి, కాశీలో భిక్షాటనం చేసి తినడానికి తేడా ఏమిటి? "

"తేడా లేదా? "

"ఉందనుకోండి. కష్టించి తినడం మంచిది. కాని కేవలం అదొక్కటే నా జీవితానికి అర్థాన్నివ్వలేదు. బనారస్ వదిలి రావడానికి కుదరక ధ్యేయం లేకపోడంతో ఊరికే భిక్షాటనం చేసుకున్నాను. అనాధాశ్రమం పని నాకొక అర్థాన్ని, ధ్యేయాన్ని చూపింది. ఇలాంటి పనేదన్నా చెయ్యాలి. నాకు జీతం, హోదా అవసరంలేదు. పిల్లల సేవచేసుకునే ఒక పని దొరికితే సరి. అది నాకు చేతనైన విధంగా ఉంటే బాగుంటుంది"

"ఐ అండర్‌స్టాండ్ ఇట్"

మర్నాడు శెనాయ్ తమ ఛీఫ్ ఎడిటర్‌తో మాట్లాడి సంగతి వివరించి, ఆయనచేతే హిమ్మత్‌సింహ్‌జీకి ఫోన్ చేయించాడు. "నా కొలీగ్, డెప్యూటీ ఎడిటర్ స్వయంగా వచ్చి మీకు అన్నీ చెబుతారు" అని చెప్పాడాయన. సరే, ఆ శేట్‌జీ ఒప్పుకుని స్వాగతం పలికారు.

శెనాయ్ తనే స్వయంగా వెళ్ళి అన్ని విషయాలు చెప్పి నరహరి తరపున వకాల్తా తీసుకున్నట్టు మాట్లాడాడు. "ఈ ఉద్యోగానికి డిగ్రీ ఎందుకు? అదేమీ స్కూలు కాదు కదా, పిల్లలు ఎలాగూ మరో స్కూలుకే వెళ్తారు. పితృహృదయం, నీతి, నియమం, నిష్ఠ, నిజాయితీ ఈ క్వాలిఫికేషన్సే కదా కావల్సినది. అతనికవి పుష్కలంగా వున్నాయి. ఇతని సంగతంతా ముందే చెప్పానుగా. ఇంతకన్న మంచి అభ్యర్థి మీకు దొరకడు. ఇక డబ్బు గురించి హామీ, జవాబ్దారీ కదా? నేను, మా ఛీఫ్ ఎడిటర్, కావాలంటే మా జనరల్ మేనేజర్‌తోసహా ముగ్గురమూ ష్యూరిటి రాసిస్తే చాలా? ఫోన్ చేసి అడుగుతానుండండి" అని పక్కనున్న ఫోన్ మీద చెయ్యిపెట్టాడు.

"మీరింత చెప్పాక అదేమీ వద్దులెండి. రేపు ఉదయం ఆయన్ని తీసుకుని ఇక్కడకి రండి" అని టీ ఇచ్చి మర్యాదచేసి అతన్ని పంపించారు.

మర్నాడు ఉదయం వెళ్లినప్పుడు శేట్‌జీ పనినంతా వివరించారు. "ఏభై అంటే, ఏభై మాత్రమే కాదు. పదిమంది అటూ ఇటూ ఉంటారు. తల్లిదండ్రులు లేని పూర్తిగా అనాథలైన వారిని మాత్రమే తీసుకుంటున్నాను. వంట వాళ్ళున్నారు. ఒక పనివాడున్నాడు. సామాను కొనడం, వంట, భోజనాల గురించి పర్యవేక్షణ చూసుకోవాలి. అక్కడి శుభ్రత, పిల్లల చదువు విషయంలో శ్రద్ధ, పుస్తకాలు, రాతసామాను, బట్టలు, స్కూలుకి

సరిగ్గా వెళ్తున్నారా లేదా అన్న బాధ్యత, అనారోగ్యం వస్తే డాక్టర్ని పిలిపించి చికిత్స చేయించడం, ఇలాంటి బాధ్యతలన్నీ వార్డె న్వే!"

నరహరి అన్నాడు... "ఈ కాషాయ గుడ్డలు, జటాజూటాలు అన్నీ తీసేస్తాను. సంవత్సరానికొక జత పంచెలు, రెండు షర్టులు మీరే కుట్టించి ఇవ్వండి. నాకు జీతంతో పనిలేదు. ఒక పూట భోజనం పిల్లలతోపాటు తింటాను..."

అతని మాట మధ్యలోనే శేట్ జీ అన్నారు, "అదీ నిజమే. ఆ భోజనం చేస్తే వంట ఎలా వుంటోందో తెలుస్తుంది. లేకపోతే వంట వాడేం ఉడికించి పడేస్తే అదే భోజనం పిల్లలు నోరుమూసుకొని తినాలి"

"అదంతా చూసుకుంటాను. కాని అంతంత బియ్యం, గోధుమలు, పప్పులు, సామాన్లు తెచ్చి లెక్కలు చూసుకోడం కొంచెం కష్టం. డబ్బు వ్యవహారం తప్ప మిగతాదంతా నాకు వదిలెయ్యండి"

"మీరేం బెంగ పెట్టుకోనక్కర్లేదు. మీకొక అసిస్టెంట్ ఉంటారు. ఆయన పేరు రేళే. ఆయనా మీలాగే భార్యాబిడ్డల్ని పోగొట్టుకున్న వ్యక్తి. నిజాయితీగా పనిచేస్తాడు. ఇంగ్లీష్‌రాదు. మరాఠీ చదివారు. వ్యవహారంలో మంచి చురుకుదనం ఉంది. ఆయన మీకు సహాయం చేస్తారు. ఇద్దరూ కలిసిమెలిసి పనిచేసుకోండి"

మర్నాడే నరహరి ఆశ్రమానికి వెళ్లి డ్యూటీలో చేరాలని నిర్ణయించారు. శెనాయ్‌కి టీ ఇచ్చి శేట్ జీ, "మీరు పత్రికలవాళ్లు మా ఆశ్రమాన్ని కొంచెం దృష్టిలో ఉంచుకోండి" అన్నాడు.

దాని అర్థం జర్నలిస్టుగారికి వెంటనే తెలిసింది. నరహరికిలాంటివి అర్థంకావు. "మీలాంటి దాతలు, మిస్టర్ నరహరి రావ్ లాంటి నిర్వాహకులు ఉంటే మా దృష్టి ఉండి తీరుతుంది. సరే వెళ్లొస్తాను, థ్యాంక్యూ వెరీమచ్ నా తరఫున, మా ఎడిటర్‌గారి తరఫున కూడా" అని చెప్పి, నరహరితో కలిసి కిందకి దిగాడు.

ఆ రోజే శెనాయ్ ఒక జత పంచెలు, రెండు తెల్ల రెడీమేడ్ షర్టులు కొనిపెట్టాడు. నరహరి దగ్గర్లో ఉన్న సెలూన్‌కి వెళ్లి తన జటల్ని తీయించి సన్నగా క్రాప్ చేయించుకుని వచ్చాడు. ఇంట్లో స్నానం చేశాక తెలిసింది. ఇన్నాళ్లు నూనె మొహం చూడని వెంట్రుకలు నెత్తిమీద పేరుకి లెక్కపెట్టడానికి వీలుగా మిగిలాయి.

"మీకింకా ప్రపంచంతో బంధం ఉందనడానికి ఇదే గుర్తు. పూర్తి సన్యాసి అయిపోయుంటే ఫలితం ముండనం..." అని శెనాయ్ వేళాకోళమాడాడు.

ఆ సాయంత్రం శెనాయ్, "సన్యాసం తీసుకున్నాక హిమాలయాల్లో ఏమేం చేశారు? ఎలా కుటీరం నిర్మించుకున్నారు. గడ్డ మంచులో ఎలా గడిపారు? మీరు చెప్పిన నగ్న సన్యాసి విషయం, అన్నీ వివరంగా రాసివ్వండి. మా పత్రికలో నాలుగు ఇష్యూల్లో వేస్తాను. మంచి రెమ్యునరేషన్ కూడా వస్తుంది" అని అన్నాడు.

"డబ్బు నాకెందుకు?"

"పోన్లెండి, డబ్బు అక్కర్లేకపోతే పోనీ. రాసివ్వండి చాలు. మీ ఇంగ్లీష్ భాషలో లోపాలుంటే నేను సరిచేస్తాను"

"సరే ఆలోచిస్తాను. ఇక్కడే ఉంటానుగా" అని తన గత జీవితపు మురికి రజాయిని ఎవరన్నా పనివాళ్లకి ఇవ్వడంగాని, లేదా పారెయ్యడంగాని చేయమని, మరో జత కొత్త పంచె, షర్ట్ చేతిలో పుచ్చుకుని, చర్చి గేట్ దగ్గరకొచ్చి బోరిల్లి లోకల్ గాడీ ఎక్కాడు నరహరి.

★ ★ ★

స్టేషన్‌నుంచి తూర్పువైపు వెళ్తే నేషనల్





పార్కుకి కొద్దిదూరంలో అన్నపూర్ణా అనాథా శ్రమం వుంది. చుట్టుపక్కల కట్టడాలు, ఇళ్లు ఇంకా ఏమీ తయారవలేదు. వెనుక భాగా నికి కనిపించే కన్షేరి తప్ప ఆశ్రమం జంగి ల్‌లో ఉన్నట్టుంది. బొంబాయి, అహమ్మదా బాద్ మెయిన్‌రోడ్‌వైపు వెళ్లే ఒక్క రస్తా, కొద్ది ఇళ్లు తప్ప అక్కడింకేమీ లేవు.

రెండంతస్థుల బిల్డింగ్‌లో మొత్తం పద హారు గదులు, విడిగా వంటిల్లు, స్నానాల గదులు ఉన్నాయి. కాంపౌండ్‌లో నుయ్యి. నీళ్లు పంప్ చేసే మోటార్. ఒక్కొక్క గదిలో నలుగురు కుర్రాళ్లు చొప్పున వున్నారు. నాలుగైదు సంవత్సరాల పిల్లల దగ్గర్నుంచి పదహారు, పదిహేడేళ్ల వయసు పిల్లలవరకు ఉన్నారు.

నరహరి అక్కడ పనిలో చేరే వరకు బాధ్యతలన్నీ అసిస్టెంట్ రేళేగారే చూసుకుం టున్నారు. సుమారు ఏభై అయిదు సంవత్స రాల వయసున్న ఆయనకి పెళ్లయి, ఇద్దరు పిల్లలు ఉండేవారట. ఆ ఊరిలో కలరా భయంకరంగా తగిలి భార్యాపిల్లలిద్దరూ చనిపోయారట. ఈయన ఊరొదిలి వచ్చే శారు. ఎక్కడెక్కడో తిరిగి, ఏవేవో ఉద్యో గాలు చేసి, ఇప్పుడు ఇక్కడ నాలుగేళ్లనుంచీ పనిచేస్తున్నారట. ఇక్కడే భోజనం చేసి మితంగా జీతం తీసుకుంటున్నారు. ఆయ నని చిన్నప్పట్నుంచీ పెంచిన దొడ్డమ్మ ఒకా విడ జల్గాంలో వున్నారట. ఆమెకి కొంత మొత్తం పంపిస్తాడు. పొగాకు, తమలపాకు, వక్కలు తప్ప అతనికి మరే ఖర్చులేదు.

నరహరికి, రేళేకి బాగానే ఒద్దిక కుది రింది. రేళే తమ వెనుకటి జీవితం గురించి మొదటిరోజే చెప్పారు. అంతా విని, "భార్యా పిల్లలు పోయాక ఇంక మిగిలిందేమిటి లెండి" అని మాత్రం అన్నాడు. రేళేకి అప్పు డప్పుడు మాహిమ్ ఆఫీస్‌కి వెళ్లాల్సి వస్తూం టుంది. నరహరి జీతం తీసుకోడం లేదన్న సంగతి అక్కడ తెలిసింది. అదీకాక అతనొ క్కపూటే భోజనం చేస్తాడు. ఇక్కడికొచ్చిన మొదటిరోజే పిల్లల్ని పలుకరించి చిన్నపి ల్లల్ని ఎత్తుకుని ముద్దాడిన నరహరిని చూసి రేళేకి ప్రేమాభిమానాలు కలిగాయి. నర హరి గదులన్నీ పరీక్షించాడు. ఉండవలసి నంత నీట్‌గా లేవు. పిల్లల్ని వయసు సంబంధం లేకుండా విభజన చేశారు. పధ్నాలుగు దాటిని పిల్లలతో కలిసి ఐదేళ్లవా ళ్లని వేశారు. పెద్ద పిల్లలు చిన్నపిల్లలమీద పెత్తనం చలాయించే అవకాశం ఎక్కువ. తను చేరిన రెండు రోజుల్లో నరహరి ఆ విషయం గమనించాడు. "ఏ వయసుకి తగిన వాళ్లని ఆ వయసులవాళ్లతో వేసి గదులు విభజించండి" అన్నాడు.

"మరీ చిన్నవయసు వాళ్లొకటిగా చేరితే ఆటలాడుతూ కూర్చుంటారు. అందుకే ఇలా చేశాం" అన్నారు రేళే.

"కాని వాళ్లకి తోడుకూడా కావాలిగా. ఆడితే ఆడనీయండి. ఆడుకునే వయసు కదా!"

"కుర్రాళ్లు చెడిపోరా? "

"ఆటలాడకపోతే చెడిపోతారు. ఒక పని చేద్దాం. పదేళ్ల లోపు వాళ్లందర్నీ కింద గదుల్లో వేద్దాం. అంతకన్న పెద్దవాళ్లని పైన ఉండనిద్దాం. కింద మధ్యహాలులో నేనుం టాను. పైన మీరు చూసుకోండి. కింద పిల్లల్ని నేను కంట్రోల్ చేస్తాను"

ఈ పద్ధతి రేళేకి కూడా బాగానే వుందని పించింది. పిల్లలంటే అతనికీ చాలా ప్రేమ. కాని మరీ చనువిస్తే హద్దు తప్పుతారన్న భయం. అందువల్ల కొంచెం భయభక్తుల్లో ఉంచారు. నరహరి కింద గదుల్లో కుర్రాళ్లని చూసుకోడంతోబాటు వాళ్ల చదువు సంధ్యల సంగతి కూడా పర్యవేక్షించేవాడు. దగ్గర్లోనే కస్తూరిబా రస్తాలో వున్న స్కూళ్లకి ఐదేళ్లపై బడ్డ పిల్లలంతా వెళ్లేవారు. అతను అప్పుడ ప్పుడు స్కూలుకివెళ్లి ప్రధానోపాధ్యాయుడిని,

క్లాసు టీచర్లనీకూడా తన ఆశ్రమపు పిల్లల గురించి కనుక్కుంటూ ఉండేవాడు.

అనేక విషయాల్లో రేళె, నరహరి ఒకరికొకరు అర్థం చేసుకుని సర్దుబాటు చేసుకునేవారు. రేళెకి మంచి వ్యవహార జ్ఞానం ఉంది. మంచి చురుకుదనం, తెలివితేటలు ఉన్నవాడు. నరహరికి తెలివి, చురుకుదనం ఉన్నా వ్యవహారజ్ఞానం తక్కువ. అందువల్ల వంట విభాగం, సామాన్లు కొనడం మొదలైనవన్నీ రేళె పర్యవేక్షణలోనే జరగాల్సివచ్చేది. పిల్లల మనసు, విద్యాభ్యాసం వీటి లోతు ఆయనకి తెలియదు. అదీకాక ఈ విద్యా విషయం బౌద్ధిక సంస్కారంకాదు. ఈ విషయాన్ని నరహరి నిర్వహించేవాడు. పరస్పరం ఎవరి పరిమితులేమిటో, ఎవరి ప్రత్యేకతలేమిటో ఇద్దరికీ తెలుసు. మునుపటి వార్డెన్‌లా నరహరి అధికారం చలాయించే బాపతుకాదు. స్వచ్ఛమైన హస్తాలు గలవాడు. అలా చూడబోతే ఆర్థిక విషయాలన్నీ తనకే వదిలేశారు. లెక్కల పుస్తకాన్ని ఒకమారు అలా పైనుంచి కిందవరకూ చూసి సంతకం చేసేస్తారు. ఇవన్నీ చూసిన తరువాత రేళెకి నరహరి మీద గౌరవ విశ్వాసాలు మరింత ఎక్కువయ్యాయి.

నరహరి పొద్దుట్నుంచి రాత్రివరకూ ఏదో ఒక పని చేస్తూనే ఉంటాడు. చిన్న పిల్లల్ని తనే స్కూలుకి దింపి వస్తాడు. ఇంకా స్కూలుకి వెళ్లని కుర్రాళ్లతో కూర్చుని ఏవైనా ఆటలాడ్డానికి ప్రయత్నిస్తాడు. వంటగది శుభ్రతని గమనించుకుని వంటవాడికి సూచనలిస్తాడు. అంతమంది పిల్లలున్న చోట ఎవరో ఒకరికి జ్వరం, తలనొప్పి, కడుపునొప్పి, ఇలా ఏవో ఒకటి వస్తూనే వుంటాయి. కస్తూరిబా రస్తాలోవున్న ఒక గుజరాతి డాక్టరు ఆశ్రమం పిల్లలకి చికిత్స చేస్తారు. కన్సల్టేషన్ ఉచితంగా చేసి, కేవలం మందుల ఖర్చుమాత్రం తీసుకుంటారు. ఆయన సలహా మేరకు కింద భాగంలో కేవలం రోగులకోసం ఒక గది నేర్పరచాడు నరహరి. రోగులకి వేళ ప్రకారం మందులివ్వడం దగ్గర్నుంచి, పక్క బట్టలు మార్చడం, గంజి జావ తాగించడం అన్నీ తనే చేస్తాడు. మొత్తానికి ఒక్క నిమిషం కూడా ఊరికే కూర్చోడు. అతని మనసంతా పనిమీదే ఉంటుంది. ఈవిధంగా జీవితం సుఖంగానే గడచిపోతోంది. ఈ పని ఈ అవకాశం దొరకడం నిజంగా తన అదృష్టమే అనుకుంటాడు అతను.

★ ★ ★

ఇక్కడికొచ్చిన ఆరు నెలల వరకు అతను బయటకి ఎక్కడకీ వెళ్లలేదు. ఒకసారి శెనాయ్ ఇక్కడికే వచ్చి చూసివెళ్లాడు. పత్రికోద్యోగి శెనాయ్‌కి ఇలాంటి ఆశ్రమాల గురించి ఒక సచిత్ర వ్యాసం పత్రికకివ్వాలని కోరిక. అందులోను, హిమ్మత్ సింహ్‌జీ చెప్పిన మాటలూ గుర్తున్నాయి. మరోసారి వచ్చినపుడు కెమేరా తీసుకొచ్చి పిల్లలు భోజనం చేసేటప్పుడు, ఆటలాడేటప్పుడు కొన్ని ఫోటోలు తీసి ఒక వ్యాసంతోబాటు ప్రచురించాడు. తన ఫోటో తియ్యకూడదని నరహరి ఖచ్చితంగా చెప్పేశాడు. అతని పేరు తెరవెనుక గొప్పదనం గురించి శెనాయ్ రెండు వాక్యాలు రాయనే రాశాడు. తమ ఆశ్రమం గురించిన వ్యాసం చూసి హిమ్మత్ సింహ్‌జీ స్వయంగా ఫోన్‌చేసి సంతోషం వ్యక్తం చేశారట.

ఇప్పుడు నరహరి నెలకో రెండు నెలలకో ఒకసారి శెనాయ్ ఇంటికి వెళ్లివస్తాడు. అంతకుమించి బొంబాయిలో పరిచయస్థులూ లేరు. అతనికి ఆ అవసరమూ లేదు.

★ ★ ★

ఒక్కోరోజు మధ్యాహ్నం మూడు గంటల వేళప్పుడు నరహరి శెనాయ్ ఇంటికి వెళ్లే




వాడు. అప్పుడు శెనాయ్‌కి రాత్రి డ్యూటీ ఉండేది. అతడు సాయంత్రం ఆరు గంటలకి వెళ్లి రాత్రి రెండు గంటలకి ఇంటికొచ్చేవాడు. ఆ రోజు పొద్దున్నే పది గంటలకి లేచి స్నానం చేసి టిఫిన్ తిని మళ్లీ నిద్రపోయి, అప్పుడే నరహరి వెళ్లిన సమయానికి లేచి సిగరెట్ కాల్చుకుంటున్నాడు. సరే ఇతన్తో రెండు మూడు కాలక్షేపం కబుర్లు చెప్పి, "అవునుగాని, మీ ఆశ్రమంలో పిల్లలు చదువులయ్యాక ఎక్కడకి వెళ్తారు? ఆ సంగతి నా వ్యాసంలో రాయడం మరచిపోయాను" అన్నాడు శెనాయ్.

"ఆశ్రమం ఇంకా కొత్తది. ఒకరోజు రేళేగారితో మాట్లాడినపుడు ఆయన చెప్పారు, హిమ్మత్‌సింహ్‌గారి ఉద్దేశం ప్రకారం పిల్లలంతా ఎలాగూ ఎస్‌ఎస్‌సి పాసవుతారు. బాగా చదివి పై చదువులకి వెళ్లిన వాళ్లకి ట్రస్టునుండి వార్షిక వేతనం ఇప్పించడం, లేదా సాయంకాలం షిఫ్ట్‌లో రోజుకి నాలుగు గంటలు పని ఇచ్చామంటే వాళ్లకి పార్ట్‌టైం పని, సంపాదన వున్నట్టవుతుంది. వాళ్ల సంపాదనతో వాళ్లే చదువుకుంటారు. ఇక ముందుకు చదువుకోదల్చని వారికి, చదువుకోలేని వారికి వారి ఫ్యాక్టరీలోనే ఒక పని ఇవ్వడం ఇది వారి ఆలోచనట"

"శేర్‌జీ చాలా తెలివైనవాడు. పుణ్యం, పురుషార్థం రెండూ సిద్ధిస్తాయి. ఆయనకి మంచి వ్యాపార జ్ఞానం ఉంది"

"ఇందులో వ్యాపార జ్ఞానం ఏముంటుంది? "

"ఆయన పెట్టిన అన్నం తిని పెరిగిన కుర్రాళ్లు ముందుముందు ఫ్యాక్టరీలో నౌకరీ చేస్తారు. నిజాయితీగా పనిచేస్తారు. అంతే కాక స్ట్రైకులవీ చేయకుండా నిష్టగా నడచుకుంటారు. ఇదీ దూరదృష్టి"

నరహరి అంతర్ముఖుడై తనలో తను ఆలోచించుకోసాగాడు. అతనికీ విషయం తోచనేలేదు. "ఎందుకలా మౌనంగా వుండిపోయారు? " అని శెనాయ్ అడిగాడు.

"అయితే ఇది నిస్వార్థ సేవకాదు. శేర్‌ది నిష్కామ ధర్మం అనుకుని తృప్తిపడ్డాను. కాని ఇప్పుడు మీరు చెప్పేది చూస్తే నా తృప్తికి ఆధారం తప్పిపోయేలావుంది"

"ఎందుకు తప్పాలి? "

"నిష్కామ కర్మలో నాకూ కొంత పాలుంది అనే భావన ఉండేది. ఇప్పుడు చూస్తే మరొకరి సకామకర్మలో నా ఉచిత సేవ నడుస్తున్నట్టుగా వుంది. నాకు జీతం ఆశ ఎప్పుడూ లేదు. డబ్బు తీసుకుని నేనేం చేస్తాను? కాని మనసుకి తృప్తి కూడా వుండే అవకాశం లేదుకదా? "

నరహరి ముఖం ఇంకా గంభీరమైపోయింది. ఐదు నిమిషాలయ్యాక శెనాయ్ అన్నాడు, "ఇదే మీ తప్పు. నిష్కామసేవ అనే ఆదర్శం సంగతి అలా వుంచండి. ప్రపంచంలో జరుగుతున్న మంచి పనులు, పరోపకారాలు చాలావరకు సకామక్రియల వల్లే జరుగుతున్నాయి"

"ఎలా? "

"ఎలాగేమిటి? బోలెడు ఉదాహరణలున్నాయి. తల్లిదండ్రులు అంత డబ్బు ఖర్చు చేసి బిడ్డల్ని పెంచి పెద్ద చెయ్యడం పరోక్షమైన స్వార్థంతోనే. మున్ముందు వాళ్ల పెరిగి పెద్దయి, సంపాదించి తమని పోషించాలన్న కోరిక ఉంటుందో లేదోగాని, వాడి వల్ల తమ ఇల్లు వర్ధిల్లనీ అనే ఆశ తప్పకుండా ఉంటుంది. కార్మికులకి బోనస్ ఎందుకిస్తారు? అందువల్ల కార్మికులకి మంచీ జరుగుతుంది. వాళ్లు మరికొంత నిజాయితీగానూ పనిచేస్తారు. మీ శేర్ చేసిన దాంట్లో తప్పులేదు. పనిలో చేరడానికి ఎన్ని లక్షలమంది జనంలేరు? దిక్కులేని పిల్లల్ని తెచ్చిపెంచి, ఉద్యోగం కూడా ఇచ్చాక వాళ్లనుండి కంపెనీకి విశ్వాసాన్ని ఆశిస్తే తప్పేమిటి? అలాంటి విశ్వాసాన్ని



తండ్రి కొడుకునుండి, భర్త భార్యనుండి, ఉపకారి ఉపకృతుడినుండి ఎప్పుడూ నిరీక్షిస్తాడు"

"అలా నిరీక్షించకుండా చెయ్యడానికి కుదరదా? "

"హిమాలయాలకి వెళ్లి ముక్కు మూసుకు తపస్సు చేయడం ఎంతమందికి సాధ్యం? అలా వెళ్లి కూర్చున్న వారివల్ల ఎంతమంది ప్రజలకి ఉపకారం జరుగుతుంది? అలా ఉపకారం అంటూ జరిగితే హిమ్మత్‌సింహ్ లాంటి వాళ్లవల్లనే జరుగుతుంది. చూడండి, వారి ఆశ్రమం గురించి ఒక వ్యాసం వస్తే బాగుండునని ఆయనకి చిన్న కోరిక వుంది. పత్రికకి చెందిన మనిషిని గాబట్టి ఆరోజు ఆయన సూచనప్రాయంగా చెప్పారు. దానర్థం అదే. ఎందుకో తెలుసా? "

"తెలియదు"

"అందువల్ల ఆశ్రమానికి, ఆయనకి పేరొస్తుంది. పేరు రావడంవల్ల అదోరకమైన మానసిక తృప్తి. అంతేకాక ప్రతిష్ట పెరిగి వ్యాపారోద్యమంలో ఉపయోగకరంగా వుంటుంది. మొత్తానికి నేను రాశాను. మరో విషయం, నా మాటకి విలువనిచ్చి ఆయన మిమ్మల్ని పనిలోకి తీసుకున్నారు. ఆయనకి నేను ఏవిధంగా కృతజ్ఞత చెప్పగలను? అందుకే ఆయన కోరిక మేరకు వ్యాసం రాశాను. ఇందువల్ల వారికి, నాకు మధ్య పరిచయం పెరుగుతుంది. అత్యవసరం కలిగినపుడు నాకోసంగాని, లేదా మీ వంటి స్నేహితులకోసంగాని ఆయనవల్ల ఏదన్నా ఉపకారం పొందవచ్చు చూడండి, ప్రపంచంలో నిరాపేక్ష, ప్రతిఫలంకోరని ఉపకారం అనేదెక్కడా ఉండదు. ఉన్నా దానివల్ల జరిగేదేమీ లేదు. పరస్పర ఉపకారం వల్లే మానవ సమాజం బతికి ఉంది"

నరహరి ఆలోచిస్తూ కూర్చున్నాడు. అతని అంతరంగంలో పెద్ద గందరగోళం లేచింది. శెనాయ్ చెప్పిన దాంట్లో అతను ఇంతకుముందు వినని కొత్త విషయాలేమీ లేవు. కానీ అతని ఆదర్శాల మూలస్థంభం పునాది సడలినట్టయింది. అంతలో శెనాయ్ భార్య లోపల్నుంచి రెండు ప్లేట్లలో ఉప్మా తెచ్చిపెట్టింది. నరహరి "నేనేమీ తిననమ్మా, నాకు పెట్టకండి" అన్నాడు.

శెనాయ్, "ఫరవాలేదు పెట్టు, తింటారులే" అన్నాడు.

ఆమె రెండు ప్లేట్లనీ టేబుల్‌మీద పెట్టి వెళ్లింది.

"తింటే ఏమవుతుంది? " అనడిగాడు శెనాయ్.

"ఒక్కపూట భోజనం తప్ప నేనేమీ తీసుకోను"

"తీసుకుంటే ఏమవుతుంది? సన్యాస జీవనమే జీవించాలి అని మీ సంకల్పం. సన్యసించవలసింది ఆశ, స్వార్థం విడచిపెట్టడానికి. మీకెలాగూ అవిలేవు. రెండు పూటలా కడుపునిండా భోజనం చేయండి. శరీరం గట్టిగా ఉంచుకోండి. స్వార్థ త్యాగానికీ ఒంటిపూట భోజనానికీ ఏ సంబంధమూ లేదు" అన్నాడు.

అయినా నరహరి తినలేదు. "మీదెప్పుడూ స్వార్థం, ప్రతిఫలం కోరని ఆదర్శమే. నేనేదో పత్రికోద్యోగిని. నాకవన్నీ లోతుగా తెలియవు. ఇతర దేశాలనుంచి నాయకులు, మంత్రులు వచ్చినపుడు పార్టీలకి వెళ్లి తాగుతాను కూడా. ఇంట్లో మాత్రం నిమ్మకాయ షర్బత్ చేయిస్తాను" అని తన ప్లేట్‌ని చేతిలోకి తీసుకున్నాడు.

సాయంత్రం ఐదున్నరకి ఇద్దరూ ఇంట్లోంచి బయల్దేరారు. శెనాయ్ ఆఫీస్‌వైపు తిరిగాడు. నరహరి చర్చ్ గేట్ దగ్గరకొచ్చి రైలెక్కాడు.

★ ★ ★

గజానన్ అనే ఐదేళ్ళ కుర్రాడికి విపరీ




తంగా జ్వరం వచ్చింది. రోగులకని ప్రత్యేకించిన గదిలో ఆ కుర్రాడిని పడుకోబెట్టి నరహరి చికిత్స చేయించి, మందులు ఇస్తున్నాడు. గది తలుపులు తెరచివుంచి తను గది తలుపు దగ్గరే పడుకుంటున్నాడు. ఒక రోజు రాత్రి గజానన్ నిద్రలో బెదిరి కెవ్వున అరిచాడు. నరహరి లేచి వెళ్ళి చూసాడు. జ్వరం ఇంకా తగ్గలేదు. తెల్లవారేదాకా ఏమీ చెయ్యలేడు. కుదిపి లేపి, "ఏమయింది బాబూ?" అనడిగాడు. "భయంగా ఉంది, ఇక్కడే పడుకోండి కాకా" అన్నాడు బతిమాలే స్వరంతో. సిక్ రూమ్‌లో ఇంకెవ్వరూ పడుకోకూడదని డాక్టర్‌గారు చెప్పారు. కాని నేనెందుకాయన మాటని ఇన్నాళ్ళు అక్షరాలా పాటించాను? తన వరకు అయినా ఆ నియమాన్ని ఉల్లంఘించవచ్చు కదా. అని ఆలోచించి అతను తన చాప, దిండు లోపలకి తెచ్చుకుని, ఆ కుర్రాడి పక్కనే పరచుకుని తను ఎడమ పక్కకి ఒత్తిగిలి కుడిచేత్తో ఆ కుర్రాడిని దగ్గరకి తీసుకున్నాడు. కొద్దిసేపటిలో గజానన్‌కి నిద్రవచ్చింది. ఒళ్లు మాత్రం కాలుతూనే ఉంది. నరహరికి గణేశుడు గుర్తుకి వచ్చాడు. రూపం, ఆకారం, స్వభావం, ఏ విషయంలోనూ ఈ గజానన్‌కి, గణేశ్‌కి బొత్తిగా పోలికల్లేవు. కాని పేరులో కొద్దిపోలికలున్నాయంతే. అర్థం ఒకటే. గణేశ్‌కిప్పుడు పదిహేను నిండి ఉంటాయి. ఈ కుర్రాడికింకా ఐదేళ్లే. కాని, జ్ఞాపకం వచ్చింది మరో విషయానికి. చిన్నప్పుడొకసారి గణేశ్‌కి జ్వరం వచ్చింది. తను నాన్న తొడమీదే పడుకోవాలని మొండి పట్టుపట్టేశాడు. అప్పుడు వైదేహి బతికే వుంది. తామిద్దరూ రాత్రంతా మేలుకునే వున్నారు. ఆ మర్నాడు కూడా ఆ జ్వరం పిల్లాడిని వాటేసుకునే పడుకోవలసి వచ్చింది. లేకపోతే ఇల్లంతా అదిరిపోయేటట్టుఏడుపు మొదలుపెట్టేవాడు. ఇది గుర్తురాగానే నరహరి తనే దగ్గరకి జరిగి ఆ కుర్రాడిని దగ్గరగా తీసుకుని తన దుప్పటి సగం వాడికి కప్పాడు. ఈ పిల్లాడి తల్లిదండ్రులెవరో? పోలీస్ వాళ్ళు దిక్కులేని కుర్రాడని పట్టుకుని ప్రభుత్వ రిమాండ్ హోమ్‌కి పంపించారట. అక్కడ్నుంచి ఈ ఆశ్రమానికొచ్చి మూడేళ్ళయిందిట. దత్తత ఇవ్వకపోతే తన పిల్లలేమయ్యేవారో! కాని దానితోపాటు మరో ఆలోచన కూడా వచ్చింది. ఇప్పుడు దత్తత ఇచ్చి మాత్రం ఏమయ్యారో, ఎలా ఉన్నారో తను చూడలేదు కదా! ప్రయత్నిస్తే చూసి రావడం కష్టమేమీకాదు. కాని చూసి చేసేదేముంది? అదీకాక తనని గుర్తుపట్టి ఆ పెంచుకునే తల్లిదండ్రులు అభ్యంతరం చెప్పవచ్చు అక్కడ పిల్లలు ఇమిడిపోయుంటే నేనెందుకు మధ్యలో తలదూర్చడం? అని తనకి తనే చెప్పుకున్నాడు. మనసు తృప్తికరంగా శాంతిగా లేదు. అలాగే పడుకుని ఆలోచించి ఆలోచించి ఎప్పటికో నిద్రపోయాడు.

పొద్దున్నే గజానన్‌ని ఎత్తుకుని డాక్టర్ దగ్గరకి తీసికెళ్ళి ఇంజక్షన్ ఇప్పించుకొచ్చాడు. ఆశ్రమానికొచ్చి మందు, గంజి తాగించి పడుకోబెట్టాక, పిల్లలంతా స్కూలుకి వెళ్ళారా లేదా అని ఒకసారి చూసుకొచ్చాడు. ఆ పనయ్యాక స్నానానికి వెళ్ళాడు. వంటవాడు ఆ పూట వంట చేసేసి పిల్లలందరికీ పెట్టి, సాయంత్రం నాలుగు గంటలకి తిరిగొస్తానని చెప్పి, చుట్టాలింటికి జోగేశ్వరానికి వెళ్ళాడు. నరహరి స్నానం చేసుకొచ్చేసరికి రేళే తామిద్దరికీ కంచాలు, నీళ్ళు పెట్టాడు. ఇద్దరూ వడ్డించుకుని కూర్చున్నారు.

"పొద్దున్నే పిండిమిల్లు బిల్లుకి సంతకం పెట్టించాలని వచ్చి చూసాను. మామూలుగా మీరు అంతసేపు పడుకోరు కదా! ఆరున్నరకి వచ్చి చూసాను. గజానన్‌ని దగ్గరకి తీసుకుని గాఢంగా నిద్రపోతున్నారు" అన్నాడు రేళే.



"అవును, కుర్రాడు ఝుడుసుకున్నట్టు న్నాడు. నిద్రలో కెవ్వుమని లేచి కూర్చున్నాడు" అన్నాడు. నరహరి.

రేళే ఇంకా ఏదో అడగాలనుకుని తటప టాయిస్తున్నాడు. నరహరి జవాబిచ్చి ఊరు కోడంతో సంభాషణ కంటిన్యూ చేయడానికి వీలు కుదరలేదు. రెండు నిమిషాలు ఊరు కుని సూటిగా అడిగేసారు. "మీరీమధ్య చాలా దిగులుగా కనిపిస్తున్నారు. కొద్దిరోజు లక్రితం శేఠ్‌జీ ఇంటికి వెళ్ళినప్పుడు మీ గురించి అడిగారు"

"జీవితంలో చాలా దెబ్బలు తిన్న మనిషి, ఇద్దరు భార్యలు చనిపోయారనీ, పిల్లల్నం దర్నీ దత్తతకిచ్చి హిమాలయాలకి వెళ్ళిపో యారనీ, అక్కడ తపస్సులో శాంతి దొరక్క కేవలం పిల్లలకి సేవచేద్దామనే అంతదూరం నుంచి ఇక్కడకి వచ్చారనీ, అందుకే జీతం కోరుకోటంలేదనీ, చాలా బాధ్యతగా పని చేస్తారట కదా? ' అనీ ఏవేవో చెప్పారు, ఈ సంగతులేవీ నాకు తెలియవు. అదంతా నిజమా? " అనడిగాడు రేళే.

నరహరి మౌనంగా ఉండిపోయాడు. రేళే, "చెప్పడానికేమీ ఇబ్బంది లేకపోతే చెప్పండి" అన్నాడు.

అయినా నరహరి మాట్లాడలేదు. రేళే ఊరుకున్నాడు. కాని ఆ మధ్యాహ్నం, సాయంత్రం, రాత్రి పూర్తిగా పిల్లల జ్ఞాప కాలు వేధించసాగాయి నరహరిని. ఎందు కిలా అవుతోంది? అని ఆలోచిస్తూ జ్వరం తగ్గినా గజానన్‌ని దగ్గరకి తీసుకునే పడుకు న్నాడు రాత్రంతా. మర్నాడు కుర్రవాడికి పూర్తిగా నయమయింది. ఆ ఒక్కరోజుకి మందులు వేస్తే చాలని చెప్పారు డాక్టర్ గారు. అతను తోటిపిల్లలతోపాటు గదిలోనే పడుకుంటానని చెప్పాడు. ఆ రాత్రి నరహరి ఒంటరివాడయ్యాడు. నిద్రపట్టలేదు. కాలం గడవలేదు. లేచి వెళ్ళి రేళేతో మాట్లాడాలని పించింది. రాత్రి పదకొండు గంటలవేళ ప్పుడు పై అంతస్తుకి వెళ్ళి మధ్యహాలులో పడుకున్న రేళేని లేపి, ఆశ్రమం కాంపౌండ్ లోకి తీసికెళ్ళాడు. తన బాల్యం, వివాహం, పిల్లలు, వారి దత్తత, సన్యాసం తీసుకోడానికి వెళ్ళడం, అక్కడ తన అనుభవాలు అన్నీ చెప్పాడు. మధ్యలో తన మనసులోని తార్కిక, ఆధ్యాత్మిక ప్రశ్నలని చర్చించాడు.

పొద్దున్నవరకూ చెప్తూనే ఉన్న అతని విషయాలు, సంఘటనలు, వాటి కారణాలు రేళేకి అర్థమయ్యాయి. కాని నరహరి అడి గిన ఆధ్యాత్మిక ప్రశ్నలు ఆయనస్థాయికి, ఆయన జ్ఞానానికి అందని పైస్థాయిలో ఉంటాయి. ఆయనదీ సన్యాస జీవితమేగాని, లోక సహజంగా సాగే పద్ధతి ఆయనది. జీవితంలో విసుగు, నిస్పృహ కలిగి చివరకి క్కడ నౌకరీకి చేరారు. ఎప్పుడూ కాషాయ వస్త్రాల సన్యాసం తీసుకోలేదు. అన్నీ విన్నాక రేళే అన్నాడు. "నేనూ ప్రపంచం చూసాను. దత్తు తీసుకున్నప్పటి ఉత్సాహం, ఏడాది, రెండేళ్ళయ్యాక ఎంతోమందికి ఉండదు. తరువాత వాళ్ళకి పిల్లలు పుట్ట వచ్చు మనసు మారచ్చు. కన్నకొడుకు స్వంత రక్తం అంటే ఏదన్నా చెడ్డబుద్ధి నేర్చు కున్నా క్షమిస్తారు. మరొక రక్తబంధాన్ని దత్తు తీసుకుంటే, కుర్రాడు ఏమన్నా తప్పు దోవ తొక్కితే సహనం ఉండదు. ప్రపంచం తీరే అంత"

"అయితే నా పిల్లలు సుఖంగా లేరం టారా? "

"ఒకసారి కళ్ళారా చూడాలి. చూడకుండా ఎలా చెప్పడం? "

"ఒకసారి వెళ్ళి చూడాలనే ఉంది. కాని ఆ తల్లిదండ్రులు నన్ను గుర్తిస్తారు. వారిద్దరి మధ్య సంబంధం బాగుంటే, కన్న తండ్రినని నేను గుర్తుచేసి, వాళ్లమధ్య అడ్డుపుల్లనెందు కవాలని వెనుకంజ వేశాను. పెంపకం ఇచ్చే సాక కూడా నేనొచ్చి చూసిపోతూ ఉంటా





నని దత్తత జరిగినపుడు పిల్లలతో అన్నాను గాని, అది కేవలం వాళ్ళనోదార్చడానికంతే. అప్పుడు దత్తు తీసుకున్నవారిలో ఒకరు 'ఇచ్చాక ఇంక అక్కడికి ముగిసినట్టే, మధ్య మధ్యలో అలా రాకూడదు' అని అనడం కూడా నా చెవిన పడింది. నేనూ వెళ్ళకూడ దని ఊరుకుండిపోయాను. అదీకాక 'నాది' అనే మమకారం మళ్ళీ పుట్టకూడదనే ఆ నిర్ణయం తీసుకున్నాను. సన్యాసం అంటే మమకారం స్థాయినుంచి పైస్థాయికి ఎద గడం. ఒకసారి దాన్ని స్వీకరించాక వదల్లేం. కావి బట్టలు వదిలేసానుగాని, వాటి పరమార్థం వదిలిపెట్టలేదు"

ఏం జవాబు చెప్పాలో రేళేకి తెలియ లేదు. ఆయనకి నిద్ర ముంచుకొస్తోంది.

లేచి పైకి వెళ్ళి పడుకున్నారు. మనసు తేలిక పడ్డట్టయి నరహరి కూడా చాపమీద ఒళ్ళు వాల్చాడు.

★ ★ ★

రేళే ఆలోచిస్తూనే వున్నాడు. రెండు రోజుల తరువాత "ఒక ఉపాయం తోస్తోంది. మీరు వెళ్ళకండి. దత్తు తీసు కున్న వాళ్ళిళ్ళకి నేను వెళ్ళి చూసివస్తాను. పిల్లలెలా ఉన్నారో తెలుస్తుంది" అన్నాడు.

"ఎలా విచారిస్తారు? "

"దాతలెవరైనా చందాలు, కానుకలు ఇస్తే స్వీకరించే మన ఆశ్రమ చందా రసీదుల పుస్తకం ఉంది కదా. అది చేతిలో పట్టుకుని తిన్నగా వాళ్ళిళ్ళకే వెళ్తాను. అక్కడే దిగు తాను. అనాథాశ్రమానికి దానం ఇవ్వండి అని అడిగే నెపంతో సంగతులు కూపీ తీస్తాను. చుట్టుపక్కల వాళ్ళవల్లనైనా తెలు స్తుంది. నాకు ఆ ఊళ్ళ వివరాలివ్వండి"

"ఇంచుమించు చిరునామాలు స్పష్టంగానే గుర్తున్నాయి. ప్రతి ఒక్కరి ఊరు, ఇల్లు చూసాను. వివరంగా చెబితే వెతకడం కష్టం కాదు. ప్రయాణం ఖర్చులకెలా? "

"మీరేం బెంగ పెట్టుకోకండి. నా దగ్గర కొంత డబ్బుంది"

అన్నాడు రేళే. అతడికి ఈ అన్వేషణలో ఒక కుతూహలాత్మకమైన తృప్తి వుంది. పది పన్నెండు రోజులపాటు 'జల్గాం' వెళ్ళా స్తానని చారిటీ ట్రస్ట్‌కి చెప్పి బయల్దేరాడు రేళే.

రైలెక్కి మధ్నాహ్నం నాలుగు గంటలకి బరోడా చేరారాయన. వాళ్లని, వీళ్లని కను క్కుని సిటీబస్ పట్టుకుని మాండ్వీకి వెళ్ళారు. నరహరి చెప్పిన గుర్తుల ప్రకారం వెతికితే, బాబూభాయి శాంతీభాయి పటేల్ దుకాణం సులువుగానే దొరికింది. తిన్నగా దుకాణంలోకి వెళ్తే పనిజరగదని అతనికి తెలుసు. బయటే నుంచుని ఒక పనికుర్రా డిద్వారా పటేల్ గారిల్లు ఎక్కడో తెలుసుకు న్నాడు. యజమాని దుకాణంలో వున్న సమయంలో యజమానురాలు ఇంట్లో ఉంటుందని, ఆమెవల్ల వివరాలు రాబట్టడం సులువనీ లెక్కవేసి వెళ్ళారు. పటేల్ ది రెండంతస్థుల ఇల్లు. పెద్ద హాలుకి మధ్యగా ఉయ్యాల, ముందుచావడిలో సోఫాసెట్ కనిపిస్తోంది. చూడగానే సంపన్నులని తెలు స్తూనే వుంది. రేళేకి గుజరాతీ బాగానే అల వాటుంది. లోపల్నుంచి ఏడెనిమిదేళ్ళ కుర్రా డొకడు, ఐదేళ్ళ కుర్రాడొకడు ఉయ్యాలూ గుతూ కనిపించారు.

రేళే లోపలికొచ్చి "బేన్‌జీ ఎక్కడున్నారు బాబూ? " అనడిగారు. పిల్లలు వెళ్ళి తల్లిని పిలిచారు.

ఆమెను చూస్తూనే "పిల్లలు రాజకుమా రుల్లా వున్నారు. ముఖంచూస్తే మహా యోగం కనిపిస్తోంది. పెద్దపెద్ద మిల్లులకి మాలికులయ్యే లక్షణాలున్నాయి. ఇద్దరే పిల్లలా? ఎంత వయసు? "

"ఊc, ఇద్దరే జశ్‌భాయ్‌కెనిమిదేళ్ళు, మానూభాయికి ఐదు. మీరెవరు? " అనడి గిందావిడ.

"బొంబాయి అనాథాశ్రమానికి చందా అడగడానికి వచ్చాను. చందా తీసుకుంటాను సరేగాని, ఈ చుట్టుపక్కల అనాథపిల్లలుంటే తీసికెళ్ళి చేర్చుకుంటాం. మీకు అలాంటి పిల్లలు ఎవరన్నా తెలిస్తే చెప్పవచ్చు మేం పెంచుతాం. పదేళ్ళు దాటిన వాళ్ళయినా ఫరవాలేదు"

ఆ స్త్రీ ముఖం అరక్షణం నల్లబడింది. కాని తక్షణం "ఈ చుట్టుపక్కల అలాంటి వాళ్ళెవరుంటారు? నాకేమీ తెలీదు" అంది. "చందా అంగడికి వెళ్ళి అడగండి" అందామె. దానికి, "రాత్రి ఈ ఊళ్ళోనే మకాం. ఇక్కడే ఆయన్ని కలుస్తానులెండి" అని ఆగాడు.

రాత్రి ఎనిమిది గంటలకి పటేల్‌గారు ఇంటికొచ్చారు. చందా ఇచ్చి రసీదు తీసుకున్నారు. ఈయనతో పెద్ద మాటలేమీ ఆడలేదు. రాత్రికి ఇంట్లో భోజనం పెట్టించారు. పరిచయం లేని గుర్తు తెలీని కొత్త మనిషి కావడంవల్ల ఒక చాప, దిండు ఇచ్చి వరండాలో పడుకోమన్నారు. తాము తలుపులు భద్రంగా వేసుకుని లోపల పడుకున్నారు. రేళే నిద్రపోయాడుగాని, ఇక్కడి సంగతులేవీ తెలియలేదన్న అసంతృప్తి మనసుని దొలుస్తూనే వుంది. నరహరి చెప్పిన ప్రకారం లక్ష్మణుడనే పదకొండేళ్ళ కుర్రవాడిని ఈ ఇంటికి దత్తతిచ్చాడు. దుకాణం పేరు, యజమాని పేరు, యజమానురాలి పేరు అన్నీ సరిగ్గానే వున్నాయి. ఆ బిడ్డేమన్నా మరణించలేదు కదా? ఈ పిల్లల మొహాల్లో పోలికలు చూస్తే పటేల్‌గారి పోలికలే వున్నాయి. అంటే వారి స్వంత పిల్లలే అయ్యుండవచ్చు. లక్ష్మణుడి గురించి చుట్టుపక్కల కనుక్కుంటే తెలియవచ్చు. కాని కనపడ్డవాళ్ళనల్లా ఆరాతీస్తే వీళ్ళకి తెలిసిపోవచ్చు లేదా అనుమానం వచ్చి నన్నే ఎదురు ప్రశ్నలడగవచ్చు అని ఆలోచించుకుని, పొద్దున్నే లేచి ముఖం కడుక్కున్నాడు.

"ఈరోజేంచేస్తారు? " అని పటేల్‌గారు అడిగిన ప్రశ్నలో 'ఇంకా మా ఇంట్లో ఎందుకున్నారు' అనే అర్థం స్ఫురించింది.

"మార్కెట్ వీధిలో చందాలడుగుతాను" అని రేళే అక్కడ్నుంచి బయల్దేరాడు.

పదకొండు గంటలకొక హోటల్లో దాల్-రోటీ తిని ఆయన పటేల్ దుకాణం దగ్గరకి వెళ్ళారు. ఆ దుకాణాని కెదురుగా ఒక 'చా' అంగడి ఉంది. ఒక కప్ చాయ్ తాగి అక్కడే కూర్చున్నాడు. పటేల్ దుకాణం నుంచి ఒక పనివాడు బయటకొచ్చాడు. 'భాయ్' అని పిల్చి పలుకరించి ఒక చాయ్ ప్పించి తానిలా అనాథాశ్రమానికి చందాలు వసూలు చేయడానికొచ్చానని చెప్పి, "మీ పటేల్‌సాబ్‌ని అడిగితే చందా బాగా ఇస్తారా? " అనడిగాడు.

"ఆc... ఇస్తారొక రూపాయి" అన్నాడు హేళనగా.

"ఏం? వ్యాపారం బాగోలేదా? "

"ఎందుకు లేదు? కోట్లు ఆర్జిస్తున్నాడు. పనివాళ్ళకి పదిరూపాయల జీతం కూడా పెంచడు"

"అలాగా! భాయీ, ఎన్నాళ్ళనుంచి ఆయనదగ్గర పనిచేస్తున్నావు? "

ఆ కుర్రాడీయనతో కష్టసుఖాలు చెప్పుకున్నాడు. పటేల్‌ని తిట్టిపోసాడు. చివరకి రేళే అడిగాడు. ఈయనకి ఇన్నాళ్ళూ పిల్లలెందుకు పుట్టలేదు?

"దేవుడివ్వలేదు. తరువాత ఇంగ్లండ్‌లో బేన్‌కి ఆపరేషన్ చేయించారు"

"అదీ సంగతి, అలా చెప్పు, మరయితే ఎవర్నీ పెంచుకోలేదా? "

"తెచ్చుకున్నారుగా" అని గొంతు తగ్గించాడు.

"చెప్పు, నాకూ తెలుసు. ఏమయ్యాడా





పిల్లాడు? " అని అతని భుజంమీద చెయ్యి వేసాడు.

"దత్తత చేసుకున్నారు. లక్ష్మణభాయి అని... బొంబాయిలో ఒకడికి పెళ్ళాం పోయి, పిల్లల్ని పెంచలేక పెంపకానికిచ్చాడట. సరే వీళ్ళే వెళ్ళి దత్తత చేసుకుని తెచ్చుకున్నారు. రెండేళ్ళు మహా పసంద్‌గా పెంచుకున్నారులే. ఎవరో చెప్పారట. 'ఇంగ్లండ్ వెళ్ళి ఆపరేషన్ చేయించుకుంటే మీకే పుడతారుగా పిల్లలు' అని. పటేల్ చెల్లెలు శాంతబేన్‌ని ఆఫ్రికాకి ఇచ్చారు తెల్సుగా? "

"ఊc, తెలుసు, తెలుసు! ముందు సంగతి చెప్పు"

"అక్కడికి వెళ్ళినపుడు, అక్కడ్నుంచి ఇంగ్లండ్‌కి వెళ్ళి ఇందూబేన్ ఆపరేషన్ చేయించుకువచ్చింది. ఆమెకి పిల్లలు పుట్టారు"

"లక్ష్మన్‌భాయీ ఏమయ్యాడు? "

"మరో మూడేళ్ళవరకు బాగానే వున్నాడు. మొదటికొడుకు జశ్‌భాయి, రెండవవాడు మనూభాయి. జశ్‌భాయి పుట్టాక దత్తపుత్రుడిమీద ప్రేమ తగ్గింది. ఆ తరువాత నాలాగ పన్లో పెట్టేసుకున్నారు. మనూభాయి పుట్టాక శాంతాబేన్ ఆఫ్రికాకి వెళ్ళింది. అక్కడ లక్ష్మణ్‌భాయి చనిపోయాడట"

అతడు చెప్పిన స్వరంలోనే చివరి మాట అబద్ధం అని తెలిసిపోయింది. "చచ్చిపోయాడా? లేకపోతే వీళ్ళే ఏదన్నా...? "

గొంతు బాగా తగ్గించి అతనన్నాడు. "పెద్దాళ్ళ కతలు మనకెలా తెలుస్తాయి? అక్కడే ఏదన్నా మందో మాకో ఇప్పించి ఫినిష్ చేసేసుండవచ్చు కూడా. ఎవరన్నా కూలినాలి చేసుకునేవాళ్ళకిచ్చేసి ఉండొచ్చు. సముద్రాలు దాటిపోయిన తరువాత ఏదైనా ఏం తెలుస్తుంది? ఇక్కడకి వచ్చాక పటేల్ గారు పదిమంది ఎదుటా తెగ బాధపడిపోతున్నట్టు మాట్లాడారు. కాని మొహంమీద బిడ్డని పోగొట్టుకున్న బాధ, దిగులు ఏమీ కనపడలేదు. ఇందూ-బేన్ కూడా అలాగే చేసిందో నాలుగు రోజులు"

"పోలీసులేమీ చెయ్యలేరా? "

"ఆc... సముద్రం దాటివెళ్ళి నాలుగేళ్ళయిన కథకి పోలీసోళ్ళేం చేస్తారు? కావాలంటే వీళ్ళు వాళ్ళకి గడ్డి తినిపిస్తారు"

ఇంక తెలుసుకోవలసిన వివరాలేమీ కనపడలేదు. రేళే మౌనంగా ఉండిపోయాడు. ఆ కుర్రాడు, "పదండి, ఆలస్యం అయితే పటేల్‌గారు భోజనానికి వెళ్ళిపోతారు" అన్నాడు.

"తరువాత వెళ్తాను. ఇటుపక్క ఇంకొకర్ని చూడాలి" అనేసి రేళే సూర్‌సాగర్‌వేపు నడుచుకుంటూ వెళ్ళిపోయాడు.

పనికుర్రాడు దుకాణంవేపు వెళ్ళిపోయాడు.

నరహరి చెప్పిన విషయాలు నెమరు వేసుకుంటూ రేళే స్టేషన్ చేరారు.

రామలక్ష్మణులు రెండేళ్ళ చిన్నపిల్లలు. ఎప్పుడూ అనారోగ్యంతో భేదులవుతూ వుండటం ఆ పరిస్థితుల్లో పటేల్ భార్య, జయపూర్ చాంద్‌మల్ భార్య వచ్చి అసహ్యించుకోకుండా ఇద్దరూ చెరొకర్ని తీసుకుని శుభ్రం చేసి ఒళ్ళో కూర్చోబెట్టుకున్నవైనం, ఎవరెత్తుకున్న బిడ్డని వారే దత్తత తీసుకోడం- వాళ్ళు పిల్లల్ని తొలిసారి ట్రీట్ చేసిన పద్ధతి చూసి మాతృవాత్సల్యానికి ఇంతకన్న నిదర్శనం ఏమిటి. అని తర్కించారట నరహరిగారు. శెనాయ్ దాన్ని ఒప్పుకున్నాడట.

కాని ఇప్పుడు జరిగిందేమిటి? నమ్మ శక్యం కాకుండా వుందే.

'రేళే లోకంపోకడ తెలిసినవాడు. దత్తతే తీసుకున్నంతమాత్రాన తమకి స్వంత

పిల్లలు కావాలనీ, వాళ్ళు తమ కడుపునే పుట్టాలనే కోరిక అంతరించిపోదు. వాళ్ళకి స్వంత పిల్లలు పుట్టారు. అసలే శ్రీమంతులు, వ్యాపారం కూడా వుంది. తమ పిల్లలతో సమంగా ఆపిల్లాడికీ ఆస్తి ఎందుకివ్వాలన్న ఆలోచన వచ్చి వుంటుంది. ఎలాగైనా ఒక దారి వెతకాలి. ఆఫ్రికాలో ఎలాగో వదిలించుకు వచ్చారు. చంపేసి వుండకపోవచ్చు మరీ అంత కర్కోటకులయ్యుండరు. కాని చావలేదు, బతికేవున్నాడు అనుకుందామంటే, ఎక్కడ? ఎలా వున్నాడు,? ఏం చేస్తున్నాడన్న ప్రశ్న పుడుతుంది. రేపు ఆస్తి పంపకాల సమయంలో అదొక సమస్య అయి కూర్చుంటుంది. అందుకని ఆ సమస్య తల ఎత్తకుండా చనిపోయాడని చెప్తున్నారేమో. ఎక్కడైనా ఎవరికైనా పిల్లల్లేని వారికిచ్చేసి వుండొచ్చు ఆ దేశాల్లో బానిసల్ని అమ్ముకోడం అక్కడక్కడ వుంది. అలా అమ్మకానికిచ్చేసినా ఇచ్చేసి ఉండవచ్చు లేదా చంపేసి వుంటే కూడా ఉండొచ్చు ఇది ఏం జరిగింది, ఎలా జరిగింది? అని కనిపెట్టడం తమలాంటి పేద వాళ్లవల్ల అయ్యే పనికాదు.

రేళేగారికి చాలా బాధ కలిగింది. ఆ వ్యధ కేవలం లక్ష్మణుడి పరిస్థితివల్ల మాత్రమే కలిగింది కాదు, మానవ స్వభావంలోని చిత్రమైన మార్పులు తెలుసుకోవడం వల్ల కూడా కలిగింది.



ధీరేంద్రమోహన బసు ఇంకా జబల్‌పూర్‌లోనే ఉండివుండకపోవచ్చని రేళే ఊహించాడు. పదేళ్ళక్రితం రైల్వే అసిస్టెంట్ స్టేషన్ మాస్టర్‌గా ఉండిన మనిషి ఈపాటికెక్కడైనా ట్రాన్స్‌ఫర్ అయ్యుండచ్చు కూడా. అది ఊహించే రైలు దిగ్గానే ఎ.ఎస్.ఎమ్. రూమ్‌కి వెళ్ళి కనుక్కున్నాడు. ఇప్పుడాయన ఇటార్సిలో స్టేషన్‌మాస్టర్‌గా ఉన్నారట. ఆ రైలొచ్చేవరకు ఆగి రేళే అందులో వెళ్ళారు.

ఇటార్సి చేరేసరికి మధ్యాహ్నం మూడు గంటలయింది. బసుబాబు ఆఫీసులో ఉండే సమయం. అయినా రేళే మెల్లగా ఆరాతీసి స్టేషన్ వెనుక ఫర్లాంగు దూరంలో వున్న వారి క్వార్టర్స్‌కి వెళ్ళారు. ఇంటిముందు 'గార్డెన్‌లో ఏడేళ్ల ఒక మగపిల్లాడు, ఐదేళ్ళ ఆడపిల్ల ఆడుకుంటున్నారు. తల్లిని పిలవమని కుర్రాడికి చెప్పి, ఆయన అరుగు దగ్గర నుంచున్నాడు. లోపలినుంచి నీలంచీర ధరించి, కళ్ళజోడు పెట్టుకుని, పాపిట సింధూరం అద్దుకున్న నలభైయేళ్ళ స్త్రీ వీరి మాటలు విని బయటకొచ్చింది. ఆయన్ని పిలిచి అరుగుమీదున్న కుర్చీలో కూర్చోబెట్టి అంది "కూర్చోండి బాబు. ఐదుగంటలకల్లా వచ్చేస్తారు. మీరు చాయ్ తాగుతారా? "

"తాగుతాను. వీళ్లు మీ పిల్లలా? ఇద్దరేనా? "

"కాదు, ముగ్గురు. పెద్దవాడు కాలేజ్‌కి వెళ్ళాడు"

ఆమె టీ తయారు చెయ్యడానికి లోపలకి వెళ్ళింది. రేళే పిల్లల్ని కబుర్లలోకి దింపాడు.

"నీ పేరేంటి బాబూ? "

"హీరేన్"

"చెల్లాయి పేరు? "

"నువ్వే చెప్పవే" అని ఆ పిల్లతో బెంగాలీలో అన్నాడు. ఆ పిల్ల ఓ క్షణం సిగ్గుపడింది. తరువాత ఆ కుర్రాడే-

"మొల్లికా" అని చెప్పాడు.

"మీ అన్నయ్య పేరు? "

"బిజోయ్"

"అన్నయ్యేం చదువుతున్నాడు? "

"కాలేజ్. పోయినసారి హైస్కూలు ఫస్ట్ క్లాస్‌లో పాసయ్యాడు"

"నువ్వు అన్నయ్యతో ఆడవా? "

"ఓ... ఒకసారి ఏనుగాటలో నేను అన్న





య్యని ఓడించాను. ఇదుందే చెల్లాయి... ఇదో మొద్దుమొహం. ఎప్పుడూ ఓడిపో తుంది"

తనని మొద్దు అన్నందుకు ఆ పిల్ల అలి గింది. అంతలో తల్లి చాయ్ తెచ్చింది. ఈయన చాయ్ తాగుతుంటే, ఆశ్రమం స్థితి గతులు, ఎంతమంది పిల్లలున్నారు? ఏమి ఆహారం ఇస్తారు మొదలైనవన్నీ అడిగింది. తరువాత, బొంబాయి మేం కూడా చూశాం. పదేళ్ళయిందనుకోండి. కలకత్తాలోలాగే గందరగోళం ఎక్కువ"

"ఆహాఁ, బొంబాయిలో బంధువులు న్నారా? "

"లేరు, ఊరికే చూద్దామని వెళ్ళాం. రైల్వేలో వున్నాంకదా, పాస్ దొరుకుతుంది"

ఇంకో పదినిమిషాలు మాట్లాడి ఆమె లోపలకి వెళ్ళింది. పిల్లలు పూలతోటలో ఆడుతున్నారు. రేళే ఒక్కడే ఆలోచిస్తూ కూర్చున్నాడు. విజయుడిక్కడే వున్నాడు. ఈ పిల్లలిద్దరూ వీరి పిల్లలు. కన్నపిల్లలో, పెంచుకున్నారో. అంతలో ఒక రెగ్జిన్ పుస్త కాల బ్యాగ్ పట్టుకుని పదిహేడేళ్ళ కుర్రాడు గేటు తీసుకుని వచ్చాడు. సింపుల్‌గా వున్న పైజామా, జుబ్బా వేసుకున్నాడు. ఎడంచే తికి వాచీ కట్టుకున్నాడు. ఆరోగ్యకరంగా ఎదుగుతున్నట్టు కనిపిస్తున్నాడు. ఒకవిధ మైన సౌమ్య, గంభీరభావం కనిపిస్తోంది. చూడగానే ఆ సిల్ల అన్నయ్యొచ్చాడని ఎగు రుకుంటూ వెళ్ళి ఆ పిల్లాడి మోకాళ్ళ దగ్గర గట్టిగా వాటేసుకుపట్టుకుంది. ఆ చిన్నకు ర్రాడు "బిజోయ్ ఏనుగాట ఆడదామా? వస్తున్నా ఉండు" అని లోపలకి పరుగె ట్టాడు. బిజోయ్ చెల్లెల్ని ఎత్తుకుని లోపలకి వెళ్ళాడు. ఐదు నిమిషాలకి తల్లి గొంతు వినపడింది. "నాన్నా, నేను పెట్టే చపాతీలే లెక్కగా పెడతాను. మళ్ళీ అందులోనూ మిగుల్చుకొస్తావేంరా బాబూ. మళ్ళీ త్వరగా ఆకలెయ్యదా? "

"నువ్వు చపాతీలు లావుగా చేస్తావమ్మా. నాకు ఎక్కువవవుతాయి"

"సరే, నేను ముసల్దాన్నయ్యాను పల్చగా చెయ్యడం రాదు. మీ ఆవిడొచ్చాక పల్చగా రేకుల్లా చేస్తుందిలే. నీ పెళ్ళయ్యేటంతవ రకూ మీరంతా ఇలాగే తినండిమరి"

"బిజోయ్‌కి షాదీ, అన్నయ్యకి పెళ్ళి, భాభీ వస్తుంది" అని అరుస్తూ పిల్లలిద్దరూ చప్పట్లు చరుస్తూ చుట్టూ తిరిగి గంతులె య్యసాగారు.

కొద్దిసేపటికి స్టేషన్ మాస్టర్ యూని ఫాంలో బసుబాబు ఇంటికొచ్చారు. చిన్న పిల్ల "నాన్నొచ్చారు, నాన్నొచ్చారు" అని పరు గెత్తుకు వెళ్ళి ఎదురుకుంది. ఆయనే బసు బాబు అని అర్థమైన రేళే లేచి నుంచుని చేతులు జోడించాడు.

నరహరి మాటలబట్టి ఆయన సౌజన్య శీలి. కళ్ళజోడులోంచి కనపడే శాంత దృష్టిని ప్రసరించే కళ్లు. రేళే గురించి విచా రించారు. "ఎప్పుడొచ్చారు? ఇక్కడ్నుంచి ఎక్కడకెళ్తారు? ఈ ఊళ్ళో తెలిసినవాళ్లు ఎవరన్నా వున్నారా? " మొదలైన ప్రశ్నల డిగి, మీరు మీ పనయ్యేవరకు ఈ గదిలో ఉండచ్చు అని అరుగుమీది చిన్నగది తలుపు తెరచి లోపల కూర్చోబెట్టారు.

బసుబాబు ఒక నూరు రూ॥ దానం ఇచ్చి మర్నాడు స్వయంగా స్టేషన్‌కి తీసికెళ్ళి ఎ.ఎస్.ఎమ్. గుమాస్తా, టి.టి. మొదలైన వారందరిచేత చందాలిప్పించారు.

"నాకు ఊళ్ళో జనం అంతగా తెలీదు. మీరే మార్కెట్ రోడ్‌కి, కోర్ట్‌కి, ఆఫీసులకి వెళ్ళిరండి. ఇలాంటి సత్కార్యం అంటే ఎవ రైనా ఇస్తారు. ఇవ్వనివాళ్ళూ ఉంటారను కోండి" అని ఆయన చెప్పాక రేళే ఊళ్ళోకి వెళ్ళాడు. ఎవర్నీ చందాలు అడగాల్సిన అవ సరం ప్రస్తుతం ఆయనకి లేదు. తను వచ్చిన పని అయింది. ఇంటికి వెళ్ళి తన

బ్యాగ్ తీసుకుని ఆగ్రా వెళ్ళాలనే ఆలోచన వచ్చింది. కాని మరో సందేహాన్ని తీర్చుకోవల్సివుంది. విజయ్ దత్తతకి వచ్చినప్పుడు

ఏడేళ్ళ కుర్రాడు. తెలివైనవాడని నరహరి చెప్పాడు. వీళ్ళు తన పెంపుడు తల్లిదండ్రులని తెలుసునా? తన కన్నతండ్రినెప్పుడయినా తల్చుకుంటాడా? ఈ మిగిలిన పిల్లలిద్దరూ బసుబాబు కన్నపిల్లలా? ఇవన్నీ ఎలా తెలుసుకోవడం? చుట్టుపక్కల ఎవ









ర్నన్నా అడగవచ్చు లేదా స్టేషన్‌లో కింది తరగతి నౌకర్లని అడగవచ్చు కాని అక్కడ చందాలు సేకరించడంవల్ల అందరికీ నేనె వర్నో తెలిసిపోయింది. ఇది పనికిమాలిన ఆరాలని వారికి అనిపించవచ్చు

ఇవన్నీ కనుక్కోడం అనవసరం ముఖ్యవిషయం తెలిసింది. కుర్రాడిని తమ కొడుకుగా స్వీకరించి ప్రేమగా పెంచుకుంటున్నారు. మాట్లాడకుండా వెళ్ళిపోదామా అనిపించింది. కాని కుతూహలం ఆపుకోలేకపోయాడు. బాబుజీనే సూటిగా అడిగెయ్యాలి. ఆయన కోపించే బాపతుకాదని తెలుసు గనుక ఐదున్నరకే ఇంటికి చేరాడు. అప్పటికే బసుబాబు ఇంట్లో ఉన్నారు. రేళేకి చాయ్ అందించాక అడిగారు. "ఊళ్ళో పని జరిగిందా? "

"ఫరవాలేదు" అని జవాబిచ్చాడు. చాయ్ తాగాక, "బాబూజీ మిమ్మల్నొక వ్యక్తిగత విషయం అడగాలి. కోపం తెచ్చుకోనంటే అడుగుతాను. మీరు మాటివ్వాలి" అన్నాడు.

"నాకేం కోపం రాదు. అడగండి ఫరవాలేదు. చెప్పదగినదయితే తప్పక చెప్తాను" అని ఆయన కుర్చీ దగ్గరగా లాక్కుని కూర్చున్నారు.

"నేనిక్కడకి వచ్చింది నిజంగా చందా కోసం కాదు" అని రేళే అంతా వివరించారు.

బసు అన్నారు: "నిజమేమరి. మూడేళ్ళ క్రితం స్టేషన్ మాస్టర్ల కాన్‌ఫరెన్స్‌కి బొంబాయి వెళ్ళాను. బిజోయ్‌ని కూడా తీసి కెళ్ళాను. ఇద్దరం చెంబూర్‌లోని ఇంటికి వెళ్ళాం. ఇక్కడ నరహరి అనే వాళ్ళెవరూ లేరు. మాకు తెలీదు అనేశారు. టైమ్స్ ఆఫ్ ఇండియాకి ఫోన్ చేశాను. మిస్టర్ శెనాయ్ హాంకాంగ్‌కి వెళ్ళారు అని చెప్పారు. వాపస్ వచ్చేశాము"

"అంటే తన కన్నతండ్రి వేరే అని అతనికి తెలుసా? "

"దత్తత తీసుకున్నప్పుడు ఏడేళ్ళ కుర్రాడు. జ్ఞాపకం లేకుండా ఎలా ఉంటుంది? అదీ కాక ఆ సంగతి దాచి ఉంచాలని నేనూ ప్రయత్నించలేదు. వాడు ముందు ముందు మమ్మల్ని పోషిస్తాడనిగాని, మాకేదో ఉపకారం చేస్తాడనే ప్రలోభంతోగాని మేం దత్తు తెచ్చుకోలేదు. పుత్రవాత్సల్యానికొక బిడ్డ కావాలి. తీసుకున్నాం. పిల్లల్ని సహజంగా ప్రేమిస్తాం. ప్రేమవల్ల మనం సంతోషం పొందుతాం. మన సంస్కారం బాగుపడుతుంది. తరువాత దేవుడు మా కడుపునే ఇద్దరు పిల్లల్ని ప్రసాదించాడు. పిల్లలు కావాలని మేం పూజలు చెయ్యలేదు. మొక్కలేదు. మందులు, మాకులు వాడలేదు. దైవలీల విచిత్రం. ఇన్నేళ్ళ తరువాత పిల్లలు పుట్టారు. ప్రేమించడంవల్ల మన సంస్కారం బాగుపడుతుందనే భావంతోనే వాడినీ మా పిల్లల్లో ఒకడిగానే పెంచుకుంటున్నాం. ముగ్గురూ చక్కగా ఉన్నారు. చక్కగా పెరుగుతున్నారు"

"విజయ్ తండ్రిని చూడాలనడా? "

"పిల్లాడిది సున్నితమైన స్వభావం. మనసులో ఏముందో తెలియదు. బొంబాయిలో

నేనే అడిగాను. మీ నాన్నని చూడాలని వుందా అని. 'నాకేం తెలియదన్నాడు. రా చూసొద్దామని నేనే తీసికెళ్ళాను. ఆయన దొరకలేదు. వాపస్ వచ్చాం. తరువాత అత నేమీ మాట్లాడలేదు. ఒకవేళ వాడి కన్న తండ్రి వచ్చి ఇక్కడ నాలుగురోజులుండి వాడిని చూసుకుని వెళ్తే మేమేమీ మత్సర పడం. మేము పెంపుడు తల్లిదండ్రులమన్న మాట నిజమేగాని, శాస్త్రప్రకారం దత్తత తీసుకున్న హక్కు మాకుందిగాని, కన్న తండ్రి ప్రేమకి అడ్డొచ్చే హక్కు మాకు లేదు. అసలెందుకు అడ్డు రావాలి?"

"మీ కడుపున పిల్లలు పుట్టకపోయినా ఇలాగే చెప్పేవారా?"

"ఓహో! ముందే చెప్పానుగా. సర్కారీ నౌకర్ని నేను. ఏ ఆస్తి పాస్తులని ఉద్ధరించుకోవాలనో నేను దత్తత తీసుకోలేదు"

"మీ సంగతలా ఉంచండి. లోకం తీరుచెప్తున్నాను. ఆస్తిపరుల ఇంటికి దత్తతిచ్చి, తరువాత కన్నతండ్రి కూడా చూసే నెపంతో వచ్చిపోతూ, సంబంధం ఏర్పరచుకుని, వారి ఆస్తికి ముప్పుతెచ్చే కుతంత్రాలూ జరుగుతాయి. అలాంటి సంఘటనలు చూశాను కూడా"

నా విషయంలో ఆ ప్రశ్నే లేదుకద. ఆస్తి కోసం దత్తత తీసుకుంటే ఆ భయం వుంటుంది. నేను ప్రీతికొద్దీ పెంచాను. దానికి బదులుగా నేనేమీ ఆశించను. ఆఖరికి వాడి ప్రేమని కూడా. ఆ ప్రతి ప్రేమని ఆశించడం అనేది కన్నపిల్లలనుండి కూడా నేను ఆశించడంలేదు. అలాంటప్పుడు నాకు బెంగేమిటి? నరహరిరావుగారికి చెప్పండి, ఎప్పుడయినా ఇక్కడికొచ్చి వెళ్లమని, పిల్లాడిని చూసుకోమనీ"

రేళే బరోడాలో తాను తెలుసుకునొచ్చిన సంగతి చెప్పాడు. "బరోడా పటేల్ దంపతులు గుర్తున్నారు నాకు. దత్తతశాస్త్రం జరిగిన నాడు అందరం ఒకర్నొకరు చూసుకున్నాం" అని విషయం తెలిసిన బసు ఖిన్నుడైపోయాడు.

రేళే మర్నాడు ఉదయమే అక్కడ్నుంచి ఆగ్రా బయల్దేరాడు. ఆయన్ని స్వయంగా రైలెక్కించి కూర్చోబెట్టి, బాబు, "నరహరిరావుగారికి ఎప్పుడు రావాలనిపిస్తే అప్పుడు రమ్మని చెప్పండి. బిజోయ్ మాత్రమే కాదు హిరేన్, మొల్లికా కూడా వారి పిల్లలే" అన్నాడు.

రైలు స్టేషన్‌నుంచి ముందుకి పోతుంటే రేళే మనసు తృప్తితో నిండిపోయింది. మూడురోజుల క్రితం బరోడానుండి బయల్దేరినప్పుడు కలిగిన అశాంతి, ఇప్పుడు కొంత వరకు సమాధానపడింది.



ఆగ్రాలోని ఫ్లులట్ చౌక్ దగ్గర కినారి బజార్‌లో సత్యపాల్, అగర్‌వాల్ బట్టల దుకాణానికి వెళ్ళేసరికి మధ్యాహ్నం ఒంటి గంట అయింది. సామాన్యమైన దుకాణం. మాలిక్‌కోసం ఒక బాలీసు, నేలమీద రెగ్జిన్ షీటు పరచివుంది. చీరలు, దుప్పట్లేకాక అక్కడ మంచి షర్టు, కోటు గుడ్డలు కూడా దొరికే విభాగం వుంది. ఓ పదిహేనేళ్ల కుర్రాడు తప్ప షాపులో ఇంకెవరూ లేరు. కుర్రాడు దిండుకి ఒరిగి కూర్చుని, ఎదురుగా వున్న చిన్న ఇనపపెట్టి ముందున్న పెద్ద స్టీలు కప్పుతీసి చిల్లర లెక్క పెడుతున్నాడు.

రేశే వెళ్ళగానే తన వ్యాపార చాకచక్యంతో, "అయియే అయియే చౌదరీ, క్యాచాహియే? ' ' అని స్వాగతం పలికాడు. ఆ కుర్రాడి ఎదురుగా కూర్చుని, రేశే "పెద్దవాళ్లు లేరా? " అనడిగాడు.

"బాబూజీ భోజనానికి వెళ్ళారు. ఏం కావాలో చెప్పండి నేనే ఇస్తాను"

"వ్యాపారమంతా నువ్వే చూసుకుంటావా? "

"వేలల్లో వ్యాపారం చేసే మాటుంటే చెప్పండి. ఎన్నివేల రూపాయల మాల్ కావాలన్నా కొలిచిస్తాను. పక్కా క్యాష్ అక్కడ పెట్టాలి".

"సత్యపాల్ సాబ్‌కి ఏమవుతావు? "

"కొడుకుని"

"ఒక్కడివేనా? "

"ఊఁ..."

"పేరు? "

"గణేశ్‌చంద్ర్ అగర్వాల్"

"ఏ క్లాస్‌వరకు చదివావు? "

మీకవన్నీ ఎందుకు? కప్‌డా ఏం కావాలో చునావ్ చెయ్యండి"

కుర్రాడు చురుకుగా ఉన్నాడు. చహ్‌రా విజయ్ ఘుాదిరిగానే ఉంది. కాని విజయ్‌ది శాంతగుణం. ముఖంలో ఓర్పు, గాంభీర్యం కనిపిస్తాయి. ఇతడిలో ముందుకు చొచ్చుకుపోయే ధైర్యం, చాకచక్యం కనిపిస్తాయి. విజయ్‌ది పల్చటి శరీరసౌష్టవం. ఇతడు బొద్దుబొద్దుగా వున్నాడు. అచ్చం వ్యాపారస్థుడి కొడుకు అని చూడగానే చెప్పెయ్యొచ్చు

"ఎందుకు ఊరికే కూర్చున్నారు? బట్టలొద్దా? "

"బాబూజీని చూడాలని వచ్చాను"

అంతలో ఇద్దరు గిరాకీలు వచ్చారు కుర్రాడు లేచి వెళ్ళి వాళ్ళడిగిన షర్ట్ బట్ట చూపించాడు. "ఇప్పుడు గట్టిగా ఉన్న బట్ట ఇదే. ఇంజన్ డ్రైవర్ వాడినా ఆరేళ్ళవరకు బట్ట చిరగదు. మూడేళ్ళవరకు ఎండలో ఆరేసినా వెలవదు. వీనస్‌మిల్ అంటే ఏమనుకున్నారు. దాని గొప్పదనం అదే. బొంబాయిలోనే అలాంటి మిల్లు మరోటి లేదు" అని వచ్చినవాళ్ళు ఆమోదించేలా వ్యాపారం జరిగేలా మాట్లాడాడు. చెప్పిన రేట్లు తనకి నష్టం రానివిధంగా కొద్దిగా తగ్గించి, ఎదుటి వాళ్ళని సంతోషపెట్టి, పదేళ్ళ కుర్రాడికి ఎంతయితే సరిపోతుంది. అంతకంటే ఎక్కువ తీసుకుంటే ఎలా దండగవుతుందో చెప్పి, పెద్దవాళ్ళకి పౌణేతీన్, చిన్నవాళ్ళకి పౌణెదో చొప్పున కొలిచి ఇచ్చాడు. జుబ్బాకి ఈ బట్ట బాగుండదని, మెత్తగా వుండే మరో బట్ట చూపించి అన్ని వివరాలు ఇచ్చి బేరం పోగొట్టుకోకుండా కావలసినవన్నీ కొనిపించాడు. పెద్ద నోట్లు తీసుకుని లెక్క చూసుకుని చిల్లర ఇచ్చాడు. బిల్లు అడిగితే, "ఎందుకు సార్! బిల్లు రాస్తే సేల్స్‌టాక్స్ పడుతుంది. మీరు తిన్నట్టు కాదు, మేమూ తిన్నట్టు కాదు. ఆవార రేటు మీకు పెంచి, ఆ సొమ్ము టాక్స్‌కి కట్టాలి. అదంతా ఎందుకు. మా షాపు రేటంటే మిల్లు రేటనే లెక్క" అని వాళ్ళని చాకచక్యంగా పంపించాడు.

రేశే అంతా చూస్తూనే వున్నాడు. అంతలో యజమాని వచ్చాడు. సుమారు ఏభైయేళ్ళ వయసుంటుంది. బాగా ఒళ్ళొచ్చేసింది. పల్చటి గ్లాస్కోపంచె గోచీపోసి కట్టి, పైన తెల్లజుబ్బా వేసుకున్నాడు.

"నాన్నా ఈయన మీకోసం వచ్చారు. అరగంటనుంచి ఎదురుచూస్తున్నారు" అని చెప్పాడు కొడుకు. అనాథాశ్రమం కోసం చందాలు వసూలు చేయడానికొచ్చానని చెప్పి ఆశ్రమం వివరాలు తెలిపాడు రేశే. యజమాని చందా ఇచ్చి రశీదు తీసుకు

న్నాడు. తరువాత రేళే, "మీ అబ్బాయి చాలా బుద్ధిమంతుడు, తెలివైన వాడు. ఒక్కడే కొడుకా? " అన్నాడు.

"ఊc, ఒక్కడే"

"ఏం చదువుతున్నాడు? "

"హైస్కూలు"

"ఫస్ట్‌క్లాస్‌లో పాసవుతాడా? "

"వ్యాపారం బాగా చేసుకుంటాడు చదువు గురించి అంత పట్టింపేమీ లేదు"

రేళే, "శేఠ్‌జీ నేను హోటళ్లలో ఏమీ తినను. మీ ఇంట్లో భోజనం చేయవచ్చా? "

"మా భోజనాలిప్పుడే అయిపోయాయి కదు!"

"నాకు భోజనమంటూ పెద్దగా ఏమీ అవసరం లేదు. రెండు రొట్టెలయితే చాలు. స్నానం చేయకుండా ఏమీ తినే అలవాటు లేదు. స్నానంచేసి దేవుడికి దండం పెట్టుకున్నాకే నీళ్ళచుక్కైనా నోట్లో వేసుకునేది"

"సరే, గణేశ్ ఈయన్ని ఇంటికి తీసికెళ్ళి స్నానానికి ఏర్పాటుచేసి, భోజనం పెట్టించు. వెళ్ళు" అని కొడుక్కి చెప్పారు.

దుకాణంనుంచి ఇల్లు నాలుగు ఫర్లాంగుల దూరంలో ఉంది. ఆగ్రా సందుగొందుల్లో తీసికెళ్ళి ఇంటికి చేర్చాడు కుర్రాడు. ఆ కుర్రాడే అడిగాడు. "మీరు బొంబాయినుంచి వచ్చారా? " అని.

"అవును. బొంబాయి చూశావా నువ్వు? '

"ఊc... చిన్నపిల్లాడిగా ఉన్నప్పుడు చూశాను"

"ఎలా చూశావు? అక్కడుండేవాడివా? "

"కాదు, పితాజీతో వెళ్ళాననుకుంటాను. నాకు సరిగ్గా గుర్తులేదు. మంచి మంచి షర్టింగులన్నీ బొంబాయిలోనే తయారవుతాయికదా! నేను పెద్దయ్యాక మిల్లునుంచే డెలివరీ వచ్చేలా చేసుకోవాలి"

"సత్యపాల్‌జీ భార్య శోభారాణీ కూడా గుండ్రంగా, బొద్దుగా ఉంటుంది. వీరికి స్నానం, భోజనం ఏర్పాటు చెయ్యమని తండ్రి పంపిన కబురు తెలుపగానే శోభారాణి మళ్ళీ వంటింట్లోకి వెళ్ళింది. గణేశుడే నీళ్లతోడి పెట్టాడు. రేళేగారు స్నానంచేసి నుదుట కుంకుమ పెట్టుకుని గట్టిగా రెండు మరాఠీభజనలు చెప్పుకుని వచ్చారు. అంతలో రోటీ, సబ్జీ తయారయ్యాయి. అంతలో గణేశ్‌చంద్ర బయటకెక్కడికో వెళ్ళాడు. కంచం ముందు కూర్చుని చపాతీ తుంపుతూ రేళే, "మీ అబ్బాయి చాలా తెలివైనవాడమ్మా. వాడి కాలానికి వ్యాపారం బ్రహ్మాండంగా పెరుగుతుంది. బాగా పైకొస్తాడు. ముఖలక్షణం అలా చెబుతోంది మరి" అన్నాడు.

ఆవిడకి చాలా సంతోషం కలిగింది. కాని ఏం జవాబు చెప్పాలో తెలియక ఊరుకుంది. మళ్ళీ ఆయనే అడిగారు, ఈ అబ్బాయొక్కడేనా మీకు? "

"అవును"

"మధురా శ్రీకృష్ణభగవానుడికి మొక్కుకుంటే ఇంకా పిల్లలు కలిగేవారు"

"అన్నీ చేశాం. ఒక్కటీ ఫలించలేదు" అని చటుక్కున మాటలాపేసింది.

"మరీ పిల్లాడు? "

ఆమెకి వెంటనే ఏం చెప్పాలో తెలియలేదు. ఒక నిమిషం ఆగి, "వీడొక్కడే పుట్టాడు" అంది.

"ఏమిటి పెంచుకుంటున్నారా? " అన్నాడు వినపడనట్టు.

"లేదు, లేదు. నా కడుపున పుట్టినవాడే"

రేళే ఇంకేమి అడగలేదు. ఇంకొంచెం మాట్లాడితే ఆవిడ నోటివెంట విషయం రప్పించవచ్చు కాని కావలసిందేదో తెలిసింది. ఇంక ఆమె మనసును కెలకవలసిన




అవసరం లేదు. మాట మారుస్తూ "మీరూ ఒక్కరే అన్నీ చేసుకోవడం, చూసుకోవడం కష్టం. కోడలొస్తే సుఖంకదా? కొడుక్కి పెళ్ళెప్పుడు చేస్తారు? "

"నేను ఒక పిల్లని చూసే వుంచాను. ఎర్రగా యాపిల్‌పండులా ఉంటుంది. పద మూడు నిండాయి. ఈ సంవత్సరం చేసేద్దా మంటున్నాను నేను. మరో రెండేళ్ళు కానీ, పిల్లాడికి పదిహేడన్నా రావద్దా అంటు న్నారు వాళ్ళ నాన్న. మీరే చెప్పండి. పద హేనేళ్లకి పెళ్ళి చెయ్యకపోతే మగపిల్లలు చెడిపోరూ? "

"మీ మాటా నిజమే. మనవలొస్తే మీకూ కాలక్షేపం" అని ఆయన భోజనం ముగిం చారు.

అనాథాశ్రమం చందాలకోసం వచ్చారని తెలిసి ఆవిడ మితిలో ఆవిడా దానం చేసింది. భగవంతుడు మిమ్మల్ని చల్లగా చూడాలని ఆశీర్వదించి ఆయన నేరుగా స్టేషన్‌కి బయల్దేరారు.

జయపూర్ జవహరీ బజార్‌లో చాంద్‌మ ల్‌జీ ఇల్లు దొరకడం కొంచెం కష్టమ యింది. కిందభాగంలో తమ స్వంత వెండి బంగారు నగలషాపుని మూసేసి, ఆ మేడని అద్దెలకి ఇవ్వడంవల్ల ఇప్పుడాయన బోర్డు లేదు. బంగారం కంట్రోలొచ్చాక ఆయన వ్యాపారం మానేసి అక్కడక్కడ ఇళ్లు కట్టించి అద్దెలకిచ్చి తాము మాత్రం జవహ రిబజార్ ఇంట్లో పైభాగంలో ఉంటున్నారు. హోపట్ చౌపదీలో, చాంద్‌పూర్ బజార్‌లో ఇళ్లున్నాయి. ఇంకా కట్టించబోతున్నాడు కూడా.

జవహర్ బజార్‌లో కనుక్కుంటే ఎవరూ చిరునామా చెప్పలేదు. రెండు కాపురాలుండే ఇళ్లల్లో అడిగి తెలుసుకున్నాక వారిల్లేదో తెలి సింది. తీరా మేడెక్కి అడిగేసరికి చాంద్‌మ ల్‌జీ ఇంట్లోలేడు. భార్య లక్ష్మీదేవి ఇల్లు కడుగుతోంది. పన్నెండేళ్ల పనికుర్రాడొకడు నీళ్లు తెచ్చిస్తున్నాడు. రేళేగారు "చాంద్‌మ ల్‌జీ ఇంట్లో లేరా? " అనడిగారు.

"లేరు, చాంద్‌పూర్ బజారుకి వెళ్లారు. ఏం కావాలి మీకు? "

"కొంచెం పని ఉంద"ని చెప్పి ఆమె పిల వకపోయినా ఈయన లోపలికి వెళ్లి కూర్చు న్నారు. ఉయ్యాల, లావాటి ఇనప్పెట్టి, లోడు దిళ్లు వున్న ఆ ఇల్లు ఒక శతాబ్దపు వెనుకటి ఫ్యాషన్‌లో ఉంది. కానీ కలవారి సంసారమని ఎవర్కైనా వెంటనే తెలిసిపో తుంది. ఆమె వయసు సుమారు నలభై అయిదు. ఏదో వ్యాపార సంబంధంగా వచ్చి ఉంటారనుకుని ఈయన్ని మర్యాద చేసింది. కుర్రాడిని లోపలికి పంపి పెద్ద గ్లాసు కడు క్కుని రమ్మంది. ఆ గ్లాసునిండా చాయ్ పోసి పంపించింది. ఆయన చాయ్ తాగు తుంటే పక్కనే నుంచున్న కుర్రాడిని, "అరే ఉల్లూ, అక్కడనుంచుని ఏం చేస్తున్నావు? ఇటురా. కిందనుంచి నీళ్లు తీసుకురా!" అని కోపంగా పిల్చింది. అసలే చప్పగా ఉన్న ముఖాన్ని ఇంకా చప్పగా చేసుకుని చేతిలో ఒక బిందె పట్టుకుని వెనుక భాగానికి వెళ్లి పోయాడు. రేళే యజమానురాలిని పిలి చాడు 'మాతాజీ' అని.

"ఏం భాయీసాబ్, మీది ఏ వూరో తెలి యలేదు" అంటూ ఆమె అక్కడకి వచ్చింది.

"ఈ అబ్బాయి మీ కొడుకా? "

"ఈ ముదనష్టపు ముఖాన్ని చూస్తే కొడు కులా వున్నాడా? దిక్కులేని వెధవ. ఎక్కడో పడుంటే తెచ్చి అన్నం పెట్టి పోషిస్తున్నాను. ఇప్పుడేమో పని చెయ్యాలంటే ఏడుస్తు న్నాడు"

"ఏం? మీకు పిల్లల్లేరా? "

"భగవంతుడు దయచూపించలేదు. చెల్లెలి కొడుకుని దత్తత తీసుకున్నాను"

"స్వంతమైతేనేం, చెల్లెలి బిడ్డ అయి తేనేం? రెండూ ఒకటే. ఎక్కడికి వెళ్లాడు



అబ్బాయి? "

"ఇస్కూలుకి వెళ్లాడు. వచ్చే టైమూ అవుతోంది. బుజ్జిగాడికి అన్నం వండాలింకా"

"ఈ కుర్రాడెక్కడ దొరికాడు? "

"తిండానికి లేక వీధుల్లో తిరుగుతుంటే, ఇంట్లో చూసుకునే దిక్కెవరూ లేరని తెలిసి తీసికొచ్చి రోటీపెట్టి పెంచాను. ఇప్పుడు జనాలు ఇష్టం వచ్చినట్టు ఏవేవో అంటున్నారు. ఎవరేమంటే నాకేమిటట? వీధికుక్కలెన్నైనా మొరుగుతాయి" అంటూ గట్టిగా అనడం మొదలుపెట్టింది. రోడ్డుకి అవతల ఎదురింట్లో మొదటి అంతస్థులో ఇదే వయసు ఆడవాళ్లిద్దరు ఇటే చూస్తూ వున్న సంగతి రేళే గమనించాడు. అందుకే ఈ అరుపులని అర్థమయింది. ఇవి వాళ్లనుద్దేశించి చెప్తున్న మాటలేనని "మీరెవరు? ఏ ఊరు? " అని ప్రశ్న మళ్లీ మొదటికొచ్చింది.

"సాయంత్రం మళ్లీ వస్తాను. చాంద్‌మల్ జీని వచ్చాక కలుస్తాను. కొంచెం మాట్లాడవలసిన వ్యవహారం వుంది" అని ఆయన బాల్కనీలోకి వచ్చి కిందకి దిగారు. మళ్లీ పైకి చూస్తే ఆమె లోపలకి వెళ్లడం కనిపించింది. ఎదురింటి బాల్కనీలోకి చూస్తే అక్కడెవరూ కనపడలేదు. ఆయన తిన్నగా మెట్లెక్కి పైకి, ఎదురింటికి వెళ్లారు. అక్కడా మగవాళ్లెవరూ లేరు. వచ్చిన అపరిచితవ్యక్తిని "ఎవరు? ఎందుకు? " అని అడిగిన ఆడవారికి "అనాథాశ్రమం నుంచి వచ్చాను. ఈ చుట్టుపక్కల అనాథ పిల్లలుంటే చెప్పండి. తీసికెళ్లి పెంచుకుంటాం". అని చెబుతూ ఎదురింటికి కనపడని విధంగా లోపలవేపు ఉయ్యాల్లో కూర్చున్నారు. "అలాంటి అనాథ పిల్లలిక్కడెవరూ లేరు. ఆ ఇంటికి వెళ్లి అడగండి" అని నలభై సంవత్సరాల వయసున్న స్త్రీ అంది.

"మనకెందుకొచ్చింది? నువ్వూరుకో" అని ఇంకొకామె చెప్పినా వినకుండా మళ్లీ ఆమె అడిగింది "ఏవూరు మీది? "

"బంబయ్ మాతాజీ. దేవుడి సాక్షిగా చెప్తున్నాను. నేనెక్కడా నోరు విప్పను. మీ పేరసలే ఎత్తను. అలాంటి పిల్లలు వుంటే చెప్పండి. వాళ్లకో దారి ఏర్పరుస్తాం. ఆ పిల్లాడెవరో ఇక్కడికెలా వచ్చాడో చెప్పండి"

మరో స్త్రీ మళ్లీ వారించింది. కాని ఈ స్త్రీ ఊరుకోదల్చుకోలేదు. చెప్పనే చెప్పింది. "ఆ గొడ్డుమోతుదానికి పిల్లల్లేరు. బొంబై అట. ఎవరూ చూసుకునే దిక్కులేరంటూ ఎవరో బాబు పేపర్లో వేయించాడట. మొగుడూ పెళ్లాలిద్దరూ వెళ్లి రెండేళ్ల పిల్లాడిని దత్తత తీసుకున్నామంటూ తెచ్చారు. ఆరు నెలలు 'మేరాలాల్, మేరే బేటే' అంటూ ముద్దులాడి ముక్కు తుడిచింది. దీని చెల్లెలొకతుంది బికనీర్‌లో. దానికి తెలిసి అది పరిగెట్టుకొచ్చింది. అక్క చెవిలో బాగా నూరిపోసింది. 'ఎవరి రక్తమో, ఎవరి పిల్లాడో! రేపు వీడు మనమీదెందుకు ఆపేక్ష చూపిస్తాడు? రేపు నీ మీద వాడికి మమకారమేమీ ఉండదు. వీడిని తెచ్చి బాదరబందీ పెట్టుకున్నావు' అని బాగా తలకెక్కించింది. తరువాత తన మూడేళ్ల బిడ్డని తెచ్చి దత్తు చేసింది"

"యజమాని ఊరుకున్నాడా మరి? "

"ఛీ! వాడేం మొగుడు? పెళ్లామంటే హడలిచస్తాడు. ఎప్పుడూ అంతే"

"తరువాత? "

"చెల్లెలి కొడుకొచ్చాడు. బాబా అని ముద్దుగా పిల్చుకుంటారు. ఈ పిల్లాడు, రామ్‌చంద్ మీద ప్రేమకాస్తా ఎగిరిపోయింది. వాడిని చూస్తే చాలు మండిపడుతుందిప్పుడు. ఎవరో అన్నారట, నువ్వు మండిపడ్డా, తిట్టిపోసినా వాడికి ఆస్తిలో భాగం ఇవ్వక తప్పదని. ఇక చూసుకోండి ఆ రోజునుంచి వాడు చస్తే చాలని శాపనార్థాలు పెడుతుంది. వాడిని ఇస్కూలుకీ చేర్చలేదు. చెల్లెలి కొడుకుని మాత్రం అంగ్రేజి

 

స్కూలుకి పంపిస్తుంది"

"ఆవిడగారికి పాపం పుణ్యం తెలియజెప్పే వాళ్లెవరూ లేరా? "

"చుట్టుపక్కల వాళ్లే ఏవో చెప్పారు. ఎవరి మాటా ఆవిడ చెవికెక్కదు. ఏ విషమో పెట్టి పిల్లాడిని చంపెయ్యకుండా వుండటమే గొప్ప. మీలాంటి వాళ్లెవరన్నా అడిగితే ఇచ్చేసి చేతులు కడుక్కుంటుంది"

"ఆ పిల్లాడెక్కడుంటాడు? నేను వాడితో ఒకసారి మాట్లాడతాను"

కింద వీధిలో మంచినీళ్ల కుళాయి వుంది. అక్కడ్నుంచి మంచినీళ్లు తేడానికొస్తాడు"

చేతిసంచీ పట్టుకుని రేళేగారు లేచారు, "ఆగండి మీరిక్కడకి వచ్చినట్టు ఆవిడ చూసిందంటే కొంపమునుగుతుంది" అని ఓసారి బాల్కనీలోకి వెళ్లి తొంగి చూసి వచ్చి, "వెళ్లిరండి, మేం చెప్పిన సంగతులేమీ అనవద్దు" అని చెప్పి పంపింది.

రేళే వీధి కుళాయిగట్టు దగ్గరకి వెళ్లి కాచుకునుంచున్నారు. ఎంతోమంది వచ్చి మంచి నీళ్లు పట్టుకుని వెళ్తున్నారు. అరగంట అయినా కుర్రాడు రాలేదు. చివరికి ఒక బిందె తీసుకుని వచ్చాడు. వాడి భుజంమీద చెయ్యివేసి నాలుగడుగులు నడిపించుకు వెళ్లి "బేటా నాతో బొంబాయి వస్తావా? మీ నాన్న దగ్గరకి తీసికెళ్తాను" అని అడిగాడు.

ఆ కుర్రాడు మాట్లాడలేదు. మౌనంగా ఆయనవంక చూశాడు. ఆయన మళ్లీ అడిగారు! "మీ అసలు ఊరేదో తెలుసా బాబూ నీకు? "

అప్పుడు కూడా ఆ కుర్రాడు మాట్లాడలేదు. ఉక్కిరిబిక్కిరయినట్లుగా, ఏ దారి వెంట వెళ్లాలో తెలియక తప్పిపోయిన కుర్రాడిలా నిలబడ్డాడు. "చెప్పుబేటా, నన్ను మీ నాన్న పంపించారు"

"బొంబాయిలో వున్నారా? " నోరు విప్పి అడిగాడు వాడు.

"ఊం నీకెలా తెలుసు చెప్పు? "

"ఈ సందులో అంతా చెప్తారు. నాది బొంబాయిట. పెంచే వాళ్లులేక మా నాన్న నన్ను వీళ్లకిచ్చేసాడట. వీళ్లు తీసుకొచ్చారట"

"ఇప్పుడక్కడికొస్తావా? "

ఆ కుర్రాడికేమి జవాబివ్వాలో తెలియ లేదు. మొహంలో భయం కూడా కనపడింది. "నాకు ఆలస్యం అయిపోతుంది" అని చెప్పి బయల్దేరాడు.

"నేనిక్కడే వుంటాను, మళ్లీరా" అని చెప్పారీయన. బిందె నింపి భుజం మీద పెట్టుకు వెళ్లినవాడు రెండు గంటలయినా మళ్లీ రాలేదు.

హోటల్లో భోజనం చేసి వచ్చి సాయంత్రంవరకు ఎదురుచూసి మళ్లీ ఆయన చాంద్‌మల్‌జీ ఇంటికి వెళ్లారు. యజమాని ఇంట్లోనే వున్నారు. తమని పరిచయం చేసుకుని, "అనాథపిల్లలెవరన్నా వుంటే తీసికెళ్లాలని వచ్చాను. అలాగే అనాథశరణాలయానికి కానుకలు, చందాలు కూడా ఇవ్వచ్చు రెండింటికీ రశీదిస్తాను" అని చెప్పారు రేళేగారు. చాంద్‌మల్ ఎటువంటి ఉత్సాహమూ చూపించలేదు. ఐదు నిమిషాలాలోచించి ఒక రూపాయినోటు అక్కడ వుంచారు. అంతలో యజమానురాలొచ్చింది. "అనాథపిల్లలెవరన్నా వున్నా మాకు అప్పజెప్తే తీసికెళ్లి పెంచుతాం" అని మళ్లీ గట్టిగా అన్నారు రేళే. ఆమె చెవులు నిక్కబొడుచుకున్నాయి ఈ మాటవిని.

"మీరెవరు? ఏం కథ? పొద్దున్న ఇందుకే వచ్చారా? " అని వివరంగా అడిగింది. భర్తని లోపలకి రమ్మని పిలిచింది. ఒక గంటపైగానే భార్యాభర్తలిద్దరూ చర్చించుకున్నారు. ఆ కుర్రాడికి సంగతేమిటో అర్థమయినట్టుంది. బయట గుమ్మందగ్గర మౌనంగా నుంచున్నాడు. అదే సమయానికి మరో కుర్రాడు సుమారు పన్నెండు, పద

మూడేళ్లుంటాయి. ప్యాంటు, షర్టు, బూట్లు వేసుకుని స్కూల్ బ్యాగ్‌తో లోపలకొచ్చాడు. రాగానే బూట్లు విప్పి లోపలకి వెళ్లి పోయాడు. లోపల భార్యాభర్తలు మాట్లాడుకుంటున్న ధాటీ రేళేకి తెలుస్తోంది. భర్త మెల్లగా ఏదో విడమర్చినచ్చచెప్ప చూస్తున్నారు. భార్య ఆవేశంతో ఎగిరిపడుతోంది. గట్టిగానే, "మాట్లాడకుండా పంపించండి. ఇలాంటి కుర్రాళ్లకోసమే ఈ ఆశ్రమాలుందేది" అంటోంది.

చివరికి చాంద్‌మల్‌జీ బయటకి వచ్చి అడిగారు, "ఈ కుర్రాడిని మీకు అప్పజెప్తే మీరు తీసికెళ్లినట్టు రశీదు ఇస్తారా? " అని.

"జరూర్‌గా ఇస్తాను. డబ్బు రశీదివ్వాగాలేనిది, దీనికెందుకు ఇవ్వను? "

"చూడు రాంచంద్, ఈయన్తో బొంబాయి వెళ్తావా? " అని ఆయన ఆ కుర్రాడిని అడిగారు.

కుర్రాడేం జవాబు చెప్పాలో తోచక ఊరికే నుంచున్నాడు. లోపల్నుంచి ఆవిడొచ్చింది. "వాడినడిగేదేమిటి? వెళ్లకేం చేస్తాడు? " అంది.

రేళేగారు రాంచంద్ అనే కుర్రాడిని అనాథాశ్రమానికి తీసికెళ్తున్నట్టుగా తమ రశీదు బుక్‌లోనే రాసి రశీదిచ్చారు. ఇచ్చి "అనాథ శరణాలయానికి మీరు అయిదు వేలు అయినా చందా ఇవ్వాలి. పిల్లల్ని పెంచడంలో కష్టం మీకూ తెలుసుగా!" అన్నాడు.

చాంద్‌మల్ ఆలోచనలో పడ్డారు. కాని యజమానురాలు వెంటనే అంది "అనాథాశ్రమం ఉన్నదే ఇలాంటి దిక్కులేని పిల్లల కోసం. దానికి మేమెందుకు డబ్బివ్వాలి?.."

కాని యజమాని మరోవిధంగా ఆలోచించారు. లేచి ఇనప్పెట్టెతీసి ఐదువందల రూపాయలు లెక్కపెట్టారు. అంత డబ్బెందుకు? ఒద్దని భార్య అడ్డుపెట్టినా ఆగకుండా రేళేకిచ్చి రశీదు తీసుకున్నారు. తను వెంటనే బయల్దేరతానని రేళే అన్నాడు. ఆయన అందుకొప్పుకోక భోజనం చేసి వెళ్లండని బలవంతం చేశారు. కాని యజమానురాలు కిమ్మనకుండా కూర్చుంది. స్టేషన్‌లో భోజనం చేస్తానని రేళే చెప్పి, పైకిలేచి "చలో బేటా" అని రాంచంద్‌ని పిలిచారు. తన బట్టలు సర్దుకోమని చెప్పారాయన. వాడు మొద్దులానుంచున్నాడు. ఆయనే లేచి నాలుగు షర్టులు, చడ్డీలు, కంబళి, దుప్పటి చుట్టి కట్టిచ్చారు. రేళే తమ సంచీతోపాటు అదీ పట్టుకుని కుర్రాడితో బయల్దేరారు. యజమానురాలు బయటకి రానే లేదు.

స్టేషన్‌లో తెలిసింది, జయపూర్‌నుంచి బొంబాయికి సవాయి మాధవపూర్ మీదుగా వెళ్లొచ్చు కాని కొంచెం నిదానం అయినా అహమ్మదాబాదు మీదుగా ప్రయాణం చెయ్యడం ఎక్కువ అనుకూలం. అహమ్మదాబాదువేపు గాడీ తెల్లవారు ఝామున వస్తుంది. పిల్లాడితోబాటు హోటల్లో భోజనం చేసి ప్లాట్‌ఫారం మీద కూర్చుని ఆయనడిగారు,

"ఇక్కడ్నుంచి వచ్చేస్తున్నందుకు నీకు దుఃఖంగా వుందా బేటా? "

వాడికేం మాట్లాడాలో తెలీటం లేదు. ముఖంలో విస్మయం, కలవరం, ఎదురు చూడని గాభరా కనిపిస్తున్నాయి. "భయపడద్దు బాబూ. అక్కడ నీ నిజమైన నాన్న ఉన్నారు. చాలా ప్రేమగా చూసుకుంటారు" అని జవాబు చెప్పి, వాడికి కంబళి పరచి, "నిద్రపో రైలొచ్చాక లేపుతాను" అని తనూ వాడి పక్కన ఒళ్లు వాల్చారు.



రేళేని పంపించాక నరహరి మనసు ఇంకా పాడైంది.

తల్లిదండ్రులు లేని ఈ అనాథ పిల్లలకి ఇప్పుడు తండ్రినయ్యాను గదా! మరి నాది అనే స్వంత బంధాలకి మళ్లీ ఎందుకు చిక్కు




కోవడం? ఈ జవాబుకి మరో ప్రశ్న ఎదురైంది. స్వంత బంధాలున్నా ఈ పిల్లల్ని ఇలాగే ప్రేమించడానికి వీలవదా? కాని ఆ భావన ఎందుకో కష్టంగా ఉంది. అది తన మనశ్శాంతిని తినేస్తోంది. తనది అనే దాన్నొకసారి పోగొట్టుకున్నాక మళ్లీ దానికి అంటుకోడం ఎందుకు? బెల్లం పాకంలో చిక్కి చనిపోయే ఈగలాగ.

రేళే లేనప్పుడు పిల్లలందరి బాధ్యత నరహరిదే అయింది. పైభాగాన పెద్ద పిల్లలు గొడవ చేస్తున్నారు. ఒకరిద్దరు తగువులాడుకుంటున్నారు. వాళ్లందర్నీ హద్దులో పెట్టాలి. వంటింటి పర్యవేక్షణ మరింత శ్రద్ధగా చూసుకోవాలి. ఆశ్రమం వెనుకనున్న అడవిలోకి ఒకసారి వెళ్లిరావాలని చాలా గాఢంగా అనిపించినా పని ఒత్తిడిలో తీరికలేక వెళ్లలేదు. తనకి నిజంగా శాంతి ఎలా లభిస్తుంది అనే ఆలోచన వస్తే తీరిక లేకుండా పనిలో నిమగ్నం అవడమే దానికి ఒకరకమైన మార్గం అని జవాబు దొరుకుతుంది. కాని ఆ అడవిలోకేనా, కొండమీదకయినా వెళ్లి కూర్చోవాలనే కోరిక అణచుకోలేనట్టుగా తలయెత్తుతుంది. వెళ్లి కూర్చున్నా ఒకరకమైన అశాంతి కలుగుతుంది. అలాగైనపుడు నా మనసెంత విచిత్రంగా తయారైంది అనే విమర్శ వస్తుందతనికి.

ఒకరోజు ఉదయం ఆరుగంటలకి రేళే తిరిగి వచ్చారు. వెంట పది పన్నెండేళ్ల కుర్రాడున్నాడు. భయం, అయోమయం కమ్మిన ముఖం, మురికిగా ఉన్న లాగు, చొక్కా తొడుక్కుని వున్నాడు. నరహరి అక్కడే కాంపౌండ్‌లో పడివున్న చెత్త, పుల్ల, పుడక ఏరుతున్నాడు. ఎదురుగా వచ్చి రేళే అన్నాడు, "చూడండి వీడు మీ ఆఖరి కొడుకు. మిగతా వివరాలు తరువాత చెబుతాను" అని.

కుర్రాడు ఆయన ముఖంలోకి భయంతో కళ్లు రెపరెపలాడిస్తూ చూశాడు. రేళే, "నేను చెప్పాను చూడు, ఈయనే మీ నాన్న" అని చూపించారు. కుర్రాడి మనసులో ఏం జరుగుతోందో నరహరికి తెలియలేదు. అతడు దేన్నీ గమనించలేదు. అతని అంతరంగం గందరగోళంలో చిక్కుకుంది. ఆఖరి కొడుకంటే రాముడు కావచ్చు, లక్ష్మణుడు కావచ్చు. ఎదగడంవల్ల గుర్తు తెలియడం లేదు. వీడొక్కడినే ఈయనెందుకు తీసికొచ్చినట్టు? చెయ్యిజాపి వాడి వెన్ను నిమరాలనిపించింది. కాని అదేదో దృఢ నిశ్చయంలా అలా రాయిలా నుంచుండిపోయాడు.

"ఎందుకు రావుగారూ, కదలకుండా అలా నుంచుండి పోయారు? "

"వీడినెందుకు తీసుకొచ్చారు? నేనేమన్నా తీసుకురమ్మని చెప్పానా? "

తనెందుకు బయల్దేరాడు? ఏం చేసుకొచ్చాడు? అనే విమర్శ మొదటిసారిగా తోచింది రేళే మనసుకి. పిల్లలు ఎలా ఉన్నారో చూసి వస్తాను అని బయల్దేరాడు తను. అన్నీ తెలుసుకున్నాడు. కాని ఈ కుర్రాడి పరిస్థితి వేరుగా వుంది. తనే ఈ కుర్రాడి తండ్రి అయ్యుంటే ఏం చేసుకు వచ్చేవాడో అదే చేసుకుని వచ్చాడు. కాని ఈయన ఇలా అడుగుతారేమిటి? పరిస్థితికి భయపడి మెదలకుండా ఉండిపోవడం రేళే స్వభావం కాదు. "ఆ సంగతులన్నీ తరువాత చెబుతాను. తీసుకు రాకుండా ఉండటానికి మరో మార్గం లేదు" అని జవాబిచ్చి కుర్రాడితో,

"బాబూ, పితాజీకి నమస్కారం చెయ్యి" అన్నారు. కుర్రాడు వంగి చరణ స్పర్శ చేశాడు. పితాజీకి ఏమీ అర్థంకాక ఊరికే నుంచున్నాడు. రేళే కుర్రవాడిని తీసుకుని పైకి వెళ్లాడు. కంబళిలో చుట్టిన వాడి బట్టల్ని తీసి, "స్నానం చేద్దువుగానిరా" అని కింద నీళ్ల గదికి తీసికెళ్లాడు.

రేళే ఇప్పుడు చేసిన పని తన జీవిత విధా

నాన్నే మార్చివేయొచ్చు దాని పరిణామంగా మొత్తం తన జీవితాదర్శమే బలి ఇవ్వాల్సి రావచ్చు తనని అడగకుండా ఈయనెందు కిలా తమకప్పచెప్పిన బాధ్యత పరిమితిని అతిక్రమించారు? అని చిరాకేసింది. నరహరికి కోపం రావడమే చాలా అరుదైన విషయం నిస్సంగానందుడైన తరువాత అసలు కోపం అన్నది రానేలేదు. అలాంటిది ఇప్పుడు మళ్లీ కోపం వస్తోంది. ఇప్పుడే ఆయన దగ్గరకి వెళ్లి నిలదీసి అడిగెయ్యనా అన్నంత కోపం తన్నుకొచ్చిందికానీ ఆ పని చెయ్యకుండా ఊరికే అలా నుంచున్నాడు. కొద్దిసేపటికి స్నానం చేసిన రేళేగారు కుర్రాడిని తీసుకుని పైకివెళ్లారు. ఈలోగా చిన్న పిల్లలంతా లేచి మొహాలు కడుక్కుని స్నానాలకి వెళ్తున్నారు. వాళ్లకి నరహరే శుభ్రంగా ఒళ్లుతోమి స్నానం చేయించేవారు. లేకపోతే వాళ్లు ఒంటిమీద నీళ్లు దిమ్మరించుకుని బయటకి వచ్చేస్తారు. చెమట వాసన, మురికిపోదు.

రేళే వెళ్లిపోయాక నరహరి పిల్లల వెనకాల బాత్‌రూమ్స్‌లోకి వెళ్లాడు.

తొమ్మిది గంటలకి మిగతా కుర్రాళ్లతోబాటు రాముడిని కూడా భోజనానికి తీసికెళ్లారు రేళేగారు. నరహరి భోజనాల తంటాకే పోలేదు. పది గంటల వేళకి పెద్ద పిల్లలు, చిన్న పిల్లలు అంతా స్కూలుకి బయల్దేరారు. ఆయన రోజూలాగే చిన్నపిల్లల్ని స్కూలుకి దింపివచ్చారు. రేళేగారు భోజనం చెయ్యకుండా కాచుకుని ఉన్నారు. రాముడు మేడమీద ఉన్నాడు.

"భోజనం చేద్దాం రండి" అని రేళే పిలిచాడు. నరహరి వెళ్లాడు వంటవాడు వడ్డించాడు. నరహరికి అన్నం సహించలేదు. చేతులు కడుక్కున్నాక రేళే అన్నాడు, "రండి, అన్నీ చెబుతాను"

"నేనేం వినక్కర్లేదు" అన్నాడు నరహరి.

"మీరు నన్ను దోషిగా చెయ్యకండి, విషయం వినండి చాలు"

"నా జీవితం, దాని ధ్యేయం అన్నీ మీతో చెప్పుకున్నాను. ఇప్పుడు ఈ కుర్రాడిని ఏం చెయ్యాలి? "

"అది కష్టం కాదు. నాతోరండి, చెప్తాను" అని అతని చెయ్యి పట్టుకుని వెనుక వేపున్న జంగిల్‌లో ఒక చెట్టుకిందకి తీసికెళ్లి కూర్చోబెట్టి అన్నీ వివరంగా చెప్పారు రేళేగారు.

బరోడా పటేల్ దంపతులు చేసిన తుచ్ఛమైన పని విన్నాక నరహరి కడుపు భగ్గుమంది.

"ఈ కుర్రాడినీ అక్కడే వదిలేస్తే భవిష్యత్తులో బరోడా కుర్రాడికయిన గతే అయ్యేది. అందుకే తీసుకొచ్చేసాను. తప్పా? " అన్నాడు రేళే.

"తప్పుకాదు, కానీ ఇప్పుడేం చెయ్యాలో నాకు తెలియడం లేదు"

"ఏమయిందిప్పుడు? కుర్రాణ్ణి పెంచండి"

"ఈ పిల్లలంతా నా పిల్లలే అన్న భావంతో శాంతి పొందుతున్నాను. ఇప్పుడు స్వంత అనే బంధాన్ని మళ్లీ పెంచుకోలేను"

"ఈ పిల్లల బాధ్యత వదలమని ఎవరన్నారు? వార్డెన్‌కి జీతం ఇస్తామని శేర్‌జీనే అన్నాడు కదా! మీరేవద్దన్నారు. వార్డెన్ సంసారం కోసం రెండు గదులిచ్చే ఏర్పాటు కూడా ఉందికదా! ఇలా జరిగిందని శేర్‌జీకి చెప్పండి. జీతం ఇస్తారు. పిల్లాడిని ఉంచుకోండి, మిగతా పిల్లల్ని చూసుకోండి"

రేళేకి పరిష్కారం సులభంగా అనిపించింది. కాని నరహరికి చాలా కష్టంగా తోచింది. అది తనవల్ల కాదని అతనికనిపించింది. అతను తల అడ్డంగా ఊపాడు.

"అయితే ఈ కుర్రాడినేం చేద్దాం అంటారు? మళ్లీ జయపూర్ పంపిద్దామా? పంపిస్తే వాళ్ళు ఇంట్లోకి రానివ్వరు. లేదా




బొంబాయిలో ఏదన్నా సెంటర్‌కి తీసికెళ్ళి నడిరోడ్డుమీద ఒదిలేద్దామా? "

ఈ మాటలవల్ల నరహరి దుఃఖాన్ని మీటినట్లయింది. అతనన్నాడు: "ఈ ఏభై మందీ నా పిల్లలు. వారికి లేని కొత్త భాగ్యం నా కొడుక్కీ అవసరం లేదు"

"అంటే? "

"స్వంత తండ్రి అనే వ్యక్తిగతమైన ప్రీతి వాడొక్కడికే ఎందుకు? "

ఈ మాట రేళేకి సరిగ్గా అర్థం కాలేదు. ఆయన పదినిమిషాలు ఆలోచించి అన్నారు. "ఒకపని చేయండి. ఈ కుర్రాడినీ ఆశ్రమంలో చేర్చేద్దాం. అందరితోబాటు వాడినీ చూసుకుందాం. మీరు జీతమూ తీసుకోవద్దు. వేరే వుండనూ వద్దు"

"ఎలా చేర్చడం? "

"అదేమీ కష్టం కాదు. ఈ కుర్రాడు నాకు దొరికాడు. తల్లిదండ్రులెవరూ లేరని నేను శేఠ్‌జీకి చెబుతాను చేర్చుకోమని. ఆయన ఒప్పుకుంటారు"

ఇప్పటికి సమస్యలో ఒక భాగం పరిష్కారం అయింది. నరహరి మూగవాడిలా ఊరుకున్నాడు. "రామ్‌చంద్ పైన ఒక్కడే పడుకున్నాడు. నిద్రవచ్చిందో లేదో తెలీదు. కుర్రాళ్ళంతా స్కూలుకెళ్ళారు" అని రేళే లేచాడు.

నరహరి అక్కడే కూర్చున్నాడు. ఆయన వెళ్ళాక ఒకగంటదాకా కూర్చున్నా మనసుకేమీ స్పష్టంగా కనపడలేదు. అతను లేచి ఆశ్రమానికి వచ్చేటప్పటికి రేళే తనవి, రాముడివి బట్టలుతుకుతున్నారు. నరహరి ఆయన దగ్గర నుంచుని, "చూడండి నేను వాడి తండ్రినని పొరబాటున కూడా చెప్ప కూడదు. ఎలాగూ పన్నెండేళ్ళయింది. సరే మీ పర్యవేక్షణ ఉండనే వుంటుంది. నాకు మటుకు వాడు ఏభైమందితోబాటు, ఏభై యొకటో కుర్రాడు. నేను ఆశ్రమానికి వార్డెన్ని అంతే"

రేళేకి ఇదేమి విచిత్ర మనస్తత్వం! అని ఆశ్చర్యంగా అనిపించింది. ప్రస్తుతానికి తనేమీ చెయ్యడానికి వీల్లేదు. కొన్నాళ్ళు గడిస్తే ఆయనే మనసు మార్చుకుంటారు. అని ఆశించి ఊరుకున్నాడు.

★ ★ ★

రాముడు జయపూర్‌లో ఒకటిన్నర సంవత్సరం స్కూలుకి వెళ్ళాడు. తరువాత ఇంట్లో పనిపాటలకి పెట్టుకున్నాక స్కూలు మానేశాడు. ఇప్పుడొక్క అక్షరంముక్క కూడా గుర్తులేదు. రేళే వాడిని స్కూలుకి తీసికెళ్ళారు. హెడ్‌మాస్టర్ కుర్రాడిని పరీక్షించి, "పన్నెండేళ్ల వయసుంది. ఇప్పుడు ఐదేళ్ళ కుర్రాళ్ళతో కలిసి ఒకటో క్లాసులో కూర్చుంటే తను మొద్దునేమో అనే భావం వాడికి కలుగుతుంది. మిగతా కుర్రాళ్ళకీ జత సరిపోదు. మీరే బాధ్యత తీసుకుని ఆశ్రమంలోనే పాఠాలు చెప్పండి. తగినమటుకు చదువు వంటబడితే, వచ్చేఏడు స్కూలు తెరవగానే నాలుగో క్లాసులో వేద్దాం" అన్నాడు.

ఈ సూచన సౌమ్యంగానే వుందనుకుని రేళే నరహరిని అడిగితే- "మీకెలా మంచిదనితోస్తే అలా చేయండి. ఈ ఒక్క విషయంలో నన్నేమీ అడక్కండి" అన్నాడు.

"ఆశ్రమం వార్డెన్‌గా ఏమంటారో చెప్పండి పోనీ"

"అలాగే చెయ్యండి. మరాఠీ నాకంటే మీకే బాగా వచ్చు, నేర్పండి"

రేళే, తనేవాడికి గురువు కూడా అయ్యారు. కుర్రాడు అప్పుడప్పుడు, 'రేళేకాకా, నన్ను పితాజీ దగ్గరకి తీసికెళ్తానన్నారు కదా? ఎక్కడున్నారాయన? " అనడిగేవాడు.

"మన హాస్టల్ కాకానే పితాజీ. ఇక్క



డున్న పిల్లలందరికీ ఆయన పితాజీ"

"ఇది ఆశ్రమమట. తల్లిదండ్రులు లేని పిల్లల్ని పెంచుకుంటారట. ఆయన వార్డెన్ కాకాట. మిగతా పిల్లలు, వివరాలు అన్నీ చెబుతున్నారు. మరి నా పితాజీ ఎక్కడ?"

"ఇక్కడున్న ఎవరికీ పితాజీ లేరయ్యా. నేనూ, వార్డెన్‌కాకా ఇద్దరం మీకందరికీ పితాజీలం"

ఈ మాటకి వాడు ఊరుకున్నాడు కాని, కళ్ళల్లో నీళ్ళు నింపుకుని "మరి మీరు అబద్ధాలు ఎందుకు చెప్పారు?" అని అడిగాడు.

"అబద్ధాలు కాదు బాబూ, ముందు ఆ ఏడుపు మానెయ్. అలా ఏడవకూడదు. నువ్వు స్కూల్లో బాగా చదువుకొని, పెద్దవాడివై పెద్ద ఉద్యోగం చెయ్యాలికదా. అందుకని అలా చెప్పాను" అని ఓదార్చారు.

రాముడిని చూస్తే నరహరి దూరంగా ఉండిపోతాడు. తాను ఏదో అపాయంలో చిక్కుకుంటానేమోనన్న భయం. అదీకాక ఇన్నాళ్లూ తన జీవనాధారమైన ఆదర్శం తాలూకు పట్టుదల ఒకటి. వీటివల్ల రూపు దిద్దుకున్న వ్యక్తిగా ప్రత్యేక జాగ్రత్తతో దూరంగా ఉంటూ ఇరవైనాలుగు గంటలూ తన నివాసంలోనే వుండిపోసాగాడు. రాముడి ఉనికి అంతరంగమధనానికి, వ్యధకీ కారణమయింది. మొదటిలాగ సదా ఆశ్రమంలో పిల్లల సేవలో నిమగ్నమైవుండటానికి కుదరటంలేదు. మరో ధ్యాసలేకుండా పిల్లల సేవలో జీవితాన్ని సార్థకం చేసుకోవాలని ఇక్కడికొచ్చాడు. అందులో కొంతవరకు సఫలమయ్యాడు. అప్పుడప్పుడు వేరే ఆలోచనలతో మనసు కలవరపడినా, క్రమేణా అదీ సర్దుకుంటుందన్న ధీమాతో మరింత ఎక్కువగా పనిలో లీనమయ్యేవాడు. కాని రాముడొచ్చాక ఎందులోనూ ఉత్సాహం లేదు. పిల్లల్ని దత్తతకిచ్చేముందు తన మనసులో తలెత్తిన భావం లాంటిది ఇప్పుడు మళ్ళీ తల ఎత్తసాగింది. 'అదేమిటి?' అని తననితానే విశ్లేషించుకోసాగాడు. చివరికి అర్థమయింది. తనకి మనుషుల సంపర్కంతో బ్రతికే ఈ జీవితం విసుగుపుట్టింది. ఎవరితోనూ మాటలూ ఇష్టం లేదు. ఒంటిగా వుండాలి.

ఉన్నట్టుండి హిమాలయాలు గుర్తుకొచ్చాయి. దట్టమైన అడవి. హోరుమంటూ దుమికే నదులు, కంటిచూపుతో కలయచూడలేనంత విస్తారంగా పరచుకున్న పర్వతాలు- వీటితో ఒక్కడే వుండాలి. ఒక గుడిసె, ఒక కౌపీనం. అంతే చాలు. మళ్ళీ ధ్యానం చెయ్యగలిగే శక్తి తనకుందో లేదో. సఫలమవుతాడో లేదోననిపించింది. కాని అతనికున్న ముఖ్య ఆకర్షణ ధ్యానం కాదు. అడవి, నది, కొండలు... ఇంకా లోతుగా పోతే ఏకాంతవాసం. ఒంటితనం కావాలనే కోరికకి తుదిలేదు. మధ్యలో కొన్నాళ్ళు విసుగనిపిస్తుంది. జనం, వాళ్ళ సాహచర్యం, చురుకైన క్రియాత్మకమైన జీవితం కావాలనిపిస్తుంది. కాని ఇవేవీ స్థిరమైన కోరికలు కావు.

బారామాసి మహారాజ్ గుర్తొచ్చి, ఆయనలా విరాగిగా వుండాలన్న కోరిక మళ్ళీ చిగురిస్తోంది.

అది అసాధ్యమని, బహుశః ఈ జన్మలో తనకి సాధ్యపడనిదనీ వాస్తవిక జ్ఞానం తట్టి చెబుతున్నా ఆశ మాత్రం చావదు.

ఒక్కోరోజు అతనొక్కడే ఆశ్రమం వెనుకనున్న అడవిలోకి నడచుకు వెళ్ళి కన్హేరి కొండని చేరుకుని, ఏకబిగిన ఆ కొండనెక్కుతుంటాడు. చివరికెక్కి తిరిగిచూస్తే బొంబాయి కనిపిస్తుంది. కాని దాన్ని చూడ్డం విసుగు. సముద్రం వంక తిరిగి నుంచుంటాడు. అప్పుడు ఏకాంతం, ఒంటితనపు భావం కలుగుతాయి. కాని ఒక్కోసారి సముద్రంమీద ఓడలు కనిపించి ఒంటితనపు భావాన్ని భగ్నం చేస్తాయి. ఏకాంతం




కావాలంటే ఇక్కడెక్కడా సాధ్యం కాదు. పై...కి వెళ్ళాలి. సుమేరు పర్వతం చేరాలి. బారామాసి మహారాజ్ లాంటివారిని పట్టు కోవాలి. పిల్లలసేవ చేయడంలో తృప్తి దొరు కుతుంది నిజమే. కాని అది ఒంటరితనాన్ని భరించలేనివాళ్ళు తొక్కవలసిన మార్గం. అదొకరకమైన బంధపూరితమైన మార్గం. తను మళ్ళీ వీటన్నింటినీ త్యజించి వెళ్ళిపో వాలి. బయల్దేరటమే బాకీ.

ఈ కోరిక తనకి మళ్ళీ ఎందుకు పుట్టింది? ఎక్కడ్నుంచి వచ్చింది? అనే ఆలోచన ఒకసారి వచ్చింది. అంతరంగాన్ని తరచి చూస్తే అర్థమయింది. రాముడు వచ్చిననాడు ఈ కోరిక రూపుదాల్చింది. ఆరోజునుంచి రోజురోజుకి పెరిగి బలపడు తోంది. వాడు రాకపోతే ఈ ఉద్దేశం పుట్టే దేకాదేమో. వాడికీ, దీనికీ ఏమిటీ సంబంధం? అంతా చిత్రంగా అనిపిం చింది. కొండదిగి, అడవిలో నడిచి సాయం త్రానికి ఆశ్రమానికి వచ్చాడు.

మర్నాడు ఏదో మాటల సందర్భంలో రేళే, "నేను జయపూర్‌నుంచి వచ్చి రెండు నెలలయింది. ఇక్కడకి వచ్చిన రెండు మూడు రోజుల్లోనే పూనా వెళ్ళి మీ కూతుర్ని చూసి రావాలనుకున్నాను. అందరి సంగతులూ తెలిశాయి. ఆ ఆడపిల్ల సంగతొక్కటే తెలియలేదు" అన్నారు.

ఈ మాటవిని నరహరికి తిక్క రేగింది "వెళ్ళకండి" అన్నాడు.

"ఆడపిల్లలకి మమకారం ఎక్కువ. ఏం బాధపడుతోందో ఏమో. ఒకసారి సంగతి తెలుసుకొస్తే ఏమిటి ఇబ్బంది?"

"ఒద్దు, ఈ పాటికి పెళ్ళయిపోయివుం టుంది. పిల్లనిచ్చేశాక ఎలాగూ పరాయిదే. పెళ్ళయ్యాకనయినా పరాయి ఇల్లు మెట్టా ల్సిందేకదా. ఇంక మీరేమీ పోవద్దు, ఊరు కోండి" అన్నాడు.

రేళే ఊరుకున్నాడు. కాని ఈ మాటవల్ల నరహరి మనసు అల్లకల్లోలమయిపో యింది. భవానిని చూడాలనే కోరిక కలి గింది. ఒకవేపు మళ్ళీ హిమాలయాలకి వెళ్ళి పోవాలనే కోరిక బలపడుతోంటే, మరోపక్క పిల్లల జ్ఞాపకాలూ అంతగానే మనసునాక్ర మించుకుంటున్నాయి. భవాని వాళ్ళమ్మ లలితలాగే ఉండేది. ఇప్పుడు పంతొమ్మిది ఏళ్లుంటాయి. నేను మొదటిసారి చూసిన ప్పుడు వాళ్ళమ్మ వయసు ఇంతే. తన దారిన తను ఉన్నా నా మనసునెలా ఆకర్షిం చింది? తన తల్లి రూపమే ఆమెదీను. అదే పొడవు, అదే ముఖభావం, భవాని ఇప్పుడ లాగే అయ్యుండచ్చు. ఆమె తమ్ముడు విజ యుడు సుఖంగానే వున్నాడని రేళే చెప్పారు కదా, అయినా ముఖంలో ఆ గాంభీర్యం అలాగే వుందట. అది కొత్తగా పుట్టినది కాదు. ముందునుంచీ ఉన్నదే. గణేశుడిక యితే ఇక్కడి జ్ఞాపకాలే లేవు. తన దత్తు తల్లిదండ్రుల్తో, వ్యాపారంలో కలిసిపో యాడు. వాడి గురించి బెంగ లేదు. లక్ష్మ ణుడి గతి ఎందుకలా అయిందో, అలా జర గకుండా వుండాల్సింది. ఆమె వాడినెంత ప్రీతిగా ఎత్తుకుని ముద్దాడిందా రోజు. తన కడుపున బిడ్డ పుట్టినంత మాత్రాన-వీడిమీద అభిమానం చచ్చిపోవాలా? రాముడొచ్చా డని ఆశ్రమంలో మిగతా పిల్లల్ని దూరం చేసుకున్నానా? జయపూర్ వాళ్ళ మోహం, మరోవిధంగా రాముడిని బాధపెట్టింది. అభిమానానికి తన రక్తం, పరరక్తం అన్న తేడాలేమిటి? భావనకి రక్తసంబంధంతో ఎందుకు ముడిపెట్టాలి? బసుబాబు, ఆయన భార్య నిజమైన మనుషులంటే వాళ్ళు వాళ్ళలా మిగిలిన వాళ్ళూ ఎందు కుండకూడదు? లక్ష్మణుడు చచ్చిపోయాడో, బ్రతికున్నాడో? బ్రతికిఉన్నా వెతికి తెచ్చేశక్తి తనకి లేదు. అలాంటి పిల్లలని ఆఫ్రికానుండి



వెతికి తెచ్చేశక్తి ఎవరికీ వుండదని రేళే చెప్పారు. లక్ష్మణుడి తలపుతో అతడికళ్లు కన్నీళ్ళతో నిండాయి. కన్నీరు బంధానికి ప్రతీక అన్న జ్ఞానోదయమై తనకెందుకింత మోహం అని తననితానే ఓదార్చుకున్నాడు.

తను మళ్ళీ బయల్దేరిపోవాలి. ఈసారి ఎక్కడా ఆగకుండా తిన్నగా సుమేరు పర్వత పాదప్రాంతానికి వెళ్ళటం... తరువాత రోజురోజుకి వీలైనంత ఎత్తుకి ఎక్కడం... ఒకసారి ఎక్కితే ఇంక దిగేమాట లేదు. అక్కడ తను 'బారామాసి' అయిపోవాలి. అంతేకాదు. సదావాసి అయిపోవాలి అని నిశ్చయించుకున్నాడు. ఎవరికీ చెప్పకూడదు. రేళేకి కూడా ఏమీ తెలుపకూడదు. ఈ విషయం ఎవరితోనూ చర్చించకూడదు. వెళ్ళిన తరువాత, "మీరు వేరే వార్డెన్‌ని చూసుకోండి" అని ఒక కార్డు రాసి పడేస్తే సరి.

★ ★ ★

ఒకరోజు అతను బయల్దేరాడు కూడా. శెనాయ్ పత్రికకి రాసిన వ్యాసానికిచ్చిన పారితోషిక ధనాన్ని, ఆయన బలవంతం చేసినా తీసుకోలేదప్పుడు. ఇప్పుడు వాళ్లింటికి వెళ్ళి ఏదో అవసరం అని చెప్పి వంద రూపాయలు ఇప్పించుకువచ్చాడు. ఇతను డబ్బు అడిగి తెచ్చుకున్నందుకు శెనాయ్‌కి కూడా ఆశ్చర్యం వేసింది. "స్వంత ఖర్చే మన్నా తగిలిందా ఏమిటి?" అని నవ్వుతూ అడిగాడు. తను మళ్ళీ హిమాలయాలకి బయల్దేరుతున్నట్టు ఆయనకి చెబుదామా అని కోరిక పుట్టింది. ఆయనిప్పించిన ఈ ఉద్యోగం వదిలి వెళ్ళేటప్పుడు ఆయనకి చెప్పి వెళ్ళడం కర్తవ్యం అనిపించింది. కాని ఆయన వెళ్ళద్దనచ్చు అదీకాక ఎవరికీ చెప్పకుండా, ఈ విషయం గురించి చర్చలకి అవకాశం ఇవ్వకుండా, తన పాటికి తను వెళ్ళిపోవాలి. అని నిర్ణయించుకుని శెనాయ్ ఇంటినుంచి మౌనంగా బయటకొచ్చేశాడు.

మర్నాడు రాత్రి రైలు అందుకోడానికి బోరల్లికి వచ్చి బోంబే సెంట్రల్‌కి వెళ్ళే లోకల్‌ట్రెయిన్ ఎక్కి కూర్చున్నాడు. కాని రైలు కదుల్తుంటే వెళ్ళాలన్న నిర్ణయం సడలిపోతున్నట్టు తోచింది. ఆశ్రమం వెనుకనున్న అడవి, రేళే మొదలైన వాళ్ళంతా ప్రీతిపాత్రులై మస్తిష్కంలోకి వచ్చారు. బయల్దేరే ముందు తను పూర్తి చెయ్యవలసిన పనులనేకం వున్నాయి. పిల్లలందరినీ స్కూలు చదువులో అభివృద్ధి ఎలా వుందో పరీక్షించి, తన రిపోర్ట్ రాసి ఆశ్రమ పాలకవర్గానికి సమర్పించవలసివుంది. మేడమీద ఎనిమిది మంది కుర్రాళ్ళకి ఫ్లూ వచ్చినట్టుందని తను బయల్దేరడానికి గంటముందు రేళే చెప్తుండగా విన్నాడు. స్కూలునుంచి వచ్చినవాళ్ళంతా ఒళ్లునొప్పులు, తలనొప్పి అన్నారట. అంతా ఒకసారిగా ఖాయిలా పడితే రేళేకి చూసుకోవడం చాలా కష్టమవుతుంది. ఈరోజు వాపస్ వెళ్ళి, ఒకవారం రోజుల్లో పరిస్థితులన్నీ చక్కదిద్ది మరో వార్డెన్‌ని ఏర్పాటు చేసుకోండని చెప్పే బయల్దేరాలి. నా ఆత్రంవల్ల అక్కడి పనికి లోపం జరక్కూడదు. అని నిశ్చయించుకుని తరువాతి స్టాప్‌లో రైలుదిగి, వాపస్ వెళ్ళే రైలు ఎక్కి మళ్ళీ బోరిల్లికి వచ్చాడు. స్టేషన్‌నుంచి ఆశ్రమానికి వెళ్ళేటప్పుడు తన ప్రవర్తన తనకే విచిత్రంగా తోచింది. అన్నీ వదిలిపోదల్చుకున్నవాడికి ఈ కర్తవ్యబంధం ఎందుకు? ఒంటిగాడికి కర్తవ్యం వుండదు. అలాంటివి ఏమన్నావుంటే జోడుజీవితం జీవించేవాడికే. నేను వెనక్కిరాకుండా వుండాల్సింది. ఇప్పుడయినా వెళ్ళిపోనా అనుకున్నాడుగాని, ఇవాళ్టికింక రైలు దొరకదు. ఇక రేపే ప్రయాణం అనుకుని త్వరత్వరగా అడుగులు వేశాడు.

రేళే కాంపౌండ్ దగ్గరే ఎదురై, "మీ కోసమే చూస్తున్నాను. పైన పదిమంది

 

కుర్రాళ్ళు జ్వరంతో పడుకున్నారు. ఫ్లూనే కావచ్చు. డాక్టర్‌నే ఇక్కడకి తీసుకురావాలి" అన్నాడు.

క్లినిక్‌కి వెళ్ళి నరహరి డాక్టర్ని తీసుకొచ్చాడు. ఆయన మేడమీదకెక్కినా ఇతను వెళ్ళలేదు. పైనుంచి వచ్చి డాక్టర్, "పిల్లలందరికి ఫ్లూ. అందరూ అలా జ్వరంతో ఉంటే సిక్‌రూంకి ఎంతమందినని మారుస్తాం? జ్వరం పిల్లల్ని పైనే వుండమని, మిగతా పిల్లల్ని కిందకి పంపించండి. నాతో రండి, పెద్ద సీసాలో మందు వేసిస్తాను. అందరికీ ఒక్కో ఔన్స్ చొప్పున తాగించండి" అన్నాడు.

అతను వారితో వెళ్ళి మందు తెచ్చాడు. బాగున్న పిల్లలంతా తమ పక్కబట్టలు తెచ్చుకుని కిందకొచ్చారు. వాళ్ళలో రాముడు లేడు. అంటే వాడికీ జ్వరం వచ్చిందనేగా. నరహరి రేళేతో, పైన రోగుల బాధ్యత మీరు చూసుకోండి. నేను ఇక్కడ వీళ్ళకి వ్యవస్థ ఏర్పాట్లు చూస్తాను" అన్నాడు.

రేళేకి ఆశ్చర్యం వేసింది. ఎప్పుడూ రోగుల సేవంటే ముందుండే నరహరి ఇప్పుడు ప్రవర్తిస్తున్న పద్ధతి రేళేకి వెంటనే అర్థం కాలేదు. కాని పైకివెళ్ళి రాముడిని చూడగానే బుర్రకి తోచింది. జ్వరంతో పడుకుంటే కొడుకు అన్న కారణంవల్ల వాడిని చూడరన్నమాట. ఎందుకు చూడకూడదు? వాడున్నాడన్న కారణంవల్ల మిగతాపిల్లలు జబ్బుపడ్డా చూడరన్నమాట. సరే, ఆయన కిమ్మనకుండా రోగుల ఉపచర్యలు చూసుకుంటున్నారు. పిల్లలు భోజనం చేసి వచ్చాక, వాళ్ళకి పడుకోడానికి ఏర్పాటుచేసి, వాళ్ళంతా పడుకున్నాక నరహరి తన చాప తను వేసుకుని పడుకున్నాడు. ఈరోజు తనెందుకు వెనక్కి తిరిగివచ్చానా అన్న ప్రశ్న మనసుని నమిలేస్తోంది. కుర్రాళ్లకి ఫ్లూ అన్న కారణం నిజమైతే శుశ్రూషకి తను చొరబడకుండా, రేళేని పంపించి తను ఇక్కడ పడుకోడంలో అర్థమేమిటి? వేరే వార్డెన్ నియామకం అయ్యేవరకు వెళ్ళనను కోడం కుదిరేది కాదు. చాలాసేపు ఆలోచించాక 'రాముడిక్కడుండబట్టే తను వాపస్ వచ్చాడు. కాని అది నిజమే అయితే వాడున్న కారణం వల్లనే పైకెక్కి ఒక్కసారి కూడా ఎందుకు చూడలేదు. అనిపించింది.

ఇదోరకమైన విచిత్రశక్తిగా అనిపించింది. రాముడు రావడానికి ముందు తనకి హిమాలయాలకు వెళ్ళాలనే ఆలోచన రాలేదు. అది తనకి సాధ్యంకాని, తన స్వభావానికి అందని ఎత్తు అని ఎన్నిసార్లు అనుకోలేదు. ఒకవేపు వాడుంటే పారిపోవాలని అనిపిస్తోంది. కాని ఇలా పారిపోవడం అనేది వాడివల్లే అసాధ్యమయింది. మరోవైపు వాడు లేకపోతే వెళ్ళాలనే ప్రేరణే లేదు. ఇదెలాంటి వైచిత్రం! ఈ ఆకర్షణని వదిలించుకోవాలి. తప్పకుండా వెళ్ళాలి. గడ్డకట్టిపోయిన హిమాలయాలే తగిన స్థలం. దౌర్బల్యబిందువు తెలిసిపోయింది. విషయజ్ఞానం తెలిశాక గెలుపు కష్టం కాదు.

రెండురోజుల్లో కుర్రాళ్లకి జ్వరం తగ్గింది. కిందకి వచ్చిన కుర్రాళ్ళంతా మళ్ళీ పైకి తమ తమ గదుల్లోకి వెళ్ళిపోయారు. నాలుగోరోజు రాత్రి ఎనిమిది గంటలకి రేళే వచ్చి "చూడండి, అందరికీ జ్వరాలు తగ్గి బాగయ్యారు. కాని రామ్‌చంద్‌కింకా జ్వరం వదల్లేదు. కళ్ళు తేలేస్తున్నాడు. వెంటనే డాక్టర్ని పిలవాలి" అన్నాడు.

నరహరి వెళ్ళి డాక్టర్ని తీసుకొచ్చాడు. ఆయన పైకి వెళ్ళి పరీక్షించి "ఇది ఉట్టి ఫ్లూకాదు, టైఫాయిడ్. కింద సిక్‌రూమ్‌కి తీసికెళ్ళి పడుకోబెట్టండి. అంతలో డిస్పెన్సరీకి వెళ్ళి మందులు తెస్తాను" అని చెప్పి వెళ్ళిపోయారు.

"టైఫాయిడంటే చాలా కష్టం. పగలు, రాత్రి బాధ్యతగా చూసుకోవాలి. సరే,

ప్రస్తుతం కుర్రాడినొకరు ఎత్తుకుంటే రెండో వాళ్ళు పక్కచుట్టి కింద సిక్ రూమ్‌లో వేయ వచ్చు"

నరహరి కదలకుండా నుంచునే ఉన్నాడు. ఐదు నిమిషాల్లో రేళే రాముడినెత్తుకుని కిందకి వచ్చాడు. వెనకాలే కుర్రాడొకడు పరుపు తెచ్చి సిక్ రూమ్‌లో వేసి పక్క పరచాడు. రాముడి మొహం ఎర్రగా జ్వర తీవ్రతతో ధుమధుమలాడుతోంది. కంటి చూపే ధ్యేయరహితంగా ఎటో పోతోంది. వాడిని పక్కమీద పడుకోబెట్టి దుప్పటికప్పి, "రేళే నేనిక్కడుంటాను. మీరు పైకి వెళ్ళండి" అన్నాడు.

పదినిమిషాల్లో డాక్టరొచ్చారు. కాప్స్యూల్స్ తెచ్చిచ్చారు. ఈ మాత్రలు ఇప్పుడు, రేపు ఉదయం లేవగానే ఇవ్వండి. మరీ ఇబ్బం



దైతె రాత్రికి నన్ను పిలవండి. లేకపోతే పొద్దున్న పదిగంటలకి నేనే వస్తాను" అన్నారు.

ఆయన వెళ్ళాక కుర్రాడికి బలవంతంగా కాప్స్యూల్ మింగించి, విరిగిన పాలనీరు తాగించారు. నరహరి అక్కడే వున్నాడు. ఆయన తన పరుపు తెచ్చుకుని, అక్కడే వేసుకుని కూర్చున్నారు.

నరహరి పైకి వెళ్ళిపోయాడు. కుర్రాళ్ళు పైన చదువుకుంటున్నారు. కొంతసేపటికి వాళ్ళు చదువులు కట్టేసి పడుకున్నారు. నరహరి చాప, దిండు కిందే ఉన్నాయి. వెళ్ళి తెచ్చుకోబుద్ధికాలేదు. అలాగే గోడకొరిగి కూర్చున్నారు. రాముడికెందుకు టైఫాయ్డ్ లోకి దింపింది? అందరికీ వచ్చిన ఫ్లూ నయమయింది. వీడొక్కడికే టైఫాయిడ్‌కి తిరిగింది. ఎందుకిలాగయింది? ఒకవేళ ప్రాణాపాయం వస్తే... ఆలోచనల వెల్లువలో కొట్టుకుపోతున్న నరహరికి ఈ ఆలోచన భరించడం కష్టమయింది. రోగాన్ని, మృత్యువుని తను చూడనివాడేమీ కాదు. చిన్నప్పుడు తల్లిదండ్రుల మరణాన్ని స్వయంగా, కళ్ళారా చూసాడు. తరువాత మొదటి భార్య, అత్తగారు, రెండవ భార్య... తరువాత పిల్లలందర్నీ ఒక్కసారిగా దత్తుకివ్వడం ఒకరకమైన మరణం! అది తన మరణం! కాని ఇప్పుడు రాముడి చావుని ఊహించడం కూడా కష్టంగా వుంది ఎందుకని? ... తనింకా గట్టిపడలేదు. హిమలయాల్లోనే ఉండిపోయుంటే గట్టిపడేవాడేమో. మనసు పెంకుగట్టిపోయేదేమో. అక్కడుంటే అసలు తను గట్టిపడ్డాడా, మృదువుగానే ఉండిపోయాడా అని పరీక్షించుకునే సందర్భంగాని, అవసరంగాని లేవు. తన గుండె గట్టితనాన్ని పరీక్షించడానికి అక్కడ ఎవరన్నా చనిపోయే ప్రశ్నేలేదు. కాని ఈ ప్రాపంచిక బంధాల్లో వున్నంతవరకూ గట్టిపడే అవకాశమూ లేదు.

అంతలో రేళే కంగారుగా పైకి వచ్చారు. ఇతను కూర్చుని ఉన్నాడని చూసి, "కుర్రాడికి జ్వరం విపరీతంగా వుంది. ఏదేదో కలవరిస్తున్నాడు. మీరు ఒకసారొచ్చి చూస్తే బాగుంటుంది" అన్నాడు. నరహరి ఒకని మిషం అలాగే కూర్చున్నాడు. రేళేకి పిచ్చి కోపం వచ్చింది. "ఏమిటి మీ ప్రవర్తన? ఎందుకిలా చేస్తారో అర్థమేకాదు. మీరొచ్చి చూడకపోతే మానెయ్యండి. వెళ్ళి డాక్టర్నన్నా తీసుకురండి. నేను తీసుకొచ్చిన పాపానికి వాడు చస్తే నేనే మోసుకెళ్ళి కొరివి పెడతాను లెండి, మీ చేతేమీ చేయించను" అని కోపంగా అనేసి, కిందకి వెళ్ళిపోయాడు.

నరహరికి రేళేమీద కోపంరాలేదు. తన ప్రవర్తనకి సిగ్గు, తనమీద తనకే అసహ్యం కలిగాయి. నేనెందుకిలా వున్నాను? కిందకి వెళ్ళి కుర్రాడికి శుశ్రూష చేయాలి. ఇక్క

డున్న ఏభైఒక్క మందిలో మరెవరికైనా టైఫాయిడ్ వస్తే ఎలా చేసేవాడినో అలాగే చేయాలి. బంధాల బాదరబందీలో చిక్కుకో కుండా వుంటే సరి. అనుకుని కిందకి దిగాడు. రేళే కుర్రాడి గుండెలమీద నిమురు తున్నారు. ఇతనక్కడకి వెళ్ళి చెప్పాడు. "మీరు వెళ్ళి డాక్టర్ని తీసుకురండి. కుర్రాడిని నేను చూస్తాను"

ఒకసారి ఇతని ముఖం చూసి రేళే పైకి లేచారు. ఇతను రాముడి ముఖం వంకే చూస్తూ కూర్చున్నాడు. కుర్రాడేవేవో కలవ రింతలుగా మాట్లాడుతున్నాడు. అందులో ఒక్కమాట కూడా స్పష్టంగా అర్థంకాలేదు. నరహరి తన చేతిని వాడి ఒంటిమీద దగ్గ రగా తీసుకున్నాడు. అప్పుడు కలవరింత ఆగింది. కొంతసేపటికి డాక్టర్‌గారొచ్చారు. ఆయనిచ్చిన ఐసు కుర్రాడికి నుదుటిమీద పెట్టి పట్టుకున్నాడు. ఇప్పుడింక వేరే

మందులేమీ వద్దు. ఇప్పుడు ఈ ఐసు చాలు. జ్వరం తగ్గుతుంది. మళ్ళీ ఐసు పెట్టకండి. ఒకసారే పూర్తిగా దిగాలనుకో కూడదు, దిగకూడదు. నేను పొద్దున్నే ఏడు గంటలకొస్తాను" అని డాక్టర్‌గారు లేచారు.

"కుర్రాడు చాలా కలవరిస్తున్నాడు. దేనికీ అర్థంలేదు. ఒంటిమీద చెయ్యివేసి దగ్గరకి తీసుకుంటే ఊరుకుంటున్నాడు ఎందుకని?" అని అడిగాడు నరహరి.

రెండు నిమిషాలు ఆలోచించి డాక్టర్, "జ్వరతాపం ఎక్కువైనపుడు నిద్రాణమైన బుద్ధి దుర్బలమవుతుంది. అంతర్గతంగా వున్న బాధలు బయటకొస్తాయి. తల్లిదండ్రు ల్లేని, దిక్కులేని పిల్లలు ఆధారపడ్డానికి ఆశ్రయం ఏదీ దొరక్క అభద్రతాభావం ఫీలవుతారు. దగ్గరగా తీసుకుంటే అంతరం గానికి శాంతిగా వుంటుంది. జ్వరం తగ్గాక అదే సర్దుకుంటుంది" అన్నారు.

"అలాగయితే ఇలా అనాథశరణాల యాల్లో బతికే పిల్లలకే అనిపిస్తుందా? తల్లి దండ్రుల నీడలో పెరిగే పిల్లలకి అనిపిం చదా" అని రేళే ప్రశ్నించాడు.

"అదేమిటి? వాళ్ళకీ అలా అనిపించ వచ్చు. జ్వరం వచ్చినప్పుడు ఎలాంటి వాళ్ళ కయినా ఒక హెల్ప్‌లెస్ ఫీలింగ్ వస్తుంది. అసలు మనిషి జీవితమే అంత. అందు లోనూ ఇలాంటి అనాథపిల్లల సంగతి అడ గక్కర్లేదు. ఆల్‌రైట్, హివిల్‌బి ఓకే. గుడ్ నైట్!" అనేసి డాక్టర్ వెళ్ళిపోయాడు.

నరహరి రాముడి గుండెలమీద చెయ్యి వేసి నిమురుతూనే వున్నాడు. తలకి కట్టిన ఐస్ కరుగుతోంది. కొద్దిసేపటికి జ్వరం తగ్గి నట్టయింది. వేడి చల్లారాలంటే గడ్డకట్టిన మంచు కావాలి. కాని వేడిని చల్లార్చే ప్రయ త్నంలో మంచు కరగవలసిందే కదా అని అతడేదో ఆలోచించసాగాడు. రేళే, "పన్నెండు గంటలు దాటింది. ఇప్పుడు మీరు కూర్చుంటారా, నేను కూర్చోనా? ఇద్దర్లో ఒకరు ఇప్పుడు నిద్రపోతే మంచిది. రేపటికి జ్వరం తగ్గకపోతే రెండోవాళ్ళు దగ్గర కూర్చోవచ్చు" అన్నాడు.

"మీరు పైకి వెళ్ళి పడుకోండి. నేనిక్కడే వుంటాను"

రేళే పైకి వెళ్ళాడు. నరహరి కుర్రాడిమీద చేయి వుంచి కూర్చున్నాడు. కొద్దిసేపటికి వీపునొప్పి వచ్చింది. రాముడి తలకి కట్టిన ఐసు కరగిపోయింది. వాడిని కుడిచేత్తో దగ్గ రకి లాక్కుని నరహరి పక్కనే పడుకు న్నాడు. జ్వరం కొద్దిగా దిగినా వేడి బాగానే వుంది. కాని మళ్ళీ ఐసు కట్టకూడదని డాక్టర్ చెప్పాడు. జ్వరం దానంతటదే తగ్గాలి. ఒకేసారి పెద్ద ప్రమాణంతో ఐసు కడితే శరీరస్థితి తట్టుకోలేదేమో. కౌగలించుకోడంవల్ల వాడి భుజాలకి గుండె లకి చెమటలు పట్టాయి. తనకీ జ్వరం వచ్చి నట్టు వెచ్చటి ఫీలింగ్ వచ్చింది. అంత వేడిని సహించడం కష్టమే. రోగికయితే వేడి




ఒంట్లోంచి బయటకి వస్తుంది. కాని తను రోగి సంపర్కంవల్ల వచ్చే వేడితో అవస్థపడు తున్నాడు. కొద్దిగా మగత వచ్చినట్టయింది. ఏదో కల. విపరీతమైన ఉక్క. వేడికి ఆయాసం వచ్చి ఒళ్ళంతా చెమటలు కారు తోంది. చల్లటి చోటుకావాలి. హిమాల యాలు, సుమేరు ఎంత మాత్రం వేడిలేని గడ్డకట్టిపోయిన ఎత్తైన హిమాలయాల చల్ల దనం కనిపిస్తోంది.

అంతలో రాముడు ఎడమపక్కకిదొర్లాడు. వాడి ఎడమచెయ్యి నరహరిమీద పడింది. ఇతడికి మెలకువ వచ్చింది. జ్వరతాపంతో వాడు వేగంగా ఊపిరి వదులుతున్నాడు. లేచి కూర్చుని వాడి తలని తన తొడమీద పెట్టుకుని దగ్గర్లో ఉన్న పాల విరుగుడు నీటిని కొద్దిగా తాగించాడు. వాడు మళ్ళీ కళ్ళు మూసుకుని పడుకున్నాడు. ఊపిరి నిదానంగా ఆడటం మొదలుపెట్టింది.

★ ★ ★

జ్వరం తగ్గినా పిల్లాడు మాటలు కూడా ఆడలేనంత నీరసంగా పడుకున్నాడు. "జ్వరం త్వరగానే తగ్గింది. దానికితోడు మంచి పవర్‌ఫుల్ మందులు పడ్డాయి. ఇంకా పది కాప్స్యూల్స్ కోర్సు వుంది ఇలా నీరసంగానే వుంటాడు కొన్నాళ్ళు" అని డాక్ట ర్‌గారు కూడా చెప్పారు. నరహరి రెండు రోజులు పిల్లాడి పక్కనే వున్నాడు. మూడో రోజు ఉదయం మిగతాపిల్లలంతా భోజ నాలు చేసి వాళ్ళ స్కూళ్ళకి వెళ్ళాక రేళేని పిలిచి, "కాసేపు ఇక్కడే వుండండి నేను కొంచెం బయటకి వెళ్ళొస్తాను" అన్నాడు నరహరి.

అతను ఆశ్రమం వెనుక వున్న ఆడవిలోకి వెళ్ళడం రేళే కూడా గమనించాడు. ఏదో అర్జెంట్ పని వున్న మనిషిలా గబగబ అడుగులు వేసుకుంటూ వెళ్ళిపోయాడు. దట్టంగా చెట్లున్న చోటికి వెళ్ళి కూర్చుండిపో యాడు. ఒక గంటయ్యాక ఆలోచన మొద లయింది. "ఇప్పుడు రాముడికి జ్వరం తగ్గింది. నేనే స్వయంగా వాడిపక్కన పడు కున్నాను. ఉన్నంతసేపు దగ్గరగా తీసుకునే పడుకున్నాను. కావాలని దూరమవలేదు. అందువల్లే దూరంగా వెళ్ళడం కష్టంకాదు. ఇంక వీలైనంత త్వరలో వెళ్ళిపోవాలి ఇంకె న్నిరోజులు ఇక్కడ వేలాడటం?

అడవిలాగున్న దట్టమైన చెట్లమధ్య కూర్చుని అతను ఆ నిశ్చయం చేసుకు న్నాడు. అతనక్కడకొచ్చి అప్పటికే నాలు గైదు గంటల కాలం అయింది. ఇప్పుడు సాయంత్రం నాలుగ్గంటలయింది. హాస్పి టల్లో రేళే ఒక్కరే వున్నారు. రాముడినొది లేసి ఆయన ఏ పనికీ వెళ్ళడానికి లేదు అనే సంగతి గుర్తొచ్చి లేచి బయల్దేరాడు.

కాంపౌండ్ దాటి మెట్లెక్కి లోపలకొచ్చి రోగి గదిలోకి ప్రవేశించగానే అతనికి చాలా ఆశ్చర్యం కలిగింది. రేళే లేడు. సుమారు ఇరవైయేళ్ళ పిల్ల పరుపుమీద కూర్చుంది. రాముడి తల ఆ పిల్ల ఒడిలో వుంది.

రాముడి గుండెలమీద సున్నితంగా చేత్తో రాస్తున్న ఆమె ఇతనివేపు చూసింది.

ఈమెనెక్కడచూసాను? లలిత, చనిపో యిన లలిత ఎక్కడినుంచి వచ్చింది?

కూర్చున్న ఆ అమ్మాయి మాట్లాడింది. "నాన్నా ఇంతసేపు ఎక్కడికెళ్ళారు..." అని కన్నడంలో తడబడుతూ అని తరువాత మరాఠీలో "నేను పొద్దుట్నుంచీ మీకోసమే కాచుక్కూర్చున్నాను" అంది.

"ఓహ్! అర్థమయింది. ఈమె భవాని. ఒక మామూలు వాయిల్ చీర కట్టుకుని అలాంటిదే బ్లౌజ్ వేసుకుంది. ఈమె ఎక్క డుంది? ఎక్కడ్నుంచి వచ్చింది? నేనిక్కడు న్నట్టు ఎలా తెలిసింది? ఫరవాలేదు బాగానే వుంది అని ఏకకాలంలో ప్రశ్నలు, ఆలోచనలు మనసులో ముసురుతుంటే దగ్గ రకి వెళ్ళి కూర్చున్నాడు. ఆమె ఇంకేమీ అడ



గలేదు. కళ్ళల్లో నీళ్ళు నిండాయి. ఇంక ఆపుకోలేక వెక్కివెక్కి ఏడ్చింది. తన తొడమీదున్న రాముడిని వంగి వాటేసుకుని ఏడ్చింది. నరహరి ఊరికే కూర్చున్నాడు. ఆమె మెల్లగా తమాయించుకుని "ఎందుకిలా చేసారు? " అని అడిగింది.

తనేంచేసాడు? ఏ నిర్దిష్టక్రియకి అన్వయించి ఆమె ఆ ప్రశ్న అడిగిందో అతనికే తెలియదు. తన జీవితాన్నే ప్రశ్నిస్తోందా ఈమె. అతను ఒక్క మాట కూడా మాట్లాడకుండా కూర్చున్నాడు. ఇంకేం అడగాలో, చెప్పాలో తెలియకుండా ఆ పిల్ల కూర్చుంది. అరగంట గడిచినా ఒక్కరూ మాట్లాడలేదు. ఏమన్నా మాట్లాడాలి. కాని ఏం మాట్లాడాలో తెలియడంలేదు. మూగవాడిలా కూర్చున్నాడు. తనకెందుకిలా అయిందా అని విషాదంతో కూడిన ఆశ్చర్యం కూడా కలుగుతోంది.

అంతలో రేళే అక్కడకి వచ్చారు. భవాని నోరు విప్పింది. రేళే సాహేబ్, ఈయన నాతో మాట్లాడరు." నేనెందుకొచ్చానో మీరే చెప్పండి. విని నేను వెళ్ళిపోతాను" అంది.

"నాతో రండి, నేనంతా చెబుతాను" అని రేళేగారు నరహరి భుజంమీద చెయ్యివేసి అన్నారు. నరహరి మౌనంగా లేచి ఆయన వెంట వెళ్ళాడు. ఆశ్రమం వెనకాల ఒక చెట్టుకింద కూర్చుని చెప్పసాగారు. పొద్దున తను వెళ్ళిన కొద్దిసేపటికే ఆమె వచ్చిందట. బొంబాయిలో ఒక టైపిస్ట్ ఉద్యోగానికి ఇంటర్వ్యూకి వచ్చి జోగేశ్వరిలో తెలిసివారెవరింట్లోనో దిగిందట. చెంబూరు ఇంటికి వెళ్ళి తనకోసం విచారిస్తే నరహరి అంటూ ఎవరూ లేరని చెప్పారట. టైమ్స్ ఆఫ్ ఇండియా గుర్తొచ్చి అక్కడికి వెళ్తే శెనాయ్ గారు ఊళ్ళో లేరట. ఆఫీసులో ఆయన చిరునామా తెలుసుకుని ఇంటికి వెళ్తే ఆయన భార్య తను ఇక్కడున్న సంగతి చెప్పిందట. ఈ సంగతులన్నీ నిన్న తెలుసుకుని ఈ రోజు ఉదయం భోజనం చెయ్యగానే బయల్దేరి ఇక్కడకి వచ్చింది.

"నా సంగతంతా చెప్పారా? " నరహరి అడిగాడు.

"చెప్పాను. ఆమె సంగతి కూడా చెప్పింది. దత్తత చేసుకుని తీసికెళ్ళిన కొత్తల్లో పణందీకర్ దంపతులు చాలా బాగా చూసుకున్నారట. కొత్తబట్టలు, చెప్పులు ఇలా అవసరమైనవన్నీ కొనిచ్చి స్కూల్లోనూ చేర్చారట. ఆయన భార్య కూడా తను వెళ్ళిన చోటకల్లా చెయ్యిపట్టుకుని ఈ పిల్లనీ తీసికెళ్ళి 'నా కూతురు' అని చాలా ఆపేక్షగా చెప్పేదట.

కాని వాళ్ళకొక కొడుకున్నాడు కదా, విఠల్ అని అతను మాత్రం ఈ అమ్మాయిని చెల్లెలిగా ఒప్పుకోనేలేదట. ఎంత మాత్రం కలివిడిగా ఉండలేకపోయాడు. అన్నాళ్ళు తల్లిదండ్రులప్రేమ పూర్తిగా అతడికొక్కడికే దొరికేది గదా! ఇప్పుడు ఈపిల్ల పోటీకి రావడం వాడు సహించలేకపోయాడు. వాడు ఈ పిల్లని చూసినప్పుడల్లా తన అసహనాన్ని, అశాంతిని చూపిస్తూనే వున్నాడు. తల్లిదండ్రులు కొడుక్కి బుద్ధి చెప్పాలని, దిద్దాలనీ ప్రయత్నించారట.

ఒకసారి బంధువులావిడొకామె వచ్చి ఇంట్లో నెల రోజులుందట. ఆ కుర్రాడికి "మీ నాన్నకొచ్చేది అంతమాత్రం జీతం. అందులో ఈ పిల్లకి ఇవన్నీ చేయడం మొదలు పెడితే నీ చేతికింక దొరికేది చిప్పే" అని బాగా నేర్పి పెట్టిందట. దానితో ఆ కుర్రాడికి చెల్లెలిమీది అసహనం ఇంకా ఎక్కువయింది. త్ర్యంబకరావ్, ప్రజ్ఞాబాయి, "మా భవానిని బాగా చదివిస్తాం, సంగీతం నేర్పిస్తాం, పెద్ద చదువున్న పెళ్ళి కొడుకుని వెదికి పెళ్ళి చేస్తాం. మంచి కట్నం ఇచ్చి లక్షణంగా పెళ్ళిచేస్తాం. ఈ పిల్ల ఇంత చక్కగా ఉంటుంది. ఈ పిల్లని పెళ్ళాడే




వాడు అదృష్టవంతుడు" అనేవారట మొదట్లో. రానురాను ఆ ప్రేమ కబుర్లు తగ్గిపోయాయి.

"ఒక్కమాట నరహరిగారూ కడుపున పుట్టిన కొడుకు మొండిపట్టుపట్టి అసహనం చూపిస్తే తల్లిదండ్రులకయినా ఉత్సాహం ఎన్నిరోజులుంటుంది? ఆ తరువాత పెళ్ళి మాటలాడటం మానేసారు. ఆ కుర్రాడు ఈ పిల్లని బొత్తిగా పనిమనిషిలా చూసేవాడు. తల్లిదండ్రులు మరీ అంత దిగజారిపోలేద నుకోండి. కొన్నాళ్ళయ్యాక, "ఈ రోజుల్లో ఆడపిల్ల పెళ్ళంటే ఎంత కష్టం! ఏదో దొరి కిన సంబంధం చూసి మా బాధ్యత తీర్చు కుంటే చాలు" అనడం మొదలుపెట్టారట. ఇంకొన్నాళ్ళయ్యాక, "పెళ్ళి చెయ్యడం మా వల్లకాదుగాని, ఏదన్నా ఉద్యోగంలో చేరిపో. నీ కూడు, బట్ట నువ్వు సంపాదించుకుంటే మా బాధ్యత తీరినట్టే" అన్నారట. మెట్రిక్ చదివే పిల్లవి, అలాగే టైప్‌రైటింగ్ కూడా నేర్చుకో, త్వరగా ఉద్యోగం దొరుకుతుంది అని, అదీ నేర్పించారట. ఇప్పుడు మెట్రిక్ పాసయింది. బొంబాయిలో ఒక కంపెనీలో టైపిస్టు కావాలని ప్రకటన వచ్చిందట. ఇంటర్వ్యూకి అని వచ్చింది"

"తరువాత?"

రేళే చెప్పడానికి వెనుకాడారు. "మరీ ముఖ్యమైన విషయాలే చెప్పాను మీకు. ఆడపిల్ల- భవాని చాలా సున్నితమైన స్వభావంగలది. నాతో మాట్లాడుతూ కన్నీళ్ళు పెట్టుకుని చెప్పిన విషయాలు మీతో చెప్పను. ఎంతయినా మీరు తండ్రి కదా. మీరే తెలుసుకోండి"

"ఇప్పుడు నన్నేమి చెయ్యమంటారో చెప్పండి"

"ముందు వెళ్ళి కూతురితో మాట్లాడండి. మీకెలా తోస్తే అలా చేయండి. నేను ఏభై మంది అనాథపిల్లల్ని మీకంటే ముందు నుంచీ చూస్తూనే వున్నాను. ఏభైయొకటో వాడినీ తెచ్చాను. ఈ పిల్ల ఏభై రెండవది. ఇక్కడ ఆడపిల్లల్ని చేర్చుకోరు. అదీకాక ఈ అమ్మాయి పనిచేసి సంపాదించుకు తినగ లదు. కూటికి, గుడ్డకీ కొదవలేని మనిషి అనాథగా ఎలా బతుకుతుంది? మీరే అడ గండి" అని రేళే లేచారు.

నరహరి చెట్టుకిందే కూర్చున్నాడు. భవాని కథ అతని మనసుమీద ఒక కొత్త భారాన్ని తెచ్చిపెట్టింది. ఇప్పుడామె స్వతం త్రంగా కష్టపడి సంపాదించే శక్తిగల పిల్ల. తను ఆమెని పోషించక్కర్లేదు. అయినా ఒక కొత్త భారాన్ని, కొత్త బంధాన్ని తెచ్చి తనముందు నిలబడింది. మనసు ఆమెవైపు కనికరంతో ప్రవహిస్తోంది. ఆమె తల్లి లలిత గుర్తొస్తోంది. లలిత జ్ఞాపకంవల్ల తన తల్లిరూపం మనసులో తిరుగుతోంది. లోపల్నుంచి మరో ధ్వని హెచ్చరిస్తోంది... "బంధాలలో బందీవి కాకు. త్వరగా ఇక్క డ్నుంచి వెళ్ళిపో" అని.



రాత్రి ఎనిమిది గంటలయింది. నరహరి చెట్టుకిందే కూర్చున్నాడు. భవాని అక్కడికొ చ్చింది. వెన్నెల ఉండటంవల్ల స్పష్టంగా కన బడుతోంది. అతని ఎదురుగా కూర్చుని "మీ విషయం అంతా రేళే సాహెబ్ చెప్పారు. మీ దారికి అడ్డు కావాలని నేను రాలేదు. మీరు సంపాదించి నన్ను పోషించాల్సిన అవసరమూలేదు. కాని ఒక్క విషయం చెప్తాను వినండి"

అతను ప్రశ్నార్థకంగా ఆమెవంక చూసాడు. భవాని "మనిషికి అన్నం, బట్ట మాత్రమే ముఖ్యం కాదు. పణందీకర్ ఇంట్లో నాకేనాడూ తిండికి, బట్టకీ లోటురా లేదు. తీసికెళ్ళినందుకు నా బతుకు నేను బతకడానికి కావల్సినంత చేసి ఇంటర్వ్యూకి పంపించారు. కాని ఈ 'వస్తువు' నాది అనే భావనతో ప్రేమగా వుండే మనిషి ఒక్కరైనా లేకపోతే జీవనం ఎంత కష్టంగా



వుంటుందో. ఇదే తల్చుకుని ఈ మాట నా స్నేహితురాలితో చెప్పుకుని ఎన్నిసార్లో ఏడ్చాను. ఇప్పుడు పెద్దయ్యాక, ఇన్ని కష్టసుఖాలు చూసాక, ఈ రకమైన జీవితమే నాకు తప్పదని తెలిసాక మొదటిలా ఏడవటంలేదు. మిమ్మల్ని చూడగానే ఉన్నట్టుండి అలా ఏడుపొచ్చేసింది"

తండ్రి వింటూ కూర్చున్నాడు. కూతురు కంటిన్యూ చేసింది. "రేళేసాబ్ చెప్పారంతా. లక్ష్మణుడిని చంపేసారో, బానిసగా అమ్మేసారో, అడవుల్లో వదిలేసారో తెలియదు. వెతకడం మన శక్తికి మించిన పని. గణేశ్, విజయులకి ఒక దారి ఏర్పడింది. ఇక ఈ రాముడి స్థితి ఎందుకిలా అయింది? "

"ఏమయింది? "

"ఈ ఏభైమంది పిల్లలతోబాటు వాడెందుకు అనాథగా బతకాలి, అదీ తండ్రి బతికుండి కూడా? "

మాట్లాడద్దని తండ్రి సైగ చేసాడు. తరువాత, తన మనసులోని ఆలోచనలని దారిలో పెట్టుకుంటున్నట్టుగా ప్రయత్నించి చెప్పాడు. "ప్రపంచంలో ఎంతమంది నిజమైన అనాథలు లేరు! మమకారానికి లొంగిపోకూడదని, నా గుర్తు చెప్పవద్దని రేళేగారికి చెప్పాను. నాకు మళ్ళీ స్వంత బంధాలు పెట్టుకోడం ఇష్టంలేదు. రాముడి చదువు ఈ ఆశ్రమంలో బాగానే జరుగుతుంది"

"మీకు బంధం అక్కర్లేదు. బిడ్డ అనాథగానే పెరగాలా అయితే? నేనిప్పుడు అడుగుతున్నాను చెప్పండి. అప్పుడు మా అందర్నీ ఎందుకు దత్తతిచ్చారు? ఒకవేళ మీరే చనిపోయి, అమ్మో, వైదేహి పిన్నో బతికుంటే ఇలా దత్తుకిచ్చేసి సన్యాసం పుచ్చుకుని మమ్మల్ని వదిలి వెళ్ళేవారు కారు. మమ్మల్ని పల్లెకి తీసుకుపోయి కూలి చేసి పోషించేవారు. అలా పోషించలేకపోతే మాచేత కూడా కూలి చేయించేవారు. మొత్తంమీద అందరం కలిసి సంతోషంగా బతికేవాళ్ళం"

"అక్కడ మీరుండిన స్థితి నీకు గుర్తు లేదా? బయట చాకిరి చేసి సంపాదించడానికి నేను సిద్ధమే. కాని, ఇంట్లో మిమ్మల్ని చూసుకోగలిగే ఆడదిక్కెవరున్నారప్పుడు? "

"నాకంత వయసులేదు నిజమే. చిన్న పిల్లల్ని సరిగ్గా చూసుకో అని రెండు దెబ్బలు వేసి నేర్పవల్సింది నాకు. విజయ్‌కి గణేశ్‌కి రెండు తగల్నిచ్చి ఇంటిపట్టున వుండమని కట్టడి చేయవల్సింది. ఒకటి రెండేళ్ళయితే రామలక్ష్మణులు కూడా పెద్ద వాళ్ళయ్యేవారు. అప్పుడు ఇబ్బందయ్యేది కాదు. అసలు మీకు సన్యాసం తీసుకోవాలన్న కోరికే అపుడంత బలంగా వుండేదేమో"

ఈ మాటలు చెప్పేటప్పుడు భవాని గొంతు కోపంతో, దుఃఖంతో కంపించింది. "సన్యాసం, సాక్షాత్కారం, ముక్తి- ఇవన్నీ మీ ఒక్కరికోసం చేసిపెట్టివున్నాయా? ఇప్పుడొక పని చేయండి. రాముడికంతా వివరంగా చెప్పెయ్యండి. ఇదే మీ అక్క అని చెప్పెయ్యండి. నాకెలాగూ ఉద్యోగం దొరుకుతుంది. బొంబాయిలో ఒక గది తీసుకుమంటాను. నాతో వాడుంటాడు. తల్లి తండ్రి లేకుండా ఇన్నాళ్ళూ పెరిగింది చాలు. ఇంతవరకు వాడు నొచ్చుకున్నది, బాధపడ్డది చాలు. లక్ష్మణుడికి పట్టిన గతి చాలు. ఇప్పుడు రాముడికి నేను తల్లినవుతాను".

"అంటే నువ్వనేది...? " అని తడబడ్డాడు.

"స్పష్టంగా చెప్తాను. ఈమె నీ అక్క అని చెప్పాలంటే ముందు మీరు వాడికి తండ్రినని వాడెదురుగా ఒప్పుకోవాలి. అలా ఒప్పుకోడం మీ బాధ్యత. తరువాత నాకు మీకు సంబంధంలేదు. నాకీ బంధాలొద్దు అని మాకిద్దరికీ చెప్పేసి హాయిగా స్వతంత్రులవండి. మళ్ళీ హిమాలయాలకి వెళ్ళిపోండి. పోయిన మా అమ్మ, పిన్నిల మీద ఒట్టు

పెట్టి చెప్తున్నాను మిమ్మల్ని కాదనను. రాముడిని తల్లి, తండ్రి అయి పెంచుతాను. కనీసం వాడొక్కడికయినా అనాథ అనే భావం రానీకుండా పెంచుతాను"

నరహరి దిక్కుతోచనివాడిలా ఆమె ముఖాన్నే చూస్తూ కూర్చున్నాడు. అతనికి తల తిరిగిపోయింది. ఆమె అదే ధాటితో, అదే ఊపుతో అంది. "గణేశ్ మాట వదిలెయ్యండి, విజయ్‌దగ్గరకే వెళ్ళాలి. 'నేను నీ తండ్రిని. నువ్వు కావాలంటే బసుబాబు దగ్గరే వుండు. వాళ్ళనే తల్లిదండ్రులుగా భావించు. కాని నీకీ సంగతి చెప్పి, నేను వున్న స్థలం ఎక్కడో తెలుపడం నా బాధ్యతగా భావించి వచ్చాను' అని వాడికి చెప్పాలి"

ఈ మాట చెప్పి ఆమె అతని ముఖాన్నే చూస్తూ కూర్చుంది. అతనేమీ మాట్లాడలేదు. ఐదు నిమిషాలూరుకుని భవాని లేచి నుంచుని, "నేను జోగేశ్వరిలో దిగాను. నా స్నేహితురాలని చెప్పాను కదా, ఆమె, ఆమె భర్త అక్కడే వున్నారు. ఆ ఇంటి చిరునామా రేళే సాహేబ్‌కి చెప్పాను. ఇప్పుడు నేను వెళ్తాను. మీరు ఆలోచించండి. నేనె లాగా ఉద్యోగంలో చేరతాను. మీరూ ఒక ఉద్యోగంలో చేరండి. రాముడు, మీరు నాతోనే వుంటే సంతోషం. లేకపోతే ఉద్యోగం దొరగ్గానే వచ్చి రాముడిని తీసికెళ్తాను. శేఠ్‌జీ దగ్గరకి వెళ్ళి సంగతి చెప్పి, అనుమతి తీసుకుంటే 'పంపను' అనరు" అని చెప్పేసి, ఇంకొక్క క్షణం ఆగకుండా, వెనక్కి తిరిగి చూడకుండా వెళ్ళిపోయింది.

నరహరి నెత్తిన పిడుగు పడ్డవాడిలా ఉండిపోయాడు. భవాని మాటల ఉద్దేశం ఏమిటి? నేను పని చేసి వాళ్ళని పోషించాలా? కాదు, ఆమెకి పనిచేసి సంపాదించే శక్తి ఉంది. అందుకు సిద్ధపడే వచ్చింది. రాముడినీ పోషిస్తుంది, నేను రాముడికి, నాకు ఉన్న సంబంధాన్ని ఒప్పుకోవాలి. అంటే మళ్ళీ బంధాలలో పడి చిక్కుకోవాలి. బంధంఅంటే ఏమిటి? చాలా కటువుగా మాట్లాడింది. "సన్యాసం" కోరిక తీర్చకోడానికి మీరు పిల్లల్ని దత్తతిచ్చి చేతులు కడుక్కుని వెళ్ళిపోయారంది. అమ్మో, వైదేహో బతికివుంటే ఇలా చేసేవారు కారంది. 'ఎందుకలా చెయ్యరు'? అతనికి జవాబు దొరకలేదు.

అంతలో ఆ చెట్టు దగ్గరికెవరో వచ్చారు. రేళే... ఇతని దగ్గరగా వచ్చి "రావుగారూ రాత్రి పన్నెండవుతోంది. నేను రామ్‌చంద్ దగ్గర పడుకుంటాను. ముందుగేటు తాళం వెయ్యాలి. లోపలికి రండి" అన్నారు.

నరహరి "చూడండి, ఏం చెయ్యాలో నాకేమీ పాలుబోవటంలేదు. అమ్మాయొచ్చి అంది"

"అది నాకు తెలుసు..."

"ఇప్పుడేం చెయ్యడం? "

"మాట్లాడకుండా అమ్మాయి చెప్పినట్టు చేయండి"

రేళేగారు కూడా ఆ మాటే అంటున్నారు. భవాని చెప్పినట్టు చేయడమే తనకి సరిపోయే దారేమో! అదే మంచిది. కాని మనసులో ఏదో పోగొట్టుకున్నట్టవుతోంది. తన అంతరంగంలోని కోరిక మరో మార్గంగుండా కూడా వంచింపబడుతోందేమోనని భయం కలిగింది. రేళే అన్నాడు. "లేవండి, అర్థరాత్రి అవుతోంది".

అతను లేచి ఆయనతో లోపలికొచ్చాడు. ఆశ్రమం గేటు తాళం పెట్టి రేళే ఈయన వెనకే వచ్చారు.

"మీరెక్కడ పడుకుంటారు? " అనడిగారు రేళే.

"ఇక్కడే, రాముడి దగ్గర. మీరు పైకి వెళ్ళండి"

ఆయన పైకి వెళ్ళారు. నరహరి రాముడి

దగ్గర పడుకున్నాడు. కుర్రాడు సుఖంగా నిద్రపోతున్నాడు. నరహరి మనసు ఆలోచిస్తూనే వుంది. అవును, ఇదే సరి అయిన దారి. దీనివల్లే శాంతిదొరుకుతుంది. పొద్దున్నే లేవగానే 'జోగేశ్వరి' వెళ్ళి భవానిని చూడాలి. "నాదేమీ లేదు. నువ్వు చెప్పినట్టు విని ఉండిపోతాను" అనాలి. ఆ నిశ్చయం తీసుకున్నాక నిద్రమత్తు వచ్చింది. తెలిసో, తెలియకో, నిద్రలోనో అతను పక్కకి తిరిగి నిద్రపోతున్న కొడుకు మీద చెయ్యివేసుకుని పడుకున్నాడు.

అటు ఇటు దొర్లుతూ ఆలోచిస్తుండగానే లోకల్ ట్రెయిన్స్ శబ్దాలు వినపడ్డం మొదలయింది. లేచి పైకి వెళ్ళి రేళేని నిద్రలేపాడు. 'జోగేశ్వరి'లో భవాని దిగిన ఇంటి చిరునామా అడిగాడు. ఆయనకింకా నిద్రతీరలేదు. తలదిండు దగ్గర విప్పి పెట్టిన జుబ్బా జేబులోంచి ఒక చీటి తీసిచ్చి మళ్ళీ నిద్రపోయారు. అది చేతిలో పట్టుకుని నరహరి కిందకి దిగాడు. చొక్కా తొడుక్కుని ఆశ్రమం గేటు మూసి బయటకి నడిచాడు. అప్పటికింకా మసక వెలుతురు వస్తోంది. మిల్లు కార్మికులంతా స్టేషన్‌వేపు వెళ్తున్నారు. నరహరి కూడా స్టేషన్‌వేపు వెళ్ళాడు. టికెట్ తీసుకోడం ఒక్కటే మిగిలింది. అక్కడె ఒక బెంచీమీద కూర్చున్నాడు.

మళ్ళీ తలలో తల ఎత్తిన గందరగోళమాపడం కష్టమయింది. స్వార్థం- పరార్థం ఈ ద్వంద్వంనుంచి విడుదల లేదా? కొండ, బయలు ఈ రెండూ కలిసే చోటేది? 'ఈ ప్రశ్నలు వేధిస్తుంటే శెనాయ్ అన్న మాట గుర్తుకొచ్చింది. నిష్కామ సేవ సంగతి అలాగుంచి, ప్రపంచంలో జరిగే మంచి పనులు, పరోపకారం మొదలైనవి ఎక్కువగా స్వలాభాపేక్షతో చేసే పనులవల్లే జరుగుతున్నాయి. అందుకు హిమ్మత్ సింహ్‌జీగారే ఉదాహరణ. ఈ అనాథాశ్రమమే ఉదాహరణ.

తన తదుపరి మార్గం వెంటనే తెలిసింది. తన పరిస్థితిని వివరించి హిమ్మత్ సింహ్‌జీ గారిని అడగాలి. "నేను ఉద్యోగం చేసి తీరాల్సిన పరిస్థితి వచ్చింది. కాని, అనాథాశ్రమంలోని పిల్లల సేవ చేయాలన్న కాంక్ష చాలా వుంది. ఎలాగూ వార్డెన్‌కి జీతం, ఉండటానికి ఇల్లు ఇస్తాననే మీరు ప్రకటించారు కదా, ఇకనుంచి నాకు జీతం నిర్ణయించండి. నాకు, మా అమ్మాయికి నివాసానికొక గది ఇవ్వండి. మేం ఆశ్రమంలో భోజనం చెయ్యం. నేను మొదటిలాగే పగలు, రాత్రి ఆశ్రమం జాగ్రత్తలు చూసుకుంటాను. మొదటిలాగే పిల్లల్ని ప్రేమగా చూసుకుంటాను. పెద్దవాళ్ళని చేస్తాను.

అందుకాయన ఒప్పుకోవచ్చు లేదా రేళే చేత చెప్పించవచ్చు ఒకవేళ ఒప్పుకోకపోతే? అనే ప్రశ్న తలెత్తింది. ఒప్పుకోకపోతే ఏం చెయ్యాలి? అనే అలజడి కూడా కలిగింది. ఒప్పుకోకేం చేస్తారు? ఒప్పుకుని తీరతారు అనే నమ్మకం వున్నంతసేపు ఈ ప్రశ్నలేనేలేదు. నా కర్తవ్యనిష్ఠ, నిజాయితీ తెలిసిన శేఠ్‌జీ ఎందుకొప్పుకోరు? అని మనసు సమాధానం చెప్పింది. ఒప్పుకోకపోతే అనే ప్రశ్న మాటిమాటికీ నేనున్నానంటూ లేచినుంచుంటూనే వుంది.

అతను ఆలోచిస్తూ అక్కడే కూర్చున్నాడు. బాగా వెలుగు వచ్చేసింది. చివరికి ఒక క్షణంలో జవాబు దొరికింది అతని నిర్ణయ శక్తికి. ఒప్పుకోకపోతే అనాథాశ్రమం ఉద్యోగం వదిలేయడం, ఇంకెక్కడయినా పనికి చేరడం.

ఈ తీర్మానంతో ఒక్క క్షణం కింద పడ్డట్టయినా, మరో క్షణానికి లేచి నుంచున్నట్టయింది. తను మొదటికంటే బాగా ఆశ్రమంలో పిల్లల సేవ చేయడానికి అర్హుడనయ్యాననిపించింది. కూర్చున్న చోటినుంచి లేచి టికెట్ ఇచ్చే కౌంటర్ దగ్గరికి నడిచాడు. ●




# చతుర కథలు

## తత్వం

'వేరు కాపురం' అన్నది రాధికకి మనసులో చిన్నప్పట్నించీ ఉన్న కోరిక. అయితే సంబంధం మంచిదని సమిష్టి కుటుంబం అయినా శ్రీనివాస్‌కే ఇచ్చి చేశారు. వాళ్ల పెళ్లవగానే ఆషాఢ మాసం వచ్చిపడింది. అది అయ్యేలోగా శ్రీనివాస్‌కి ఏలూరునించి విజయవాడకి బదిలీ అయింది. రాధిక కోరిక తీరి వేరు కాపురం పెట్టింది.

మొదటి మూడు నెలలు గడిచాక రాధికకి టీచర్‌గా వాళ్లున్న పేటలోనే నడిచి వెళ్లేంత దూరంలో ఓ స్కూల్‌లో ఉద్యోగం దొరికింది.

రాధిక ఆ సంగతి తండ్రికి లెటర్ రాసింది అసలే కొత్తకాపురం, పైగా రెండే రెండు గదుల ఇల్లు కాబట్టి రాధిక తల్లితండ్రులు తాము వెళ్లి ఆ కొత్త దంపతులని డిస్టర్బ్ చేయకూడదని ఇంతకాలం కూతురి కాపురం చూడటానికి వెళ్లలేదు.

ఆ లెటర్ చదివాక కాస్త సాయంగా ఉన్నట్లవుతుందని వెళ్లారు. అయితే రాధిక ఇంటికి వెళ్లేసరికి తాళం కప్ప కనబడింది వాళ్లకి. స్కూల్‌కి వెళ్తే తండ్రిని చూసి ఆశ్చర్య పడింది, సంతోషపడింది. వాళ్ల లెటర్ అంద నందుకు నొచ్చుకుంది రాధిక.

ఇంటితాళం చెవి ఇచ్చి, తను మధ్యాహ్నం వచ్చేస్తానని చెప్పి పంపింది. తాళం తీసి లోపలకి వెళ్లిన ఆ దంపతులు అవాక్కయ్యారు.

వెనక గదిలోంచి పెరటిలోకి వున్న తలుపు దగ్గరకి వేసివుంది. ఇంట్లో సామానంతా చెల్లాచెదురుగా పడివుంది.

అలమరలో ఉండాల్సిన పుస్తకాలు, తెరచిన బీరువాలో ఉండాల్సిన బట్టలు నేలమీద కుప్పగా పడివున్నాయి.

"దొంగపడినట్లున్నాడండీ'' చెప్పిందా విడ భర్తతో. అరగంటలో పోలీసులు వచ్చి ఆ ఇంటిని పరీక్షగా చూసి చెప్పారు...

"దొంగలు కాస్త ఖరీదైన రకాల్లా ఉన్నారు. ఇల్లంతా విలువైన వాటికోసం మాత్రమే వెదికారు''

ఈలోగా రాధిక వచ్చింది.




"ఏమేం పోయాయో లిస్ట్ రాసివ్వమ్మా'' చెప్పాడు ఎస్.ఐ. రాధిక అందరివంక సిగ్గుగా చూసి తలవంచుకుని చెప్పింది...

"దొంగలు పడలేదండి. మా ఇల్లెపుడూ ఇంతే! వెనక తలుపు మూయడం మరిచినట్లున్నాను, అంతే! మావారికి శుభ్రత తెలీదు. ఇల్లు ఎంత సర్దినా మళ్లీ ఆగం చేస్తారని విసిగి నెల రోజులుగా సర్దడం మానేశాను''

-మల్లాది వెంకట కృష్ణమూర్తి



# దొందూ దొందే!

ముషీరాబాద్ జైల్లోని ఒక సెల్‌లో వున్న గంగాధరం మనసు ఆందోళనగా వుంది. జైలు జీవితం అతనికి కొత్తకాదు. అది తొమ్మిదోసారి దొంగతనం నేరం మీద జైలు శిక్ష అనుభవించడం.

అతని మనసు ఆందోళనగా వుండడానికి గల కారణం, అతను జైలు సూపరింటెండెంట్‌కు పెట్టుకున్న అప్లికేషన్.

వచ్చే శుక్రవారం తమ మొదటి మేరేజ్ ఏనివర్సిరీ అని, ఆ ఒక్కరోజూ తన కుటుంబంతో గడిపేందుకు అనువుగా తనకి పెరోల్ మంజూరు చేయమని ఆ అప్లికేషన్.




పెరోల్ ఇవ్వడానికి ప్రభుత్వం నిర్ణయించిన కారణాల్లో అది ఒకటికాదు. అయితే జైలు సూపరింటెండెంట్ తన డిస్క్రిషన్ మీద రెండు రోజులు మించకుండా పెరోల్‌ని ఖైదీలకి శాంక్షన్ చేసే నియమం వుంది. అందుకనే గంగాధరం మనసు ఆందోళనగా వుంది, యస్ అంటాడాలేక నో అంటాడా అని. కొత్తగా వచ్చిన ఆ సూపరింటెండెంట్ ఖైదీల విషయంలో మానవత్వంతో ప్రవర్తిస్తాడని విని ఉండటంతో గంగాధరం జవాబు కోసం ఆశగా ఎదురు చూడసాగాడు.

సోమవారం కాస్తా మంగళవారం అయింది. మంగళవారం బుధవారం అయింది. ఆ రోజో, తప్పితే ఆ మర్నాడో తన అప్లికేషన్ మీద ఏక్షన్ తీసుకోవాలి.

బుధవారం మధ్యాహ్నం సెంట్రీ వచ్చి చెప్పాడు, జైల్ సూపరింటెండెంట్ అతనికి ఇరవై నాలుగ్గంటలుకి పెరోల్ మంజూరు చేశాడనీ, శుక్రవారం ఉదయం తొమ్మిదికి వెళ్లి శనివారం వుదయం తొమ్మిదికి తిరిగి జైలుకు చేరుకోవాలని.

యువకుడైన గంగాధరం తన భార్యతో గడిపే సమయంకోసం ఉవ్విళ్లూరుతూ ఎదురు చూడసాగాడు.



శుక్రవారం ఉదయం గంగాధరం బస్ దిగి తన ఇంటివైపు నడవసాగాడు. అతని మనసంతా ఎంతో ఆనందంగా వుంది. ధనలక్ష్మి ఇప్పుడు ఇంట్లోనే వుండి వుంటుందా? లేక తనకోసం జైలుకి వెళ్లివుంటుందా? విజిటింగ్ అవర్స్ సాయంత్రం, పైగా తను వస్తున్నట్లు తెలుసుగదా! కనుక ఇంట్లోనే వుండివుండాలి.

కానీ ఇంటికి వేలాడుతున్న తాళంకప్పని చూడగానే అతను హతాశుడయ్యాడు. క్షణకాలం తటపటాయించి పక్కింటి తలుపుతట్టాడు. పక్కింటి నాడిముత్తు తలుపు తీసి గంగాధరాన్ని చూశాడు.

"వచ్చావన్నమాట! నువ్వివాళ పెరోల్‌లో వస్తున్నట్లు నిన్న మీ ఆవిడ అందరికీ చాటింపు వేసిందిలే" చెప్పాడు నాడిముత్తు.

"మరి సరిగ్గా నేను వచ్చేటైంకే ఎక్కడికి వెళ్లిందబ్బా?" అడిగాడు గంగాధరం.

"నీకు ఘనంగా ఆతిధ్యం ఇవ్వాలిగదా! మరి మీ ఆవిడ దగ్గర డబ్బులేదాయె! అందుకోసం దొంగతనానికి వెళ్లింది. అలవాటు తప్పినట్లుంది పాపం! రాత్రి పోలీసులకి పట్టుబడింది. అంటే లాకప్‌లోనే ఉండి ఉండాలి'' చెప్పాడు నాడిముత్తు.

-డి.పద్మజ





# వింత ప్రపంచం

## యురేకా!

జీన్ తింగుళీ అనే కళాకారుడు తయారుచేసిన యురేకా అనే యంత్రాన్ని మొదటిసారిగా స్విట్జర్లాండులోని జూరిచ్ పార్క్‌లో ప్రదర్శనకి పెట్టారు. అంతక్రితం అతడు దాన్ని చాలా ప్రదేశాల్లో ప్రదర్శనకి పెట్టాలని ప్రయత్నించాడు గానీ వీలుకాలేదు. పైకి ఈ యంత్రాన్ని చూడగానే నవ్వుపుట్టిస్తుందిగానీ, గుడ్డిగా దూసుకుపోతున్న ఇప్పటి యంత్రవిధానాన్ని వెక్కిరిస్తున్న భావన కనిపిస్తుంది ఆ యంత్రాన్ని చూస్తే.

ప్రస్తుతం అది జూరిచ్ పార్క్‌లో ఓ ప్రత్యేక ఆకర్షణగా తయారైంది. ఏప్రిల్ నుంచి అక్టోబర్ మాసంవరకు ఉదయం 11 నుంచి సాయంత్రం 6 వరకు వేలాది సందర్శకులు ఈ యంత్రాన్ని తిలకించేందుకు వస్తారు. ఈ మెషీన్ తనకు అమర్చిన చేతులు, సాసర్స్, రంగుల రిబ్బన్లతో చూడ్డానికి ఆకర్షణీయంగా కనిపిస్తుంది. దీని పొడవు 8 మీటర్లు. ఆమధ్య ఈ యంత్రాన్ని ఆ పార్క్‌నుంచి తీసివేయాలనే సూచన వచ్చింది గానీ ప్రజలు గొడవ చేయడంతో దాన్ని అక్కడే వుంచేయడం జరిగింది.

చిన్నతనంనుంచే చక్రాలంటే ఇష్టపడేవాడు తింగుళీ. అది ఓ ఫ్యాక్టరీ జెయింట్ వీలయినా లేదా, చిన్నపిల్లలాడుకునే సైకిల్ చక్రమయినాసరే. చక్రాల నిర్మాణంలో సాంకేతిక, ఆర్థిక ప్రగతులు దాగి వున్నాయంటాడాయన. మోటారు పందాలంటే ఆయనకి చాలా ఇష్టం. మనిషి, యంత్రం కలిసికట్టుగా పరిగెత్తే ఆ వినోదం చూడటం తనకెంతో ప్రియమంటాడతడు.

తింగుళీ 1925లో స్విట్జర్లాండులోని ఫ్రీబర్గ్‌లో పుట్టాడు. అక్కడి అడవుల సౌందర్యం అతన్ని అమితంగా ఆకర్షించేది. డ్రాయింగ్‌లోను, మిగిలిన కొన్ని లలిత కళలలోను వున్న ఆసక్తికారణంగా అతడు చిన్నప్పుడే ఆర్ట్‌స్కూల్లో చేరాడు. అటుపైన 26వ సంవత్సరం వచ్చేసరికి అతడి దృష్టి యంత్రనిర్మాణంవైపుకి మళ్ళింది. 1953లో అతడు భార్యా పిల్లలతోసహా పారిస్ వెళ్ళి అక్కడ యంత్రనిర్మాణాన్ని ప్రారంభించాడు. ఇతడు నిర్మించే యంత్రాలు యాంత్రికంగా కాక కళాత్మకంగా కూడా కనిపిస్తాయి. ఇతడు తయారు చేసిన ఓ యంత్రం ప్రేక్షకులతో టేబిల్ టెన్నిస్ ఆడుతుంది.



# ఫైటింగ్ స్పిరిట్

క్రికెట్ ఎంత ఉత్సాహపూరితమైన ఆటనో చెప్పాల్సిన అవసరం లేదు. అయితే అందులో కొన్ని బాధాపూరితమైన, నైరాశ్యం నిండిన సంఘటనలూ వున్నాయి.

1975 జూన్ 7వ తేదీన క్రికెట్ చరిత్రలో మరిచిపోలేని నైరాశ్యపూరిత సంఘటన జరిగింది. 5 రోజుల క్రికెట్ ఆటతో పోలిస్తే ఒకరోజు ఆడే ఆట ఎంతో ఉత్సాహపూరితంగా వుండాలి నిజానికి. అయినాఆనాటి ఒక్కరోజు ఆట చాలా నిరుత్సాహంగా అనిపించింది ప్రేక్షకులకు. ఆ ఆటలో ఇంగ్లండు 60 ఓవర్లకు 466 పరుగులు తీయగా ఇండియా 3 వికెట్ల నష్టానికి కేవలం 132 పరుగులు మాత్రం తీసింది. ముఖ్యంగా అందులో ఆడినంత హీనంగా గవాస్కర్ ఏ ఆటలోనూ ఆడిన జాడలులేవు. అతడు 60 ఓవర్లకి కేవలం 36 పరుగులు మాత్రం చెయ్యగలిగాడు. నిజంగా ఆట బావుండలేదు అని చెప్పడానికి కొలమానం ఏంలేదు. 1984-85లో ఆస్ట్రేలియా శ్రీలంకని 232 పరుగులతోను, 1985-86లో న్యూజిలాండ్ ఆస్ట్రేలియాను 202 పరుగులతోను ఓడించింది. ఇది ఓడిపోయిన జట్టుకు నిజంగా తలవంచుకోవాల్సిన అనుభవమే.

మొట్టమొదటి ప్రపంచ కప్పు ఆటని తీసుకుందాం. ఇది 1975లో నాటింగ్‌హామ్‌లో పాకిస్థాన్, శ్రీలంకలమధ్య జరిగింది. 60 ఓవర్లలో పాకిస్థాన్ 330 పరుగులు చేసింది. అంతకు ముందు జరిగిన ఆటల్లో శ్రీలంక చక్కని ఆట ఆడటంతో విజయం లంకేయులదే అనుకున్నారు ప్రేక్షకులు. కానీ వారి ఊహకి వ్యతిరేకంగా 50 ఓవర్లలో కేవలం 138 పరుగులు మాత్రం చేసి




అంతా అవుట్ అయ్యారు.

1983లో ఇండియా ప్రపంచకప్పును గెలుచుకున్నా ఆ ఆట కూడా ఇండియా చాలా హీనంగా ఆడిందని చెప్పక తప్పదు. నాటింగ్‌హామ్‌లో ఆస్ట్రేలియాతో ఇండియా ఆడినప్పుడు ఆస్ట్రేలియా 9 వికెట్ల నష్టానికి 60 ఓవర్లలో 320 పరుగులు చేయగా, ఇండియన్ ఆటగాళ్ళు ఓడిపోయామన్న దుగ్ధతో చాలా నీతిబాహ్యంగా ప్రవర్తించి బ్యాట్లను విసిరి పడేశారు. కేవలం 28 ఓవర్లలో 158 పరుగులు చేసి అందరూ అవుట్ అయ్యారు.

1986లో షార్జాలో జరిగిన ఛాంపియన్‌షిప్ ట్రోఫీలో వెస్టిండీస్ జట్టు 45 ఓవర్లలో 8 వికెట్ల నష్టానికి 198 పరుగులు చేసింది. నిజానికి ప్రత్యర్థి జట్టు అయిన ఇండియాకి ఆ స్కోర్‌ను అధిగమించడం కష్టమైన పని కాదు. అయినా ఇండియా ఎప్పుడూ ఫైటింగ్ స్పిరిట్‌ను కోల్పోతూ వస్తోంది. మొదటి 31 పరుగుల్లోనే 3 వికెట్లను కోల్పోయింది ఇండియా.

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel: 290328; Office Address: CHATURA Telugu Monthly, Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 318181, 399444; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75291; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 83216; Suryapet: 21146; Guntur: 353942.

CHATURA Telugu Monthly Hyderabad - 500 482 Regd. No. H/HD/402